## అంకితం

మానవజీవిత సత్యపథంలో
నాకు కొత్తవెలుగులు చూపిన
మిత్రులు
శ్రీ బోయి భీమన్నగారికి

౧

పనిమనిషి వెనకాల మేడమెట్లు ఎక్కుతున్నప్పుడు, మధుకి ఏదో వింత ప్రపంచంలోకి వెడుతున్నట్లు తోచింది. వలయాకారంలో బోలెడు మెట్లు. రెండువేపులా ఇనుపకమ్ములు. లతలతో కమ్ములు పైకి పాకుతున్నాయి. పాముకుమల్లె మెట్లు పైకి రెండుచుట్లు తిరిగి ఉన్నాయి. ఎందుకో ఇనుపవూచలమధ్య తనను బంధించివేసినట్లు తోచింది మధుకి. పనిమనిషిని పక్కకి నెట్టుతో, ఒక్క వూపుతో మెట్లు ఎక్కాడు మధు. పైన పెద్దహాలు - హాలుకి ఇరువేపులా సువిశాలమైనగదులు - కుడి పక్కనవున్న మూడు గదుల్లో మధ్యగది చూపించి పనిమనిషి వచ్చిన దారినే క్రిందికి వెళ్ళిపోయాడు. మధు నెమ్మదిగా ఆ గదిలోకి వెళ్లాడు. గదిలో రెండు బీరువాలు - ఒక బీరువాలో కుర్రవాడి బట్టలు - ఇంకొక బీరువాలో ఆటవస్తువులు. బీరువాలపక్కన చిన్నసైజు మంచం - మంచానికి దోమతెర - ఆ పక్కనే ఒక పడకకుర్చీ - ఒక గుడ్డలస్టాండ్ - షర్టులు, బుష్‌కోట్లు, ప్యాంట్లు స్టాండ్ వంకెలకి తగిలించి వున్నాయి. గదికి ఇంకొకవేపు ఒక టేబులూ, దానిచుట్టూ నాలుగు కుర్చీలు అమర్చబడి ఉన్నాయి. కింద పెద్ద జంపుఖానా పరిచి వుంది. గోడలకి ఏవో ఫోటోలు - అవి ఆ కుర్రవాడివై వుంటాయని తోచింది మధుకి - అతను ఏ ఫోటోనీ పరికించి చూడలేదు. ఏ వస్తువనీ నిదానించి పరిశీలించలేదు. వెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నాడు - చదువు చెప్పి త్వరగా వెడుదామంటే ఎంతకీ కుర్రవాడు రాడు. కాగా మధుకి ఏమీ తోచడం లేదు. గోడగడియారం ఎదురుగా టిక్కుటిక్కు మంటున్నది. మధు ఆ గడియారాన్ని ఎందుకో అంతవరకు గమనించనే లేదు. ధ్వనినిబట్టి - దాని ఉనికిని గుర్తించాడు. తల పైకి ఎత్తి ఒక మాటు గడియారంకే

చూచాడు. ఇంతలోకే అది ఆరు గంటలు కొట్టడం మొదలెట్టింది. అనా లోచితంగా మధు గంటలు లెక్కించడం మొదలు పెట్టాడు. ఒక్కటి... చప్పుడు నిశ్శబ్దంలో ప్రయాణంచేసి మధు హృదయంపైన ఠంగున మ్రోగుతున్నది...రెండు...బుర్రలో ఏవో స్మృతులు ముసురుకుంటు న్నాయి. ఏవో చెరగని జ్ఞాపకాలు వువ్వెత్తుగా పైకి లేస్తున్నాయి... రామచంద్రపురం...మధు స్వగ్రామం...ఒకనాటి సాయంత్రం ఆరు గంటలు...ఇంట్లో పనిమనుషులు దీపాలు వెలిగిస్తున్నారు...కిరసనాయల్ లాంతర్లు...ఒక పనిమనిషి ఒక లాంతరుతెచ్చి ఆఫీసుగదిలో పెట్టాడు... తనకి అప్పటికింకా చిన్నతనం...తను భువనగిరి తాలూకా గ్రామంలో చదువుకుంటున్నాడు. పరీక్షలై పోయినాయి. ఎండాకాలపు శెలవులకి యింటికి వచ్చాడు. తను సెకెండుఫారం ప్యాసయినాడు. థర్డుఫారంలోకి వచ్చాడు. పనిమనిషి లాంతరు తేవడంతోనే తను కాశీమజిలీలు ముందర వేసుకుని చదవడం ప్రారంభించాడు. కథ మంచి పట్టులో వుంది. కథలో కొట్టుకపోతూ తను గదిలోకి తండ్రివచ్చిన సంగతి గమనించ లేదు. రాజకుమారుని సాహసకృత్యాలతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. రఘురామయ్య ఆఫీసుగదిలో మధు దీక్షగా ఏదో పుస్తకం చదవడం గమనించాడు. బహుశా అతని హృదయం వాత్సల్యంతో తొణికిసలాడి ఉంటుంది. కుమారుడు, ఏదో ప్రయోజకుడు అవుతాడని భావించి ఉంటాడు. "ఏం పుస్తకంరా అది?" అని రఘురామయ్య ఎంతో లాల నగా మధుని అడిగాడు.

మధు తను చదువుతున్న పుస్తకం పేరు చెప్పాడు.

మధుకి అప్పటికి తొమ్మిది ఏళ్ళు.

"పుస్తకం సాఫీగా చదువగలుగుతున్నావా?" రఘురామయ్య తన కంఠంలో సందేహాన్ని ధ్వనింపజేస్తూ ఎంతో ఆతురతగా ప్రశ్నిం చాడు.

మధు "ఔ" నన్నట్లు తల వూపాడు.

"అర్థ మౌతున్నదా ?" రఘురామయ్య మధు జవాబుకి కొంత కుదుటబడి తిరిగి కుమారుడిని ప్రశ్నించాడు.

"అక్కడక్కడ కొన్ని శబ్దాలు అర్థం కావడం లేదు. కాని కథ మాత్రం తెలుస్తున్నది" అని మధు టూకీగా సమాధానం చెప్పాడు.

రఘురామయ్య హృదయం పుత్రవాత్సల్యంతో ఎగిరి గంతు వేసింది.

"పెద్దవాడివై నువ్వు ఏమవుతావురా ?" అని రఘురామయ్య ఉత్సాహంతో మధుని తన దగ్గరికి చేరదీసి అడిగాడు.

"రాజుని అవుతాను నాన్నా" అన్నాడు మధు టూకిగా, రాజకుమారుని సాహసకృత్యాలకి మనస్సులో దాసోహం చెబుతో.

"భలే, భలే - రాజుని అవుతావా ?...రాజువి అవుతావా ?...." అంటూ రఘురామయ్య తన తల నిమరడం మధుకి జ్ఞాపకం వచ్చి కళ్ళు జలజలలాడాయి. తన తండ్రి రెండురోజులవరకూ ఆ సంగతి ఊళ్ళోవాళ్ళకీ తనతల్లి వరలక్ష్మమ్మకీ చెప్పి మురిసిపోవడం అతనికి లీలగా గుర్తుకు వచ్చింది. వంశపారంపర్యంగా లభించే రాజరికం తన కొడిక్కి దక్కడం అసంభవమని రఘురామయ్యకి తెలియకపోలేదు. కాని పాలుతాగుతో ఏదో యిత్తడిగ్లాసులోకాక పదహారువన్నెలుగల బంగారు గ్లాసులో తాగడానికి మధు ఉద్యుక్తుడైనందుకు అతని హృదయం సంతోషంతో పరవళ్ళు తొక్కింది. వెన్నపూసవంటి మనస్సు గల తన తండ్రిని తను చిన్నతనంలోనే కోల్పోయినందుకు మధు హృదయం నిరాశతో కుడించుకు పోయింది.

ఈ ఆలోచనలతో గడియారం ఎన్ని గంటలు వేసిందీ మధుకి వినపడలేదు. కలలాగా ధ్వని వాతావరణంలో కరిగిపోయింది. పూర్వ స్మృతుల్లోంచి చప్పున మేల్కొని మధు గడియారంవేపు ఇంకొకసారి

చూచాడు. ఎంత అయిందో ఏమో మొదట ఏమీ కనపడలేదు. గోడకి గడియారంమాత్రం టిక్కు-టిక్కు- మంటున్నది. మధు కళ్లు నులుపుకొని తిరిగి ఒకసారి గడియారాన్ని చూచాడు. అరుగంటల రెండు నిమిషాలైంది. తను రెండు నిమిషాలలో ఒక ప్రపంచాన్ని శోధించివచ్చాడు. ఒక సాయంత్రంతో ఆరంభమైన సంఘటన ఆ రాత్రీ మరునటి రెండు రోజులూ నడిచింది. ఎందుకో మధుకి తన మనస్సులోని కాలానికీ, నడుస్తున్న కాలానికీ ఎంతో భేదం కనపడింది. తన మనస్సు పరుగెత్తినంత వేగంగా ప్రస్తుతకాలం పరుగెత్తనందుకు ఎంతో కష్టం వేసింది. ఎందుకో కాలం ముందుకు సాగడంలేదు. మొండికేసి ఉన్న చోటునే నిలిచిపోతున్నది. క్షణం ఒక యుగంగాగడుస్తున్నది. మధు తనచుట్టూవున్న వస్తువుల్ని పరికించి చూచాడు. ఆ వస్తువులన్నీ స్థాణువులుగా ఉన్నచోటునే పడి ఉన్నాయి. చూచిన వస్తువుల్నే తిరిగి చూడడం మధుకి విసుగేసింది. ఎందుకో ఆ మొనాటనీ తగ్గితే బాగుండు ననిపించింది. ఇంతకీ తను ఈ ట్యూషన్ ఎందుకు ఒప్పుకున్నట్లు? తనకు గడవకనా? ఏదో కడుపులో చల్లకదలకుండా గడిచిపోతోనేవుంది. నిన్న సుల్తాన్ బజార్‌లో రామచంద్రయ్య కనపడి తనని ఈ ట్యూషన్‌కి ఒప్పించాడు-రామచంద్రయ్యది తన స్వగ్రామమే- అతనికి తమ యింటి స్థితిగతులు చక్కగా తెలుసు. అతని తమ్ముడు రంగనాయకులు, రామచంద్రపురానికి కరణం. తన తండ్రి పోయినతరువాత రంగనాయకుల చేతిమీదుగానే తమ ఇనాంభూములు పట్టాలైనాయి. తనతల్లి వరలక్ష్మమ్మని స్వంత సేద్యానికి పురికొల్పిందికూడా రంగనాయకులే. తన తండ్రి పేరటవున్న ఇనాం భూముల్ని తన పేరట పట్టాలు చేయించింది కూడా అతనే. భూముల్ని తనపేరట చేయించే నెపంతో అతను ఎంతో డబ్బు తిన్నాడని ప్రతీతి. ఈ సంగతి రామచంద్రపురంలో అందరూ చెప్పుకుంటారు. మానవులు తోడిమానవుల్ని అడుగడుగునా ఎందుకు

మోసం చేస్తారో? ఎందుకో పైకి మాత్రం "న్యాయం", "ధర్మం" అని మాట్లాడుతారు. తడిగుడ్డలతో చల్లగా గొంతులు కోస్తారు. దుర్నీతికీ దురన్యాయానికీ మనం పెట్టింది పేరు. మన జాతికికూడా ఒక నీతీ నిజాయతీ లేదు. జాతి ఎందుకింత అధోగతి పాలుకావల్సివచ్చిందో దురూహ్యంగా వుంది. పైగా మనది సత్సంప్రదాయం అంటారు- అడుగడుగునా సద్వంశానికీ సత్యసంధతకీ ప్రాముఖ్యత యిస్తారు- భారతావని, వేదభూమి, అందువల్ల పుణ్యభూమి అనికూడా అంటారు. ఎందరో ఋషులు, మునులు ఈ పావనభూమిలో అవతరించారట. వారి ప్రవచనాలూ, బోధలు ఏమైనట్లు? బూడిదలో పోసిన పన్నీరుకుమల్లే నిష్ప్రయోజనమైనాయా? బుద్ధుడు, రామకృష్ణ పరమహంస, వివేకానంద, గాంధీజీ, అరవిందులనిగన్న పావనచరిత, నేడు, స్వార్థానికీ, మతమౌఢ్యానికీ, కులాల పట్టింపులకీ, మోసానికీ, ధనదాహానికీ, హింసకీ, నీచత్వానికి ఆలవాలం కావడానికి కారణం? ఏమో? ఎంత ఆలోచించినా మధుకి ఏమీ పాలుపోలేదు. జాతిలో అరాచకం ప్రబలుతున్నది- క్షణ క్షణానికీ ప్రవర్ధమానమవుతున్నది- పాపం బ్రద్దలై ఎన్నడైనా జాతి బాగుపడే రోజులు వస్తాయా? ఈజాతికి ఎన్నటికైనా విముక్తివుంటుందా? విమోచన వుంటుందా? ఏమో? సందేహమే.........కాగా రంగనాయకులకీ, తనతల్లి వరలక్ష్మికీ ఏదో సంబంధముందని చెప్పుకుంటారు- తనతో ఆవిషయం ఎవ్వరూ అనకపోయినా కర్ణాకర్ణిగా అది తన చెవిని పడింది. మొదటినించీ తనకి తల్లంటే ఎందుకో పరమఅసహ్యం. మధుకి ఆమె నడవడిని గూర్చి ఇటీవలనే తెలిసింది, అందుకోసమే అతను శలవులకి స్వగ్రామం వెళ్ళడం మానుకున్నాడు. పట్నంలోనే కాలం వెళ్ళబుచ్చడం నేర్చుకున్నాడు. ఎందుకో తన తల్లితో తాను ఆప్యాయంగా మాట్లాడలేదు. ఆమె కూడా తనంటే బెదురు బెదురుగా వుంటుంది. అవసరమొస్తే తప్ప మాట్లాడదు- తనురామచంద్రపురం

నప్పుడు రంగనాయకులు తమ యింట్లో ఎక్కువగా కనపడడు. తను గ్రామంలో లేనప్పుడు అతను ఎప్పుడూ తమ యింట్లోనే వుంటాడని పుకారు. రంగనాయకులు తనతో ఎప్పుడూ ముభావంగానే ప్రవర్తిస్తాడు. తనతల్లీ, రంగనాయకులూ ఏదో పెద్ద తప్పుచేసినవాళ్ళకిమల్లే తనని తప్పించుకు తిరగడం చూచి మొదట ఆశ్చర్యం వేసింది మధుకి. పుకార్లు చెవిని పడడంతోనే వారి నడవడిలోని అంతరార్థం సుబోధకమైంది. ఇప్పుడు సర్వమూ తేటతెల్లమయిన తరువాత, స్వగ్రామం వెళ్ళడమంటే తల కొట్టినట్టు వుంటుంది మధుకి. తల్లి దుష్టప్రవర్తనతో తనకు ఈ విశాల విశ్వంలో "నా" అనేవాళ్ళు ఎవ్వరూ లేకుండా పోయినారు. తండ్రిలేడు- తల్లి వున్నా లేనిసమానమే. తలి దండ్రులకు తను ఒక్కడే సంతానం. ఇంక ఈ ప్రపంచంతో తనకు ఏమి సంబంధం వుంది? ఒంటరివాడైనాడు. ఏకాకిగా జీవితం గడుపుతున్నాడు. నిలువ నీడలేదు. ఒక ఆశ్రయమంటూ లేదు- తెగిపోయిన గాలిపటానికిమల్లే శూన్యంలో కొట్టుకుపోతున్నాడు. నడిసముద్రంలో తన జీవిత నౌక ప్రయాణం చేస్తున్నది. భయంకరమైన అలలు, నురుగులు క్రక్కుతో నౌకని ముంచివేయడానికి ప్రయత్నిస్తున్నాయి- నౌకకి చుక్కానిలేదు- ఎక్కడా లంగరందడంలేదు- సముద్రంలోతు తెలియడంలేదు. గమ్యస్థానం అంతకన్నా తోచడంలేదు. తెరచాపలు కట్టడానికి ఏ సహాయం లేదు. అసలు తన నౌకకి తెరచాపలుంటేకదూ కట్టడానికి. ఇంక ఆ అగాధంలోంచి బయటపడడం ఎల్లా? తనకు ఎవ్వరూ హితచింతకులు లేరు. మార్గదర్శకులు అంతకన్నాలేరు. చుట్టూ దట్టమైన చీకటి. కన్ను పొడుచుకున్నా దారి దొరకడంలేదు. ఇంక తనకు గతేమిటి? ఏమీలేదు. తన నౌకకి తనే చుక్కానిగా వ్యవహరించాలి- లంగరు వేయడానికి అనువైన స్థలాన్ని వెతుక్కోవాలి. గమ్యస్థానాన్నిగూర్చి ఆలోచించుకోవాలి. వెలుగుకోసం దిక్కులు పరికించాలి. తనకాళ్ళపైన తాను

నిలబడాలి. పెదవుల మీదుగావచ్చే సానుభూతుల్నీ అనునయాల్ని శాశ్వతంగా వదులుకోవాలి. అధాటుపాటున నిన్న సాయంత్రం పల్లెర్ల జాగీర్‌దార్ ఉమామహేశ్వరరావుగారి భవనం వేపునించి కొంత వెలుగువచ్చి తనకి ఒకదారి చూపించింది. ఇంక ఆ దారిని అనుసరించి వెళ్ళాలి. ఆ వెలుగు రామచంద్రయ్యా రూపంలో నిన్న కనపడింది. రామచంద్రయ్యకు, తనకి ఆ ట్యూషన్ కుదిర్చిపెట్టడంలో కొంత స్వార్థం లేకపోలేదు. తనకి డబ్బు విషయంలో ఏలా యిబ్బంది కలగకుండా, ఒక కంట కనిపెట్టి వుండడం, తన బాధ్యతని రామచంద్రయ్యా భావించి వుంటాడు. దానికి రంగనాయకుల ప్రోద్బలం కూడా వుండివుంటుంది. పెద్ద చదువులు చదువుతున్నకొద్దీ తన స్వంతవ్యయం పెరిగిపోతున్నది. తను ఎక్కడా డబ్బు దుబారా చేయడంలేదు. అయినా తన స్వంత ఖర్చులు ఒక అదుపులో వుండక రోజుకు రోజు మితిమీరి పోతున్నాయి. ఎంతో అవసరమని భావిస్తే తప్ప తను క్లాసు పుస్తకాలు ఏమీ కొనడం లేదు. వాటికోసం, తను ఎక్కువగా యూనివర్సిటీ లైబ్రరీపైననే ఆధారపడుతున్నాడు. కాని విజ్ఞాన సముపార్జనకోసం, తను యితరత్రా ఎన్నో పుస్తకాలు కొనవలసి వస్తున్నది. తనకు చదువు తప్ప ప్రస్తుతానికి ఇంకొక వ్యాపకం లేదు. దానికోసం, తను తగినంత డబ్బు ఖర్చు చెయ్యక తప్పదు. తనకి ఇంటినించి కావల్సిన డబ్బు వస్తూనేవుంది. కాని ఒకొకసారి అది సమయానికి అందదు. అప్పుడు తను యిబ్బంది పడవల్సి వస్తున్నది. తెలంగాణాలోని వ్యవసాయ భూములపైన ఆధారపడి పెద్ద చదువులు చదవడం నిజంగా సాహసకృత్యమే. కాని తనకు ఒక్క చదువు తప్ప యితరత్రా బాధ్యతలు ఏమీలేవు. తన తల్లి, వరలక్ష్మమ్మ పొట్ట గడిస్తే చాలు - మిగిలిన డబ్బంతా, తన ఉన్నతవిద్యకోసం వినియోగించవచ్చు. రంగనాయకులు సహజంగా కొంత డబ్బు తన తల్లికి తెలిసీ తెలియ

కుండా కొట్టేసినా కొట్టేస్తూవుండవచ్చు. కాగా అన్ని వ్యవహారాలు
అతని చేతిమీదుగానే జరుగుతున్నవి. అతను డబ్బు తీసుకుంటే తన తల్లి
కాదనలేదు. అతను న్యాయంగా తనకు రావల్సిన డబ్బు తీసుకుంటే
ఎవరికీ ఏమీ చిక్కు వుండదు. చేసిన కష్టంకన్నా ఎక్కువ డబ్బు
తీసుకోవడంలోనే వచ్చేది చిక్కంతా. అతనికి న్యాయంగా ముట్టవలసిం
దెంతో తనకు తెలియదు. తను వ్యవహర్త కాదు. వ్యవసాయానికి
సంబంధించిన సాధకబాధకా లేమిటో తనకు తెలియవు. ఇటువంటి
పరిస్థితుల్లో అతను ఎంత డబ్బు కొట్టేస్తున్నదీ చెప్పడంకూడా కష్టమే.
అందువల్ల వచ్చిన డబ్బుతో సంతృప్తిపడడం తప్ప తనకు గత్యంతరం
లేదు. తనకీ తన యింటికీ తనచేతి కందుతున్న డబ్బు తప్ప ఏయితర
లంకెలు లేవు. ఆ ఒక్క అనుబంధం తెగిపోతే తను స్వేచ్ఛగా
జీవితాన్ని గడపవచ్చు. తనకు సంక్రమిస్తున్నది పిత్రార్జితమే కావచ్చు.
కాని అది కొందరు దుష్టుల చేతుల్లో నలిగి మలిన మవుతున్నది. పాప
భూయిష్ట మవుతున్నది. పాపభూయిష్టమైన ధనంపైన ఆధారపడి తన
భవిష్యత్తును చక్కదిద్దుకోవడమంటే ఎందుకో మధుకి ఏమాత్రం
మనస్కరించలేదు. గతం ఎందుకో దుర్భరంగా తోచింది. గతంతో
తను తెగతెంపులు చేసుకోవడం అవసరమనే భావం కలిగింది. తనది
సద్వంశం కాదు. సత్సంప్రదాయం కాదు. తన తల్లి యిటీవలనే కాలు
జారి పడిపోయిందని చెప్పడానికి నిదర్శనాలేమున్నాయి ? తన తండ్రి
హయాములోనే కాలుజారి వుండకూడదా ? అలాంటప్పుడు తనలో తన
తండ్రితాతల రక్తమే ప్రవహిస్తున్నదని తేల్చి చెప్పడానికి తార్కాణా
లేమున్నాయి ? తనది సంకరరక్తం ఎందుకు కాకూడదు ? తనలో
రెండుమూడు కులాల రక్తం కలిసినా కలిసివుండవచ్చు. ఆటువం
టప్పుడు మానవులకి ఈ కులాల పట్టింపు ఏమిటి ? "కులాల" నినాదం
తమ ఆత్మీయులకి కొన్ని ఉన్నతపదవుల్ని పంచుపెట్టుకోవడానికి తప్ప

ఇంకెందుకూ ఉపయోగకారి కాదు. అమాయకుల్ని పెడదారుల్లో పెట్టి మానవుల మధ్య వైషమ్యాలని పెంపొందించడానికి "కులాల" నినాదం ఉపకరిస్తున్నది. కొందరు స్వార్థపరులు తమ స్వార్థాన్ని సాధించుకోవడంకోసం కొన్ని రాజకీయ నినాదాల్ని ప్రజలపైన విసురుతున్నారు. ప్రజలు ఈ పాశాల్లో చిక్కుబడి ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. ఊపిరి ఆడక గిలగిల తన్నుకుంటున్నారు....ఎందుకో తనకు కులగోత్రాలు లేవని మధుకి తోచింది. బ్రాహ్మణజన్మ ఎత్తినా తనకు సంస్కృతం రాదు. భారతదేశంలో పుట్టినా తనకు భారతీయ సంప్రదాయం తెలియదు. లంగరు లేని పడవకిమల్లే తన జీవితం గడుస్తున్నది. తనగతం భయంకరంగా కనపడుతున్నది. ప్రాచీనమైన విలువలు ఏమిటో తనకు తెలియవు. వాటినిబట్టి తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవడానికి వీలులేదు. ఆధునికమైన విలువలు అంతకన్నా తెలియవు. మరి తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవడం ఎల్లా? ఏమో? ఏది ఎట్లున్నా తాను స్వశక్తిపైన ఆధారపడడం నేర్చుకోవాలి - అది సాధ్యపడుతుందా? ఏమో? అయినా ప్రయత్నించి చూడడం అవసరం. రామచంద్రయ్య ట్యూషన్ చూపడంతోనే తాను ఎగిరిగంతువేసింది అందుకోసమే. వేడినీళ్ళకు చన్నీళ్ల తోడుగా వుంటాయని అతను చెప్పాడు. అందులో ఎంతో సత్యముంది. ఈ ట్యూషన్ అంగీకరించడంతో తనకు కావల్సిన ఆర్థికస్వాతంత్ర్యం లభించదని తనకు బాగా తెలుసు; కాని కొంత కాకపోయినా, కొంతైనా కలిసివస్తుంది. అందువల్లనే తను ట్యూషన్ చెప్పడానికి సంసిద్ధపడ్డాడు. ట్యూషన్ ద్వారా వచ్చే డబ్బుకూడా పాపంతో కూడుకున్నదే. తను చదువు చెప్పడానికి ఒప్పుకున్నది ఒక జాగీర్దారు యింట్లో. ప్రస్తుతానికి జాగీర్లు రద్దు అయినా ఆ డబ్బు ఎందర్ని హింసించి ఎన్నివిధాల సంపాదించిందో? కాని ఈ డబ్బు తన స్వార్జితం. ఇంటినించి వస్తున్నది పిత్రార్జితం. రెండింటికీ అట్టే తేడా లేదు-రెండూ పాపంతో కూడు

కున్నవే. కాని పిత్రార్జితంకన్నా స్వార్జితం కొంత మెరుగు. స్వార్జితం మనిషికి వలసిన ప్రోత్సాహాన్ని యిస్తుంది. పిత్రార్జితం మనిషిని నిలు పునా క్రుంగదీస్తుంది. తనకు గతంలేదు - భావి ఇంకా కనువిప్పలేదు. ఇంక మిగిలింది వర్తమానం ఒక్కటే. సాధ్యమైనంతవరకు వర్తమా నాన్ని గట్టి పునాదులపైన నిలబెట్టడానికి ప్రయత్నించాలి - ప్రస్తుతానికి తను చేయగలిగింది అది ఒక్కటే.... ఉబుసుపోక ఆలోచనలమధ్య మధు ఒకమాటు గడియారంవంక చూచాడు. ఆరుగంటల పది నిమిషాలు మాత్రమే అయింది. ఈ రోజు కాలం ఎందుకంత మందకోడిగా నడు స్తున్నదో?....

ఎక్కడినించో కిలకిల నవ్వులు....కుర్రవాడు వస్తున్నాడేమోనని మధు నాలుగువేపులా కలయచూచాడు....ఎవ్వరో యిద్దరు అమ్మాయిలు ఒకర్ని ఇంకొకరు తరుముకుంటూ, ఎదురుగా వున్న గదుల్లోంచి వచ్చి ఖాళీస్థలంలో అల్లరిగా పరుగెత్తుతున్నారు. ఉత్సాహంలో శరీరాలమీద ఏమాత్రం స్మృతిలేదు కొంగులు జారిపోతున్నాయి. పరుగులోనే కొంగులు పైకి ఎగదోస్తున్నారు. ఒకరికి ఇంకొకరు అందకుండా పరుగెత్తుతున్నారు. ఎదురుగా వున్న గదుల్లో ఎవరైనా వుంటారేమో ననే ధ్యాసకూడా లేదు. మైమరచి ఆనందాన్ని అనుభవిస్తున్నారు. ప్రపంచంతో విడిపోయి, తన జీవితంలోని ఒక్క క్షణాన్ని తాను అల్లా మధురతరం చేసుకో గలిగితే...తన జీవితం ధన్యమయ్యేది...కాని తనకి ఆ భాగ్యం ఎన్నటికైనా కలుగుతుందా?.... ఏమో!.... సందే హామే... ఎంత మరచిపోదామన్నా, తను గతాన్ని వదులుకోలేక పోతున్నాడు...వర్తమానంలో ఉదయించలేకపోతున్నాడు...ఈ అమ్మా యిలు ఎవరు? తన ఆలోచనల్లోంచి, తన తపఃప్రభావంవల్ల జారిన అప్సరసలు కాదుగదా?... ఏమో?... అమాంతంగా కిలకిలలు ఎక్కు వైనాయి. పెద్దమ్మాయి అందకండా పారిపోతున్న చిన్నమ్మాయిని

పట్టుకుంది. ఇద్దరూ అలసిపోయిన ట్లున్నారు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తప్ప మాటలేమీ వినపడడంలేదు. పరుగులమధ్య చీకటిరేఖల్లో అలు ముకు పోయిన ఆకారాలు క్రమంగా నిలకడలో విస్పష్ట మౌతున్నాయి. పెద్దమ్మాయి, పదిహేడు ఏళ్లు ఉంటుంది. గుండ్రని మొహం, మనిషి కొంచెం బొద్దుగా వుంది. నిశితమైన చూపులు. ఆ చూపుల్లో ఏవో అనంతమైన కోరికలు, అసంతృప్తులు అణగారి ఉన్నాయి. దుస్తులు ఆ గర్వశ్రీమంతాన్ని చాటుతున్నాయి. చిన్నమ్మాయి, బహుశా పది హేను ఏళ్ళు ఉంటుంది. అప్పటికప్పుడే యౌవనం అంకురిస్తున్నది. శరీరంలో ఎత్తులూ, వొంపులూ ఏర్పడుతున్నాయి. సన్నని పల్చటి శరీరం. బంగారు ఛాయలో పోతపోసిన విగ్రహం, కోలమొహం, చల్లని చూపులు. శరీరం పొంకంగా వుంది, ఏ అవయవాలు ఎంత పరిమితిలో వుండాలో, అంత పరిమితిలో వున్నాయి. పెద్దమ్మాయి చూపులు మన హృదయాన్ని పెల్లగించివేస్తే చిన్నమ్మాయి శరీరం, మన దృష్టుల్ని తనవేపుకి ఆక ర్షించి, వాటిని అక్కడే బంధించివేస్తుంది. చిన్నమ్మాయి వదనంలో సౌమ్యత వినయవిధేయతలు ఉట్టిపడితే పెద్దమ్మాయి మొహంలో గడుసరితనం కనపడుతుంది. పెద్దమ్మాయి హృదయమవుతే, చిన్న మ్మాయి శరీరం. హృదయం మోసగిస్తుంది. శరీరం మన చెప్పుచేతుల్లో వుంటుంది... చిన్నమ్మాయి దొరికిపోవడంతో, ఉభయుల కీ ఉత్సాహం తగ్గింది. కిలకిల నవ్వులు సన్నగిల్లాయి. ఎందుకో వింతప్రపంచంలో ఒక వింతదృశ్యం చూస్తున్నట్లనిపించింది మధుకి— ఇంతలోకే చిన్న మ్మాయి మధు కూర్చున్న గదిలోకి వచ్చింది. పెద్దమ్మాయి యాంత్రి కంగా చిన్నమ్మాయిని అనుసరించింది. చిన్నమ్మాయి లైటువేసింది. లైటువేసీ వేయడంతోనే మధుని చూచింది. గదిలో ఒక యువకుడు కూర్చుండిఉండడం గమనించి మొదట గాభరాపడింది. తరువాత గిరుక్కున వెనక్కి మళ్ళడానికి ప్రయత్నించింది. కాని పక్కనే పెద్ద

మ్మాయి ఉండడం మూలాన వెనక్కి మళ్ళలేక పోయింది. ఉభయుల మధ్య ఏమాత్రం చోటులేదు. ఒకరిని ఆనుకొని ఇంకొకరు నిలబడి ఉన్నారు. ఏమాత్రం ఎడం ఉన్నా గిరుక్కున వెనక్కిమళ్ళి అక్కడి నించి వెళ్ళిపోయేదే - విధి లేక స్విచ్ పక్కనే నిలబడి మధుకేసి చూచింది. మధు తనవేపే ఒకచూపనిగా చూస్తున్నాడు. చూపులు కలిశాయి...శరీరంలో ఏదో విద్యుత్ ప్రవహిస్తున్నట్లు తోచింది. మధు చూపుల్లోంచి తన చూపుల్ని తప్పించివేయడానికి ప్రయత్నించింది. కాని ఏమాత్రం సాధ్యపడలేదు. నిశ్చేష్టురాలై చూపులు అప్పగించి నిలబడి పోయింది.... మెదడులో ఏవో రంగురంగుల పువ్వులు వికసిస్తున్నాయి ... హృదయంలో ఏవో సెలయేళ్ళు పరవళ్ళు తొక్కుతున్నాయి...రక్త నాళాల్లో ఏవో పక్షులు కలకలారవాలు చేస్తున్నాయి...చప్పున కాలం ఆగిపోయింది....శూన్యంలో శరీరం ఆత్మని వెతుక్కుంటున్నది....ఆత్మ శరీరాన్ని గుర్తించింది...ఉత్తరక్షణాన చిన్నమ్మాయికి చైతన్యం కలిగింది. స్వాప్నిక ప్రపంచంలోంచి నిజప్రపంచంలోకి వచ్చింది. తన చూపుల్ని మధుచూపుల్లోంచి బలవంతంగా లాగివేసింది. లజ్జాభరంతో తలవాల్చింది. తలనిండా కొంగు వేసుకొని అడుగులో అడుగువేసుకుంటూ అక్కడినించి కదలింది. గదివెలుపలికి రావడంతోనే అనాలోచితంగా ఒకమాటు మెడ వెనక్కి తిప్పి మధుని చూచింది. ఆ తరువాత చరచరా అక్కడినించి వెళ్ళిపోయింది. పెద్దమ్మాయికి పరిస్థితులు పూర్తిగా అవగతమైనాయి. ఆ వచ్చిన యువకుడెవరో, అక్కడ ఎందుకు కూర్చున్నాడో తెలిసింది. గదిలోకి వచ్చి పలుకరించకుండా వుండడం బాగుండదని తోచి "బాబు ఇంకారాలేదా?" అని అడిగింది. మధు పరధ్యానంగా వుండి ఏమీ సమాధానం చెప్పలేదు.

"ఇప్పుడే పంపిస్తాను ఉండండి" అంటూ అక్కడినించి బయల్దేరి వెళ్ళింది.

ఆ యిద్దరు అమ్మాయిలు వెళ్ళిపోవడంతోనే మధు బుర్ర ఒక ఆలోచనల పుట్టగా మారింది. దానిలో ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి.

"ఆ అమ్మాయిలు ఎవరు ?"

"ఆ యిద్దరికీగల సంబంధ మేమిటి ?"

"అప్పా చెల్లెళ్లా ?"

"అప్పా చెల్లెళ్ళ మధ్య అంత భేద ముంటుందా ?"

"ఒకరు డాంబికంగా కనపడితే, ఇంకొకరు నిరాడంబరంగా కనపడడానికి కారణం ?"

"ధరించిన దుస్తుల్నిబట్టి వచ్చిందా ఆ తేడా ?"

"ఒకరు మామూలు బట్టలుకట్టుకుంటే, ఇంకొకరు అంత విలువైన వస్త్రాలు ధరించడ మేమిటి ?"

మధుకి ఏ ఒక్క ప్రశ్నకీ సరి అయిన సమాధానం దొరకలేదు. అయినా మెదడు ఆలోచించడం ఏమాత్రం మానుకోలేదు. ఏవో ఊహాగానాల్ని చేస్తున్నది. కాని వాటిలో ఏ ఒక్కటీ మధుకి నచ్చడం లేదు. మెదడు తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తూనే వుంది. కాని ఫలితంమాత్రం శూన్యం...కాలచక్రం తిరుగుతున్నది....క్షణాలు క్రమంగా నిమిషాల్లోకి మారుతున్నాయి....ఒకటి ... రెండు....మూడు....నాలుగు...అయిదు...

ఇంతలోకే ఒక పూర్వ సువాసిని ఒక కుర్రవాడిని వెంటబెట్టుకొని మధు కూర్చున్న గదిలోకి వచ్చింది. ఆమె ఈడు తేల్చిచెప్పడం కష్టం. మనిషి సన్నగా పొడుగ్గా వుంది. బహుశా యాభై ఏళ్ళకి పైన వుంటుంది. అరవై ఏళ్ళు వుంటుందన్నా ఆశ్చర్యమేమీ కలగదు. కర్రకుమల్లే బక్కగా, పొడుగ్గా వుండేవాళ్ళ ఈడు నిర్ణయించడం కష్టసాధ్యం. అందువల్ల ఆమె ఈడు విషయంలో మధు ఏమీ తేల్చుకోలేకపోయాడు. గద్వాల పట్టుచీర కట్టుకుంది. కుర్రవాడు పన్నెండు ఏళ్ళు ఉంటాడు. సిల్కుచొక్కా, ఉలెన్ నిక్కర్లతో చురుకుగా కనపడు

తున్నాడు. పూర్వసువాసిని గది గుమ్మందాటడంతోనే మధు వినయంతో లేచి నిలబడ్డాడు. మధు ఆలోచనలు ఆమెని చూడడంతోనే బ్రేక్ వేసి నట్లు ఎక్కడివక్కడ ఆగిపోయినాయి.

"మా కిశోర్‌కి చదువు చెప్పడానికి వచ్చిన మాస్టర్‌వి నువ్వే కదూ ?"

ఏమి మాట్లాడాలో, ఎల్లా మాట్లాడాలో తోచక, వెనకాముందు లాడుతున్న మధుకి ఆ ప్రశ్న ఒకదారి చూపించింది.

"అవునండీ."

"నీ పేరు ?"

"మధుసూదనరావు."

"నీవు రఘురామయ్యగారి కుమారుడివా ?"

"అవునండీ"

"ఏమి చదువుకుంటున్నావు ?"

"ఎం. ఏ. చదువుతున్నానండీ."

ఆ మాట తీరూ, ఆ దర్పంచూస్తే, ఆమెకి ఆ యింట్లో ఎంతో అధికార మున్నట్లు కనపడింది మధుకి.

"ఈ అబ్బాయి మా తమ్ముడు ఉమామహేశ్వరరావు కుమారుడు. ఒక్కడే ఒక్క కొడుకు. తల్లిలేదు. ఎంతో గారాబంగా పెంచుతున్నాం."

ఈ సంగతులన్నీ తనకు చెప్పడంలో గల అంతరార్థమేమిటో మధుకి బోధపడలేదు. ఏ పరిస్థితుల్లోకూడా కుర్రవాడిని ఏమీ అనడానికి వీలులేదని హెచ్చరించడమా ఇది ? - అవును, అంతే అయివుంటుంది.

"శ్రద్ధగా చదువు చెప్పాలి."

"చిత్తం."

"కూర్చో నాయినా, బాగా చదువుకో" అని కుర్రవాడితో చెప్పి ముసలావిడ అక్కడినించి వెళ్ళిపోయింది.

కుర్రవాడు టేబుల్‌కి ఇంకొకవేపున మధుకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"నీ పేరు ?"

"కిశోర్ కుమార్"

"ఏ స్కూల్లో చదువుతున్నావు ?"

"గ్రామర్ స్కూల్‌లో."

"ఏ క్లాసు ?"

"సిక్స్త్ క్లాస్."

ఆ యిద్దరు అమ్మాయిలు నీ కేమవుతారని అడుగుదామనిపించింది మధుకి. తీరా అడుగుతే కుర్రవాడు ఏమనుకుంటాడో ? కాగా యింట్లో ఏమని చెబుతాడోనని భయమేసింది మధుకి. గొంతులోని ప్రశ్నని గొంతులోనే నొక్కేసుకున్నాడు మధు.

"నీ పుస్తకాలు ఏవి ?"

పుస్తకాలు చేతికందించాడు కిశోర్.

మధు ఏ పుస్తకంలో ఎన్ని పాఠాలు చెప్పిందీ కనుక్కున్నాడు. కొన్ని ప్రశ్నలు వేసి, కుర్రవాడు ఏ పుస్తకంలో ఎంత అవగాహన చేసుకున్నదీ తెలుసుకున్నాడు. ఇంగ్లీషు ఫరవాలేదు. వాక్యనిర్మాణం వచ్చు. చిన్న చిన్న వాక్యాల్లో జంకు లేకుండా మాట్లాడుతాడు. ఒకటి రెండు లెఖ్ఖలిచ్చి చూచాడు. కుర్రవాడు లెఖ్ఖల్లో చాలా పూర్. లెఖ్ఖలు శ్రద్ధగా చెప్పాల్సి వుంటుంది. మిగతా సబ్జెక్టులలో కూడా ఫరవాలేదు. కాని తెలుగు బొత్తిగా రాదు. తెలుగుకూడా గట్టిగా చెప్పాలి. ఆనాటికి ఇంగ్లీషులో మరుసటి పాఠం చెప్పాడు. పాఠం చెబుతున్నంతసేపూ కిటికీ దగ్గర ఎవరో తారట్లాడుతున్నట్లు తోచింది. పాఠం ముగించి మెట్లు దిగి కిందికి వెడుతుండగా మెట్లమీద పెద్ద అమ్మాయి ఎదురు పడింది. తనని చూచి, ఆమె చిరునవ్వు నవ్వినట్లు తోచింది మధుకి.

ముందుకు సాగడమూ లేక మెట్లమీదికి తిరిగి వెళ్ళడమూ అన్న సందిగ్ధా వస్థలో పడ్డాడు. ఆమె అతని సందిగ్ధావస్థని గ్రహించి, మెట్లు దిగి, ఒక పక్కకి ఒదిగి నిలబడ్డది. మధు గబగబా మెట్లు దిగి తన దారిని తాను వెళ్ళిపోయాడు. ఆమె మెట్లు ఎక్కి పైకి వెళ్ళడం కాని లేక అక్కడే నిలబడి వుండడం కాని అతను గమనించలేదు.

ఆనాడు మధు బర్కత్‌పురంనించి హిమాయత్‌నగరంలోని తన గదివరకూ నడిచివెళ్ళాడు. దారిపొడుగునా ఉండుండి, చిన్నమ్మాయి కళ్ళల్లో ఆడడం మొదలెట్టింది. ఎంత ప్రయత్నించినా ఆ మొహం దృష్టిపథంనించి తొలగిపోవడం లేదు. తను ఆమెను ఇదే మొదటిసారి చూడడం - ఆ చూడడంకూడా ఏ కొద్ది నిమిషాలపాటో - అంతలోకే అంత గాఢంగా ఆమె తన హృదయానికి హత్తుకుపోవడానికి గల కారణ మేమిటో ఎంత ఆలోచించినా మధుకి తోచలేదు. తను చిన్నమ్మాయిని ప్రేమిస్తున్నాడా ? కొద్దినిమిషాలపాటు ఒక వ్యక్తిని చూడడంతో ప్రేమ పుట్టుకొస్తుందా ? రోజూ మనం ఎందరిని చూడడంలేదు ? వాళ్ళందరి పైన మనకు ప్రేమ ఎందుకు కలగదు ? ఆ రోజున తను యిద్దరు అమ్మాయిల్ని చూచాడు. అందులో ఒక్కరిపైకే మనస్సువెళ్ళడ మేమిటి? పెద్దమ్మాయిలో లేని విశిష్టత ఏదో తనకు చిన్నమ్మాయిలో కనపడిందా? తను చిన్నమ్మాయిలో ఏమిచూచి మోహించినట్టు ? ముక్కా ? నోరా? కళ్ళా? ఏమో? ఏదీ తేల్చి చెప్పడానికి వీలులేదు. ప్రేమ బాహ్యస్వరూపానికి కాక హృదయానికి సంబంధించింది, కార్య కారణాలతో దానికి ఏమాత్రం సంబంధముండదని ఆరోజున మధుకి మొదటిసారిగా తోచింది. అంద చందాలు మనని ఆకర్షించవచ్చు- కాని సౌందర్యానికి ముగ్ధులమై మనం ఎవ్వరినీ ప్రేమించము. అయితే, మనం మంత్రముగ్ధులం కావచ్చు. కాని సౌందర్యం ప్రేమని అంకురింపజేయదు. ప్రేమ, దైహికాకర్షణలకీ, అందచందాలకి, అతీతమైనదని తోచింది మధుకి. ఆ రాత్రంతా ప్రేమకి

సంబంధించిన తర్జన భర్జనలతో గడిచిపోయింది. మధుకి అన్నం సహించలేదు. చెప్పుకోడానికి మాత్రం ఏదో కొద్దిగా ఎంగిలిపడిలేచాడు. హోటల్‌నించి తెచ్చిన క్యారియర్ తెచ్చినట్లే వుండిపోయింది. నిద్ర పట్టలేదు. పుస్తకం ముందువేసుకుంటే పట్టుమని పదిపంక్తులు సాగలేదు. పోనీ సినీమాకు వెడుదామనుకున్నాడు. కాని సినీమా హాలువరకు ఒంటరిగా వెళ్ళడానికి బద్ధకమేసింది. పక్కమీద దొర్లుతూ కాలయాపన చేశాడు- ఎడతెరిపిలేని ఆలోచనలతో ఎంతకీ నిద్రపట్టలేదు. ఎప్పుడో తెల్లవారుఝామున కునుకుపట్టింది. ఏదోకల.........దానికి తలా తోకా లేదు. ఎవ్వరో ఒక అమ్మాయి చేతులనిండా బురద పులుముకొని తన మొహానికి పూయడానికి వస్తున్నది. తను తప్పించుకోవడానికి ఒక పరుగు తీశాడు. ఆమె వెనకాలే పరుగెత్తుకొస్తున్నది. ఒకరికి ఇంకొకరు అందకుండా ఇద్దరూ పోటీలుపడి పరుగెత్తుతున్నారు. పెద్ద మైదానం. ఎక్కడా తలదాచుకోవడానికి చోటులేదు. మసకచీకటి. క్షణ క్షణానికీ తను అలిసిపోతున్నాడు. చిక్కిపోతానేమోననేభయం తనని పట్టి పీడి స్తున్నది. తను సాహసించి జీవితాన్నే పరుగుగా మార్చాడు...ఒకటే పరుగు...ఇంతలోకే ఒక కాలువ. కాలువగట్టున ఇంకొక అమ్మాయి నిలబడివుంది. తను రెండవ అమ్మాయిని సమీపించడంతోనే ఆమె కాలువలో దూకమని తనకు సలహా యిచ్చింది. తను వెంటనే కాలువలో దూకాడు. కొంతకాలానికి మొదటి అమ్మాయి, రెండవ అమ్మాయిని సమీపించి తనను గూర్చి అడిగింది. అటుపరుగెత్తాడని ఏదో ఒకవేపుకి చూపించింది. మొదటి అమ్మాయి, రెండవ అమ్మాయి చూపినవేపుకి పరుగెత్తింది. తను అక్కడే నీళ్ళల్లో ఉన్నాడు. వాళ్ళిద్దరి సంభాషణ విన్నాడు. మొదటి అమ్మాయి వెళ్ళిపోవడంతోనే, రెండవ అమ్మాయి తనని పేరుపెట్టి పిలిచింది. తన పేరు ఆమెకి ఎల్లా తెలిసిందో ? తను నీళ్ళలోంచి నెమ్మదిగా వెలుపలికి వచ్చాడు. రెండవ అమ్మాయీ, తనూ

చెట్టాపట్టాలు వేసుకొని కాలువగట్టునించి బయల్దేరారు...కల కరిగింది. మెళకువ వచ్చింది. కళ్లు నలుముకొని చూస్తే తన గదీ, తన పక్కా ప్రత్యక్షమైనాయి. తెల్లవారుఝామున వచ్చిన కలలు నిజమౌతాయని అంటారు - నిజమవుతే? ఆ కల అంతరార్థ మేమిటో? ఏదో పిచ్చికల- దానికి అంతరార్థమంటూ ఒకటి వుంటుందా అనే భావం మధుకి కలిగింది. కాగా దానినిగూర్చి ఆలోచించడం అనవసర మనుకున్నాడు. పక్కమీది నించి లేచాడు. కాలకృత్యాల్లో పడ్డాడు

* * * *



మర్నాడు మధు ట్యూషన్‌కి పెందలాడే వెళ్ళాడు ఇంట్లో ఎక్కడా, ఎవ్వరూ కనపడలేదు. తను నేరుగా వెళ్ళి కిశోర్ గదిలో కూర్చు న్నాడు. మేడమెట్లు ఎక్కుతున్నప్పుడు క్రిందటి రోజున మెట్లదగ్గర పెద్ద మ్మాయి ఎదురుపడిన సంగతి జ్ఞాపకమొచ్చింది. ఉద్దేశపూర్వకంగా, ఆమె తనకు ఎదురైనట్లేనా? ఎందుకో, తను మాత్రం, ఆ సంఘటన ఉద్దేశ పూర్వకంగా జరిగిందనే అనుకున్నాడు. చిన్నమ్మాయి తనని పొంచి వుండి చూచిందని అనుమానించాడు. ఆ సంఘటనకూడా ఉద్దేశపూర్వ కంగా జరిగిందేనా? ఏమో....ఇతరులను విలువకట్టాల్సి వచ్చినప్పుడు, వాళ్ళకి గుణదోషాలను ఎందుకు ఆపాదిస్తామో తెలియదు. ఆ గుణ దోషాలను ఆపాదించడంకూడా, మన యిష్టా యిష్టాలపైన ఆధారపడి వుంటుంది. ఇష్టుల చర్యలు మనకు ఎబ్బెట్టుగా తోచవు. అసలు వాళ్ళ చర్యల్ని గూర్చి ఆలోచించనే ఆలోచించము. అధవా ఆలోచించడమే జరిగితే ఖర్మంకాలి ఏదైనా లోపం కనపడినా సమర్థించడానికే చూస్తాం.

అయిష్టుల విషయంలో మనదృష్టే పూర్తిగా మారుతుంది. వాళ్ళ చర్యల్ని గూర్చి విరుద్ధంగా ఆలోచించడం మొదలెడుతాం. మనకు ఏకోశానా సానుభూతి వుండదు. మనకు తెలియకుండానే మన కొలత బద్దలు మారిపోతాయి......కారణం?.......జీవితంలో సమ్యక్‌దృష్టి అలవర్చుకోకపోవడమేనా?...ఆ సమ్యక్‌దృష్టి ఎల్లా అలవడుతుంది? తను గడించిన అనుభవాన్నిబట్టేనా? అనుభవమే విచక్షణాజ్ఞానాన్ని నేర్పుతుందా?...ఏమో?...తన తల్లిని గూర్చి ఎప్పుడు ఆలోచించినా ఆమెకు సంబంధించిన దుర్నీతి ఆకాశం ఎత్తున పెరిగి భయంకరంగా ఎందుకు కనపడాలి? ఆ దుర్గుణంతోపాటు, ఆమెలోని సద్గుణాలు వెంటనే తనకు ఎందుకు స్ఫురించకూడదు? నిస్సందేహంగా ఇది తన దృష్టిలోపమే...ఒక వ్యక్తి శీలాన్ని అణాపైసలతో లెక్కకట్టదల్చి నప్పుడు ఆ వ్యక్తి దుర్గుణాల్నీ, సద్గుణాల్నీ విడివిడిగా పరిశీలించాలి. అవినీతిని ప్రోత్సహించిన పరిస్థితులేమిటో సానుభూతితో గమనించాలి. అప్పుడుగాని ఆ వ్యక్తిని విలువకట్టడానికి మనకు ఒక మార్గం ఏర్పడదు. అప్పుడుగాని ఆ వ్యక్తి సమగ్రస్వరూపం మన కట్టెదుట నిలువదు. ఎందుకో ఈ కొలతబద్దలతో తన తల్లి శీలాన్ని కొలిచి చూడాలనిపించింది మధుకి. ఆమె అవినీతికి కారణభూతమైన పరిస్థితుల్ని గూర్చి ఆలోచించడం మొదలుపెట్టాడు మధు.........భర్త చనిపోయాడు.... వున్న ఒక్కకొడుకు చేతికందలేదు....కొద్దో గొప్పో ఆస్తివుంది... వున్న ఆస్తిని ఎల్లా కాపాడుకోవాలో తెలియదు....తలిదండ్రులు లేరు.... వున్న ఒక అన్న ఎక్కడో మళయాళదేశంలో వున్నాడు... అతనికి వ్యవహారజ్ఞానం బొత్తిగా లేదు...ఏదో కొలదిపాటి ఉద్యోగం చేస్తు న్నాడు....తనతండ్రికి తనతల్లి రెండవ సంబంధం...మొదటి సంబంధం తీరిపోయిన తరువాత ఎంతో కాలానికి రెండవ సంబంధం చేసు కున్నాడు...అప్పటికి తన తండ్రికి దాదాపు నలభై ఏళ్ళట... ఆ

కాలంలో నలభై ళ్ళ నడి ఈడు మనిషికి స్వదేశంలో ఎవ్వరూ పిల్లనివ్వ లేదట...కాగా తన తండ్రి ఏదో చిన్న పిల్లని చేసుకోవడానికి యిష్ట పడలేదట...అప్పటికి తన తండ్రికి "నా" అనేవాళ్లు ఎవ్వరూ లేరట... పరదేశాలకివెళ్ళి ఈడువచ్చినపిల్లని కొనుక్కొని చేసుకోవాల్సివచ్చిందట. పెళ్ళినాటికి తన తల్లికి పదహారేళ్ళట...పరదేశంలోనే వివాహం జరి గిందట...పెళ్ళి జరిగిన మూడవనాడే భార్యా భర్తలు స్వదేశానికి తరలి వచ్చారట...భర్త చనిపోయేటప్పటికి తన తల్లికి పాతిక సంవత్సరాలు. అప్పటికి తనకింకా చిన్నతనం...ఆమె తన ఆస్తిని కాపాడుకోవాలి... ఆమెకి "నా" అనే దిక్కెవరూలేరు...రంగనాయకులు వ్యవహారదక్షత కలవాడు.... కాగా రామచంద్రపురం కరణం...ఈ పరిస్థితుల్లో తనతల్లి వరలక్ష్మమ్మ గత్యంతరంలేక రంగనాయకులకు లొంగిపోవల్సివచ్చిం దేమో?.... ఇది తన మేలు కోరే చేసిందేమో?... లేక యౌవనపు పొంగులకు లోబడి చేసిన పనేమో?... ఏమో అంతా అయోమయం. ఏదీ ఇదమిద్ధమని చెప్పడానికి వీలులేదు...ఉద్దేశమేదైనా ఆమె చేసిన పని తనకు ఒక తీరని కళంకంగా పరిణమించింది... తన తల్లి చెడు నడవడి మూలకంగా తనను చూచి ఎందరు ఎన్నివిధాల నవ్వుకుంటు న్నారో?...ఏ పెదవులపైన చిరునవ్వు కనపడినా, తనకు ఎందుకో హృదయం కలుక్కుమంటుంది...ఆ చిరునవ్వుకి ఒక వంద గజాల దూరం వెళ్ళిపోవాలనిపిస్తుంది... అందుకోసమేనేమో చిరునవ్వుతున్న ముఖాలని చూచి తను సహించలేకపోవడం... ఈ విషమ పరిస్థితులవల్ల తనకు జీవితంలో ఒకవిధమైన గంభీరత అలవడింది...తల్లి అవినీతి తనకు ఒక అబ్సెషన్...ఈ అబ్సెషన్ మూలకంగానే తనకు ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు వచ్చి వుంటుంది. ఆ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు ఎంత ప్రయత్నించినా తననించి ఏమాత్రం దూరం కావడంలేదు. అర విచ్చిన మొహాల్నిచూస్తే, తనకు ఏదో జెలసీ... జీవితంలో తను

మనసారా నవ్వలేకపోవడమేనా దీనికి కారణం?...అయితే కావచ్చు...
ఒకమాటు తన మేనమామ కూతురు ఎండాకాలం శలవులకి మళయాళ
దేశంనించి రామచంద్రపురం వచ్చింది. ఇది రెండు సంవత్సరాల
క్రిందటిమాట. అప్పటికి తనకు పంధొమ్మిది సంవత్సరాలు. ఆ అమ్మాయికి
పధ్నాలుగు సంవత్సరాలు. ఇద్దరికీ ఈడూ జోడూ సరిపోతుందని తన
తల్లి ఎంతో మురిసిపోయింది. ఆ అమ్మాయి విషయంలో తన అభి
ప్రాయం తెలుసుకోవాలని ఎంతో తహతహ లాడింది. అప్పటికే తన
తల్లికీ, తనకూ అంతంతగా వుండడం మూలాన తనని సాహసించి
ఆ విషయం అడగలేకపోయింది. అన్నతో అడిగించింది. ఇప్పుడప్పుడే
తనకు పెళ్ళిచేసుకోవడం యిష్టంలేదని తను పుల్లవిరిచినట్లు సమాధానం
చెప్పాడు. ఆ సమాధానానికి తన మేనమామ ఎంతో నొచ్చుకున్నాడు.
తన తల్లికూడా ఎంతో దుఃఖించింది. తన గాంభీర్యాన్ని చూచి తన
మేనమామ ఆవున్న నాలుగు రోజులూ పెళ్ళి ప్రసక్తి తేలేదు. తనతల్లి
కూడా తనని ఆ విషయంలో ఏమీ అనలేదు. కాదు కక్కసమంటే
వ్యవహారం మరీ బెడిసికొట్టేదేమో? మాట పట్టింపులవరకు ఎవ్వరూ
వెళ్ళలేదు. ముభావంగా ఆ నాలుగు రోజులూ గడచిపోయినాయి. తన
తల్లి చెడునడవడే తన నిరాకరణకి బలమైన కారణం. కాగా ఆఅమ్మాయి
ఎప్పుడూ చిరునవ్వులు వొలకబోయడం తనకు ఏమాత్రం మనస్క
రించలేదు. ముసిముసి నవ్వులు నవ్వేవాళ్ళనిచూస్తే తనకి ఎందుకో
అరికాలిమంట నెత్తికెక్కుతుంది. చిరునవ్వులు తనకు ఏమాత్రం
గిట్టవని ఆనాడే తనకి మొదటిమాటుగా తెలిసింది...... చిన్నమ్మాయి
మొహం ప్రశాంతంగా, గంభీరంగా వుంటుంది. పెద్దమ్మాయి మొహం
చిరునవ్వుల్ని చిలకరిస్తో, అరమోడ్పుకళ్ళతో ఆనందప్రదంగావుంటుంది.
తను చిరునవ్వుల్నిగాని, ఆనందాన్నిగాని తట్టుకోలేడు.* అవి అలౌకిక
విశేషాలుగా తనకు గోచరిస్తాయి. తన దౌర్భాగ్యపు బ్రతుకు ఆ

అలౌకిక విశేషాల్ని మోయలేదు. అందువల్లనే పెద్దమ్మాయి, తన చిరునవ్వులతో, ప్రసాదగుణంతో మధు జీవితపు పొలిమేరల వరకు వచ్చి హఠాత్తుగా ఆగిపోయింది. చిన్నమ్మాయి, గట్టుపుట్టల్ని, నదీ నదాల్ని, ఎత్తుపల్లాల్ని దాటి నేరుగా తన హృదయంలోకి ప్రవహిస్తున్నది. తన వినమ్రవదనంతో, గంభీరతతో మధు హృదయాన్ని కవ్వించి బెల్లిస్తున్నది. చిన్నమ్మాయి తనకు కడు సన్నిహితమైంది. పెద్దమ్మాయి దూరతీరాల్లో నిలిచిపోయింది. దీనికి కారణ మేమిటి?...మొదటిసారిగా వాళ్ళని చూచిన వేళావిశేషమా?... కాదు, ఉభయుల్నీ ఒకేసారి, ఒకే చోట చూడడం జరిగింది...అందువల్ల వేళావిశేషం అనడానికి ఏమాత్రం వీలులేదు...తను జీవితంలో గడించిన అనుభవాలే నీరక్షీరాల్ని విడదీసాయి...ఆ యిద్దరు అమ్మాయిల్లో ఎవరు స్వకీయో, ఎవరు పరకీయో నిర్ణయించి చెప్పాయి...ఇందులో తన ఘనత ఏముంది?... తను ఇరువురిలో ఒకరిని ఎన్నుకో గలిగాడా?...లేదు...పరిస్థితులే తన అభిరుచుల్ని తీర్చిదిద్ది యిరువురిలో ఒకరిని ఎన్నుకునేట్టు చేశాయి... తన అభిరుచుల్ని తాను ఏర్పర్చుకోవడానికి మానవుడు అస్వతంత్రుడు... పూర్వాపరాల్ని బట్టి అభిరుచులు ఏర్పడినప్పుడు మానవుడు పరిస్థితులకి బానిస అని చెప్పడంలో తప్పేముంది?... తప్పేమీ కనపడదు... పరిస్థితులకి లొంగి ప్రవాహంలో పూచికపుల్లకిమల్లే తను కొట్టుకు పోతున్నాడు...ఎక్కడికో, ఎందుకో తెలియదు...విధి కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో తనని బంధించి, ఊపిరి సలపకండా చేసి ఎక్కడికో తనని ముక్కుకి తాడువేసి లాక్కొని వెడుతున్నది...విధి బలీయమైంది... అందువల్ల దానిని అనుసరించక తప్పదు...దీనిలో తన ప్రయోజకత్వ మేమీ లేదు...తన యిష్టాయిష్టాల ప్రసక్తి అసలేలేదు...వేగంగా కొట్టుకు పోవడమే తన పని...ఎక్కడికీ, ఎందుకూ అని కూడా ప్రశ్నించడానికి వీలులేదు...వేగంగా...ఇంకా వేగంగా ... పరిస్థితుల కనుగుణంగా

కొట్టుకుపోవడమే తన భవిష్యత్తు....తను పరిస్థితుల కెదురీదలేడు... ఒక్క 'తను' అని మాత్రం ఏమిటి?...ఎవ్వరూ సాహసించి పరిస్థితులకి ఎదురీదలేరేమో?....ఒకవేళ ఎవరైనా సాహసించడమే జరిగితే, కొంత వరకు ప్రయాణంచేసి, అలసిసొలసి నట్టనడి సముద్రంలో మునకలు వేయడం తథ్యం...అందువల్ల సాహసించడం కూడా నిష్ప్రయోజనం... ఆ విధంగా కొట్టుకుపోవడంలోనే భవిష్యద్దర్శనం కలుగుతుందని మొదటిసారిగా తోచింది మధుకి...

కిశోర్ గబగబా పైకి పరుగెత్తుకొచ్చాడు. ఎగదమ్ముతో "వదిన మిమ్మల్ని తోటలోకి రమ్మంటున్న" దని చెప్పాడు. మధుకి ఏమీ అర్థం కాలేదు. వదిన ఎవ్వరో అతను పోల్చుకోలేకపోయాడు. కాగా తోట లోకి రమ్మనడం కొంచం ఎబ్బెట్టుగా తోచింది.

"వదిన ఎవ్వరు?" పైకి గట్టిగా తనలో తాను ఆలోచిస్తున్నట్లు ప్రశ్నించాడు మధు.

"మా అత్తయ్య కూతురు" అని చప్పున జవాబు చెప్పాడు కిశోర్.

ఏదో పొడుపుకథ చెబుతున్నట్లు వుంది కిశోర్ ధోరణి—

"అత్తయ్య ఎవ్వరు?" అని అడగక తప్పిందికాదు మధుకి. నిన్న గదిలోకి కిశోర్‌ని వెంటబెట్టుకొచ్చిన ముసలావిడ అయివుంటుం దని వెంటనే మధుకి స్ఫురించింది.

"నిన్న నన్ను వెంటబెట్టుకొచ్చిందే ఆ రాములమత్తయ్య" అని విడమర్చి చెప్పాడు కిశోర్.

తను నిన్న చూచిన యిరువురు అమ్మాయిల్లో ఎవరో ఒకరు కిశోర్ వదిన అయివుంటుందని వూహించాడు మధు - ఆ యిరువురిలో కిశోర్ వదిన ఎవ్వరో అతను తేల్చుకోలేకపోయాడు.

"నిన్న యిక్కడ యిద్దరు అమ్మాయిలు కనపడ్డారు. ఆ యిద్దరిలో మీ వదిన ఎవ్వ" రని అడిగాడు మధు కిశోర్‌ని.

"ఆ బొద్దుగా వుంటుందే, ఆమెనే మా వదిన" అని అమాయికంగా కిశోర్ సమాధానం చెప్పాడు.

పెద్దమ్మాయి కిశోర్ వదిన అని వెంటనే తెలుసుకున్నాడు మధు.

"పేరు ?"

పేరు తెలుసుకోవల్సిన అగత్యం లేదు-కాని మధు ఏదో అనాలోచితంగా ఆ ప్రశ్న వేశాడు.

"నళిని."

"నీకా రెండవ అమ్మాయి ఏమవుతుంది ?—" అని మధు తన కుతూహలాన్ని అణచుకోలేక అడిగాడు. ఎందుకో అతనికంతం అతనికే విచిత్రంగా తోచింది.

"కుసుమా ? ఆమె మా అక్కయ్య."

కిశోర్ సమాధానం మధుకి ఆశ్చర్యాన్ని గొలిపింది. కిశోర్, కుసుమలకి ఏలాటి పోలికలు లేవు. ఒకే తల్లిపిల్లలు కావడానికి ఏమాత్రం ఆస్కారం లేదు. ఎందుకో ఏకగర్భ జనితులు కారని మధుకి తోచింది. 'సవతుల పిల్లలేమో' అనే ఆలోచన కలిగింది. అయితే కావచ్చు పోనీ అడిగి తెలుసుకుంటే ? కుర్రవాడు ఏమనుకుంటాడో ? అంత చిన్న వయస్సులో అతను ఏమైనా అనుకోవడం అసంభవం - చివరకి అడిగి తెలుసుకోవడమే మంచిదని మధు నిశ్చయించుకున్నాడు.

"కుసుమ మీ స్వంతం అక్కయ్యా ?" అని మధు ఆ ప్రశ్న ఉండబట్టలేక అడిగాడు. "కాదని" మనస్సు నొక్కి చెబుతూనే వుంది.

"కాదు వరుస" కని సమాధానం చెప్పాడు కిశోర్.

ఆ వరుస ఏమిటో తెలుసుకుందామని, మొదట కుతూహలపడ్డాడు మధు. కాని తీరా అడిగితే కుసుమకీ, ఆ యింటికీ ఏమీ సంబంధం

లేదని తెలిసి, మనస్సు ఖేదపడుతుందేమో నని, ఆ తరువాత మౌనం వహించాడు. ప్రతి వ్యక్తి వెనకాల ఏదో విషాదగాధ పొంచివుంటుంది. దాన్ని పొరపాటున కెలికితే వేడి నిట్టూర్పులు, రక్తాశ్రువులు పైకి ఉబికి వస్తాయేమో నని భయం వేసింది మధుకి.

"ఇంక వెడుదాం లేండి."

తొందరపడుతున్నాడు కిశోర్.

"ఎక్కడికి ?"

కిశోర్ లేత హృదయంలోని తొందరపాటుని గ్రహించలేక పరధ్యాన్నంగా ప్రశ్నించాడు మధు.

"పార్టీకి."

"పార్టీ ఏమిటి ?"

"ఈ రోజు వదినె పుట్టిన దినం - స్నేహితులకి తోటలో పార్టీ యిస్తున్నది."

"ఇస్తే ?"

"ఇస్తే ఏమిటి ? మిమ్మల్నికూడా పార్టీకి తీసుకురమ్మంది."

మధు వింతధోరణికి కిశోర్ లోలోపల విసుక్కున్నాడు.

రిక్తహస్తాలతో పార్టీకి వెళ్ళడం మధుకి ఏమాత్రం మనస్కరించ లేదు. అందులో నలుగురిని కలుసుకోవడమంటే ఎంతో భయం మధుకి. ఒంటరి జీవితం, జనానికి దూరదూరంగా వుండడం నేర్పింది. పార్టీకి వెళ్ళకుండా వుండడానికి ఏదైన సాకు దొరికితే బాగుండుననిపించింది అతనికి. కాని అతని మెదడు అప్పటికప్పుడు ఒక సాకుని సిద్ధంచేసి అందివ్వలేకపోయింది.

"ఇంకా ఆలస్యం దేనికి ? వెడుదాంలేండి."

పార్టీకి వెళ్ళడం ఆలస్యమవుతున్నదని గ్రహించి, కిశోర్ తొందర పెట్టాడు.

మధు నిరుత్తరుడై విధిలేక లేచాడు. కిశోర్‌ని అనుసరించాడు. మెట్లూ గదులూ దాటి అచేతనంగా తోటలోకి వెళ్ళాడు. తోటలో పెద్ద గల్లంతు. ఒక పెద్ద పచ్చికబయలుమీద కొన్ని టేబుల్‌లు వరుసగా అమర్చి, వాటిపైన ఒక తెల్లటి దుప్పటి వేసివుంది. ఆ దుప్పటిపైన పెద్ద పెద్ద ప్లేట్లలో తినుబండారాలు అమర్చి ఉన్నాయి. కొన్ని ప్లేట్లలో జిలేబీ, బర్ఫీ, గులాబ్‌జాముస్, మైసూర్‌పాక్ ఇంకా ఏవో మిఠాయీలు ఉన్నాయి. మరికొన్నిటిలో, కచోరీలు, జీడిపప్పు, సేవు, పప్పు, కట్‌లెట్సు, కేక్సు, పేస్ట్రీలు, బిస్కట్లు ఉన్నాయి. చుట్టూ చిన్న చిన్న ఖాళీ ప్లేట్లూ, వాటిలో స్పూన్సు ఉన్నాయి. ఆహూతులు ఖాళీ ప్లేట్లలో తమకి వలసిన వస్తువులు పెట్టుకొని, స్పూన్‌లతో తింటున్నారు. తింటో తింటో ముఠాలుగా విడిపడి, పరాచ్లుచేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. మధుకి ఒక గుంపులో నళిని కనపడింది. ఆమె చుట్టూ యిద్దరు యువతులు, ముగ్గురు యువకులు మూగి ఉన్నారు. అందులో ఒక యువకుడు ఏవో కబుర్లుచెప్పి మిగిలినవాళ్ళని నవ్విస్తున్నాడు. నళిని ఆ యువకుని వేపు ఒకటేపనిగా చూస్తూ పగలబడి నవ్వుతున్నది. మిగతా గుంపుల్లో ఎక్కడా యువకులు లేరు. ఆ వున్న ముగ్గురు యువకులూ నళిని గుంపులో కనపడడం, మధుకి ఆశ్చర్యాన్ని కలిగించింది. యువతీ యువకులు స్వేచ్ఛగా ఛలోక్తులాడడం, కలిసిమెలసి తిరగడం, మధు ఎన్నడూ చూడలేదు. అతని క్లాసులో కొందరు అమ్మాయిలు వున్నమాట నిజమే. కాని వాళ్ళది ఒక ప్రత్యేకమైన జట్టు. వాళ్ళు క్లాసులోని సహాధ్యాయులతో కలవరు. యువకులతో స్వేచ్ఛగా మాట్లాడరు. అందరూ కలిసి క్లాసుకి జట్టుగా వస్తారు. తమకి ప్రత్యేకింపబడిన బెంచీల్లో విడిగా కూర్చుంటారు పాఠం కావడంతోనే, క్లాసునించి జట్టుగా కలిసి వెళ్ళిపోతారు. తన క్లాసు వాతావరణానికీ, పార్టీ వాతావరణానికీ ఎంతో వ్యత్యాసం కనపడింది మధుకి.

నలువేపులా యౌవనం ఉరకలు పెడుతున్నది - పొంగిపొరలి కేరింతలు కొడుతున్నది. ఆ ఉత్సాహోద్రేకాలకి తట్టుకోలేకపోయాడు మధు - తనలో తాను ముడుచుకుపోయి, దూరంగా ఒక పక్కకి ఒదిగి నిలబడ్డాడు అతను.

నళిని ఎప్పుడు చూచిందో మధుని - మిట్టప్రదేశంనించి నీరు పల్లంలోకి ప్రవహించినట్టు చర్రున పారివచ్చింది మధు దగ్గరికి - వచ్చీ రావడంతోనే చప్పట్లు చరిచింది. వెంటనే యువజనులందరూ, అర్ధ చంద్రాకారంలో నళినీ మధుల చుట్టు మూగారు.

"వీరు కిశోర్ మాస్టర్. పేరు.... ..." - ఉపన్యాస ధోరణిలో పరిచయంచేయడం ఆరంభించింది. మధు తన పేరు ప్రాంప్ట్ చేసాడు.

"పేరు - మధుసూధనరావుగారు - క్లాస్..."

తను ఏ క్లాసులో చదువుతున్నదీ మధు చెప్పాడు.

"ఎం. ఏ. ఫైనల్ - ఇంక ఎవర్ని గురించి వారు చెప్పుకోండి."

ఎవ్వరూ తమని తాము పరిచయం చేసుకోవడం ఆరంభించలేదు-అందరూ మౌనం వహించారు. నళినే ముందుగా ప్రారంభించింది.

"నా పేరు నళిని - బి. ఏ. మొదటి సంవత్సరం."

వరుసగా పరిచయాలు ప్రారంభమైనాయి.

"ఆయెషా - బి. ఎ. మొదటి సంవత్సరం."

"రెహానా - బి. ఏ. మొదటి సంవత్సరం."

"సలీం - బి. ఏ. మూడవ సంవత్సరం."

"పద్మ - బి. ఎస్‌సి. మొదటి సంవత్సరం."

"శ్యామల - బి. ఏ. మొదటి సంవత్సరం."

"..... ..... ..... ..... ..... ....."

తమ పేరు తాము ఏ క్లాసులో చదువుతున్నదీ వరుసగా అందరూ చెప్పుకు పోతున్నారు ఇంతలోనే కిశోర్ టర్న్ వచ్చింది.

"కిశోర్ కుమార్ - సిక్సుత్ క్లాసు" అని కిశోర్ ధీమాగా తనని తాను పరిచయంచేసుకున్నాడు. అందరూ చప్పట్లు కొట్టారు.

ఉత్సాహంగా పరిచయాలు సాగిపోతున్నాయి. ఈ మధ్య నళిని, ఒక ఖాళీ ప్లేటులో ఏవో తినుబండారాలు వేసి తీసుకొచ్చింది. ఆ ప్లేటు, ఒక స్పూన్‌తో సహా మధుకి అందిచ్చింది. మధు విధిలేక ప్లేటు అందుకున్నాడు. ఏదో తింటున్నట్లు నటించాడు.

కుసుమకోసం మధు కళ్ళు నాలుగువేపులా వెతికాయి - ఆమె ఎక్కడా కనపడలేదు. ఆమె కనపడకపోవడంతో మధు హృదయం క్రుంగిపోయింది.

పరిచయాలు ముగిసిపోతున్నాయి - కొంతసేపటికి కుసుమ టేబుల్ దగ్గర కనపడింది. టేబుల్ పైన పెద్ద ప్లేట్లలో ఏవో పదార్థాలు నింపుతున్నది. ఖాళీ ప్లేట్లు టేబుల్‌మీదనించి తొలగిస్తున్నది. నిండు ప్లేట్లు టేబుల్‌పైన అమరుస్తున్నది.

మధు కుసుమ కేసిచూచాడు. కుసుమ మధుని చూచింది. చూపులు కలిసాయి. ఒక తృటికాలం తరువాత మధు చూపుల్లోంచి తన చూపుల్ని విడదీసుకొని తలవాల్చి కుసుమ తన పనిలో నిమగ్నమైంది. మధు కుసుమని ఒకటేపనిగా చూడడం నళిని గమనించింది.

అప్పటికి పరిచయాలు పూర్తి అయినాయి. ఒక్క కుసుమ మిగిలిపోయింది. అతిథుల కళ్ళన్నీ కుసుమవేపు తిరిగాయి.

కుసుమ అందరి కళ్ళూ తనపైకి మళ్ళడం గమనించలేదు. ఏదో ప్లేటు సర్దుతున్నది. అన్ని కళ్ళూ దేనికోసమో ఎదురుచూస్తున్నాయి.

"ఈ పార్టీ బాధ్యతంతా తన నెత్తిమీద వేసుకుని, విజయవంతంగా నడుపుతున్నదే ఆ అమ్మాయి నా ముద్దుల మరదలు కుసుమ - ప్రీ ప్రొఫెషనల్ కోర్సు చదువుతున్నది" అని ఉపన్యాస ధోరణిలో కుసుమని పరిచయంచేసింది నళిని.

నళిని ఛలోక్తికి అందరూ గొల్లుమన్నారు. సిగ్గుతో కుసుమ చెక్కిళ్ళు ఎర్రబారాయి. ఆ యువజనంలో పి. యు. సి. చదువుతున్న వాళ్ళు ఎవ్వరూ లేరు. దాదాపు అందరూ బి. ఏ. చదువుతున్నారు. దాన్నిబట్టి పార్టీకి వచ్చినవాళ్ళంతా నళిని స్నేహితులని మధుకి లీలగా తోచింది. కుసుమ స్నేహితు లెవ్వరూ పార్టీకి రాకపోవడానికి కారణం? కుసుమ తన స్నేహితుల నెవ్వరినీ పార్టీకి పిలువలేదా? లేక తనకుమల్లే ఆమెకు కూడా స్నేహితులంటూ లేరా? తనకుమల్లే ఆమె కూడా ఒంటరి జీవితాన్నే గడుపుతున్నదా? ఏమో? ఏమీ తెలియడంలేదు. కుసుమకీ, ఆ యింటికీ గల సంబంధ మేమిటి? విధి ఆమెను ఏ కుటుంబంవించో తన్నుకు వచ్చి, ఈ కుటుంబంలో విసిరివేసి వుంటుందా? ఏమో?

ఆయెషా ఏవో ఉర్దూ పాటలు పాడింది. రెహానా ఆ పాటలకి అనుగుణంగా నృత్యం చేసింది. తోటలోని విద్యుద్దీపాల కాంతిలో రెహానా శరీరం, బంగారుతీగకి మల్లే అల్లల్లాడింది. ఆయెషాది తియ్యని కంఠం. గజళ్ళు పాడడానికే ఆ కంఠం సృష్టింపబడినట్లు తోచింది మధుకి. కంఠంలోని సన్నని నొక్కులతో, గజళ్ళలోని సున్నిత భావాన్ని వ్యక్తపరుస్తున్నది ఆయెషా. ఆ విషాద విరహగీతాలకి వివిధ నృత్య భంగిమలతో మెరుగులు పెడుతున్నది రెహానా. నృత్యావేశంలో ఆమె శరీరం వివిధ భంగిమల్లోకి జారిపోతున్నది. చివరికి శరీరమే నృత్యంగా మారింది. శరీరం ఎక్కడా కనపడడంలేదు. ఎటు చూచినా నృత్యమే...నృత్యభంగిమలే. చిన్నప్పుడు మధుకి ఉర్దూ ఫార్సీలతో అక్షర శ్రీకారం జరిగింది. ఆ రోజుల్లో ఆ భాషలకి రాజాదరణవుండింది. తెనుగు వ్రాయడం, చదవడం నేర్పారు. అంతే- అప్పటి నిజాం సంస్థానంలో తెనుగుకి ఏలాటి ప్రాముఖ్యతలేదు. ఉర్దూ, ఫార్సీలు నేర్చుకుంటే తప్ప ఉద్యోగాలు కూడా దొరికేవికావు. అందువల్ల రఘురామయ్య తన కొడుక్కి చిన్నతనంలో ఉర్దూ ఫార్సీలు గట్టిగా చెప్పించాడు. ఆరోజుల్లో

బోధన భాషకూడా ఉర్దే. తెనుగుకి అపకారం జరుగుతున్నదని ఎవ్వరూ గుర్తించలేదు. అందరూ ఉర్దూ, ఫార్సీలకి ఎగబడ్డారు. క్రమంగా విలువలు మారాయి. ఇంగ్లీషుకి ప్రాముఖ్యత హెచ్చింది... చిన్నప్పుడు ఉర్దూ, ఫార్సీలు గట్టిగా చదువుకోవడంవల్ల మధుకి అయేషా పాడిన ప్రతి గజల్‌లోని ప్రతి పాదం అవలీలగా అర్థమైంది. ఆ గజళ్ళలో యిమిడి వున్న సున్నితభావం అతన్ని స్వాప్నిక జగత్తులోకి తీసికెళ్ళింది....ఎటు చూచినా ఎడారి... మిట్ట మధ్యాహ్నం.... ప్రేమికుల మధ్య ఎన్నో ఎడారులు వున్నాయి... ప్రేమికులు ఒండొరులని కలుసుకోవడానికి వడివడిగా పరుగెత్తుతున్నారు ... కాగా ఇసుకలో వడిగా పరుగెత్తడం కష్టం.... కాళ్ళు కూరుకుపోతున్నాయి.... వడిగా పరుగెత్తి ఒండొరులని త్వరగా కలుసుకోవాలని ఉబలాటం.... పరుగెత్తి పరుగెత్తి శరీరాలు అలసిపోయాయి.... పాదాలు బొబ్బలెక్కి రక్తాన్ని చిమ్ముతున్నాయి... నోళ్ళు ఎండుకపోతున్నాయి... పాదాల రక్తంతో యిసుక దాహాన్ని తీర్చుకుంటున్నది... అలసట పరుగుని నడకలోకి మార్చింది...అడుగు తీసి అడుగు వేయలేకపోతున్నారు... కలుసుకోలేమోననే నిరాశ ఆ శుష్కవదనాల్లో అప్పుడప్పుడు ద్యోతకమవుతున్నది... పరాజయాన్ని ఒప్పుకోవడానికి హృదయాలు సంసిద్ధంగాలేవు... ప్రయత్నాన్ని వదులుకోలేరు... ప్రేమికులిద్దరూ నడవలేక క్రింద పడ్డారు... అయినా తమ ప్రయత్నాన్ని మానలేదు... క్రిందపడి శరీరాల్ని ఇసుకలో లాగుతున్నారు. ఎడారి పాములకిమల్లే ఇసుకలో పాకుతున్నారు.... కాని ఆ విధంగా ఎంతసేపు పాకగలరని ?... ఎన్ని ఎడారులు దాటగలరని ?... చివరికి శరీరాలు శోషిల్లాయి... ఎండతాపానికి నీళ్ళుపోసుకున్నట్లు చమటలు కారుతున్నాయి...చమటలు కారికారి శరీరాలు కట్టెలై పోయాయి... పెద్ద ఇసుక తుపాను వచ్చి, ఆ శరీరాల్ని యిసుకలో కూర్చివేసింది... ఆ శరీరాలపైన గోరీలుఖీ కట్టింది. అంతటితో ఆ ప్రేమోదంతం విషా

దంగా పరిసమాప్తి జెందింది... ఆయెషా పాడుతున్నంతసేపూ రెహానా నృత్యం చేస్తున్నంతసేపూ ఎందుకో మధు హృదయం, ఆ ఎడారి ప్రేమికుల విషాదగాథని నెమరువేసింది...తనే. ఆ ఎడారి దేశాల ప్రియుడైనట్లూ, కుసుమే ఆ ఇసుకసముద్రాన్ని దాటడానికి ప్రయత్నించిన మధ్య ప్రాచ్య దేశాల ప్రేయసి అయినట్లూ మధు మెదడులో ఒక భావం తళుక్కున మెరిసింది...తన హృదయం నెమరువేసిన ప్రణయగాథ తమ భవిష్యత్ ప్రేమజీవనానికి రూపకల్పన కాదుగదా ? తమ ప్రేమోదంతంకూడా చివరకి దుఃఖభాజన మవుతుందా ? ఏమో ? ఆ భావం పొడసూపడంతోనే మధుకి భయంతో శరీరం కంపరమెత్తింది. అమాంతంగా ముచ్చెమటలు పోసాయి. కళ్ళలో కారుచీకట్లు కమ్ముకున్నాయి.

ఆయెషా పాట ముగిసింది. రెహానా నృత్యం ఆగిపోయింది.

ప్రేక్షకులు తన్మయత్వంలోంచి బయటపడి చప్పట్లు కొట్టారు.

మధు పగటికల కరిగింది. స్వప్నజగత్తునుంచి చేతనా ప్రపంచంలోకి జారి పడ్డాడు.

ప్రశంసా దృక్కులతో ప్రేక్షకులు ఆయెషా, రెహానాలచుట్టూ మూగుతున్నారు.

మధు తనకు తెలియకండా ముందుకు నడిచాడు. గుంపులో ఒకడైనాడు.

యువజనులు ఎవరికి తోచిన ప్రశంసావాక్యాలు వాళ్ళు పలుకుతున్నారు. అభినందనల్ని అందజేస్తున్నారు. ప్రజ అంటే దూరంగా వుండే మధులోకూడా ప్రజామనస్తత్వం ప్రవేశించింది. మధుకూడా ఉభయులకీ అభినందనల్ని అందజేసాడు.

నళినికి మధు అభినందనల్లో ఏదో విశిష్టత కనపడింది. ఏదో ప్రత్యేకత గోచరించింది.

"ఆయెషాకి తను గొప్ప గాయకురాల్ని కావాలని వుంది. గాన విద్యలో ఎంతోకాలంనుంచి కృషిచేస్తున్నది. రెహానా తన నృత్యవిద్యతో ప్రపంచపు పోకడని వ్యాఖ్యానించడానికి సమకడుతున్నది. కూలంకషంగా నృత్యవిద్యని అభ్యసించడానికి ప్రయత్నం చేస్తున్నది. ఆయెషా అప్పు డప్పుడు రేడియోలో పాడుతున్నది. ఆమె గానకళాకౌశలాన్ని ప్రదర్శించ డానికి అది ఒక సాధనం. కాని రెహానాకి అటువంటి అవకాశం ఏదీ లభించడం లేదు. స్టేజ్ ప్రదర్శనానికి. తలిదండ్రులు ఒప్పుకోవడం లేదు. కాలేజ్‌లో నృత్యం చేయడానికికూడా అంగీకరించడం లేదు. ఇస్లాం మతంలో లలితకళలకి నిషేధం వుంది. పూర్వం ఎవ్వరూ గాన నృత్యాది కళల్ని అభ్యసించేవారు కారు. కాని లలితకళల్లో ఒక్క కవిత్వా నికి మాత్రం ఈ నిషేధం ఉండేది కాదు. ఆయెషా, రెహానాల తలి దండ్రులు పూర్వాచారపరాయణులు. ఏదో కొంత మారినా కాలంతోపాటు పూర్తిగా మారలేదు. రెహానాకి సినిమాల్లో చేరాలని వుంది. వెండి తెర మీద. తన నృత్యవిద్య బాగా రాణింపుకు వస్తుందని ఆమె అభిమతం. అల్లా రెహానాకి మంచి అంగసౌష్టవం యిచ్చాడు. వెండి తెరమీద తన లావణ్యాన్ని ప్రదర్శించాలని ఆమె కోరిక. ఆయెషాకి ప్లేబ్యాక్ సింగర్‌గా సినిమాల్లో చేరాలని వుంది. కాని ఉభయుల ఆశయాలు ఈ విషమ పరిస్థితుల్లో ఎల్లానెరవేరుతాయో తెలియదు" అని నళిని ఉపన్యాసధోరణిలో ఉభయుల జీవితాదర్శాలని వివరించింది.

"ఇంతకీ మీ జీవితాదర్శ మేమిటో చెప్పారుకారు" మధు ప్రజా మనస్తత్వానికి పూర్తిగా లొంగిపోయి నళినిని ప్రశ్నించాడు.

టీలు, కాఫీలు తాగడం పూర్తి అయింది. కుసుమ ఒక్కొక్కరికే ఐస్‌క్రీమ్‌లు అందిస్తున్నది.

"నిజమే టాపిక్ బాగుంది. ఒక్కొక్కరూ మీమీ జీవితాదర్శాల్ని గూర్చి చెప్పండి. సలీం! మొదట నీవు ప్రారంభించు."

నళిని తనపై మోపబడిన భారాన్ని వున్న నలుగురికీ తలాకాస్త పంచిపెట్టింది.

సలీం "జోహుకుం" అని ప్రారంభించాడు.

"మా నాన్న ప్రభుత్వ కార్యదర్శి. విద్యాశాఖలో పనిచేస్తున్నారు. కాగా ఐ. ఏ. యస్. ఆఫీసర్. మా నాన్నకి మల్లే ఐ. ఏ. యస్. ఆఫీసర్‌నై గొప్ప ప్రభుత్వోద్యోగి కావడం నా జీవితాదర్శం" అని తన జీవితాశయాన్ని క్లుప్తంగా వివరించాడు సలీం.

"మొదటినించీ నాకు వైద్యవృత్తి అంటే ఎంతో యిష్టం. బి. ఎస్‌సి. పూర్తిచేసి మెడిసిన్‌లో చేరుతాను. మా నాన్న పెద్ద డాక్టర్. బోలెడు ప్రాక్టీసు వుంది. నేను మెడిసిన్ చదివి మా నాన్నకి చేదోడుగా వుంటాను" అని పద్మ, తన భావినిగూర్చి చెప్పింది.

"పిల్లలకి పాఠాలు చెప్పడమంటే నా హృదయం ఎగిరి గంతు వేస్తుంది. నేను బి. ఏ. పూర్తిచేసి ఏ స్కూల్లోనో ఉపాధ్యాయినిగా చేరు తాను" అని శ్యామల తన భవిష్యత్తుని విశదీకరించింది.

"ఆకాశంలో పక్షిలాగా ఎగరడమంటే నాకు సరదా. అందువల్ల నేను పైలెటు నవుతా" నన్నాడు కిశోర్. దానికి అందరూ హర్షామోదాల్ని ప్రకటించారు.

"మాకు డబ్బులేదు - ఏ క్షణాన నా చదువు ఆగిపోతుందో తెలి యదు. మార్కెటులో అన్ని వస్తువుల ధరలకిమల్లేనే వరదక్షిణలు కూడా మండిపోతున్నాయి - మా వాళ్ళు అడిగిన వరదక్షిణ యిచ్చి నాకు పెళ్ళి చేయలేరు, చదువూ చెప్పించలేరు. అందువల్ల నేను ముందు ముందు ఏమవుతానో నాకే తెలియ" దని ఇందిర డగ్గుత్తికతో తన స్థితి గతుల్ని విశదీకరించింది. ఇందిర మాటలు యువతని విచారంలో ముంచెత్తాయి.

ఆ తరువాత యువకంఠం మరీ జీరపోయింది.

ఒకరిద్దరు తమ భవిష్యత్తుని ఎంతో భయంకరంగా చిత్రించారు. ఈ పోటీ ప్రపంచంలో నిజాయితీకి ఏమాత్రం స్థానంలేదనీ, యోగ్యతా యోగ్యతల ప్రసక్తి అసలే లేదనీ నిలుపడానికి నీడా, కుడువడానికి కూడూ దొరికితే అంతే చాలునని అభిప్రాయపడ్డారు.

కులతత్వాలు, మత వైషమ్యాలు సమసిపోతేనే కాని ప్రపంచం వాసయోగ్యం కాదని ఒకరన్నారు. స్వపర భేదాల్నీ, లంచగొండితనాన్నీ కూకటి వేళ్ళతో పెల్లగిస్తేనే గాని, జాతికి విముక్తి లేదని ఒకరు బల్ల గుద్ది చెప్పారు.

నేడు నిర్మింపబడుతున్న మహత్తరమైన ప్రాజెక్టులూ, కర్మాగారాలతో పోలిస్తే మానవజీవితం కడు అస్థిరంగా కనపడుతున్నదనీ, వాటి ముందు నిలిస్తే మన పేదతనమే మనకు తలపుకు వస్తుందనీ ఒకరు మానవ దైన్యాన్ని అభివర్ణించారు.

మొత్తంమీద యువతకు భవిష్యత్తులేదు. జీవితంలో భద్రత కనపడదు. అరక్షణీయస్థితి ఏర్పడింది. కల్లాకపటానికీ, మోసానికీ, నైచ్యానికీ ఇవి రోజులు - యువత యీ అసురకృత్యాల్ని తట్టుకోలేక పోతున్నది.

ప్రాచీన సంప్రదాయాలపైన గురి తప్పింది. వాటి స్థానాన్ని ఆధునిక సంప్రదాయాలు ఆక్రమించడం లేదు.

పాత నమ్మకాలు, విశ్వాసాలు ఎగిరిపోతున్నాయి. వాటి స్థానంలో యువత కొత్త నమ్మకాల్నీ, కొత్త విశ్వాసాల్ని నిలుపుకోలేకపోతున్నది.

పాత విలువలు పటాపంచ లవుతున్నాయి. వాటిస్థానే యువత కొత్త విలువల్ని కల్పించుకోలేకపోతున్నది.

యువత కిది పరీక్షా సమయం - ఇది ఒక యుగసంధి.

యువత వెలిబుచ్చిన నిరాశా నిస్పృహలు మధుని పూర్తిగా క్రుంగదీసాయి.

ఇంతలోకే మధు వంతు వచ్చింది.

"నా హృదయాన్ని ఒక భావం సంక్షోభ పెడుతున్నది. అది నా జీవితంలో ఒక అబ్సెషన్ క్రింద తయారైంది. అడుగడుగునా అది నన్ను పట్టి బాధిస్తున్నది. ఆ భావం ఏమిటో నేను చెప్పలేను. ధైర్యం చేసి ఆ భావాన్ని ఎదురించలేను. పరిస్థితులకి నేను ఎదురీదలేను. పరిస్థితులకి అనుగుణంగా పూచికపుల్లకిమల్లే కొట్టుకు పోవడమే నేను నేర్చుకున్నాను. తన చుట్టూ గల వాతావరణానికి లొంగిపోవడం తప్ప, ఈ విశాలవిశ్వంలో మానవమాత్రుడు ఏదీ సాహసించి చేయలేడు - కాగా చేయజాలడని నా నమ్మకం - ఇట్టి పరిస్థితుల్లో ముందు ముందు నే నేమౌతానో అని ఆలోచించడం కూడా ఒక వ్యర్థప్రయత్నమని నా అభిమతం" అని మధు తన హృదయాన్ని యువజనానికి విప్పి చూపాడు.

"నాకు జీవితంలో ఏ ఆశయాలూ, ఆదర్శాలు లేవు. ఏ జీవితానికైనా ఒక ఆదర్శమంటూ ఉండడం అవసరమని నేను భావించను. నా పరిమితులు నాకు తెలుసు. జీవితంలో ఏ ఘనకార్యాన్నీ నేను సాధించలేను. సాధించడానికి పూనుకోవడం కూడా వృథా ప్రయాస అని నేను విశ్వసిస్తాను. నాకు గతంలేదు. భవిష్యత్తు అంతకన్నా లేదు. నాకు ఒక్క వర్తమానంపైననే గురి. నాకు భవిష్యత్తుని గూర్చి బెంగకాని, దిగులుకాని లేదు. నా ఆనందంకోసం, నా సుఖసౌఖ్యాలకోసం వర్తమానాన్ని వినియోగించుకుంటాను. మీరు నన్ను 'స్వార్థపరురాలివి' అని నిందించినా నాకు అభ్యంతరము లేదు. నేను కావాలని యితరులకి మేలు చేయడానికి పూనుకోను. నేను మేలుచేస్తే ప్రపంచం బాగుపడుతుందని నేను ఒప్పుకోను. ప్రపంచాన్ని ఎవ్వరూ బాగుచేయలేరు. అందువల్ల నాకు పరార్థం అంటే గిట్టదు. నేను కావాలని యితరులకి అపకారం చేయడానికి పూనుకోను. జీవితం వ్యక్తిగతమైంది. సాముదాయిక జీవితానికి వలసిన కట్టుబాట్లని పాటిస్తూ, నా వ్యక్తిగత జీవితాన్ని

నేను ఐచ్ఛికంగా గడుపుతాను. నేను పూర్తిగా 20 వ శతాబ్దపు యువతిని. నా పదకోశంలో సద్వంశానికీ, సత్సంప్రదాయానికీ, ఆధ్యాత్మిక ఘనతకీ అర్థాలు లేవు. కులతత్వాల్ని నేను పాటించను. ఉద్యోగాల విషయంలో స్వపర భేదాల్ని పాటించడం నాకు గిట్టదు. యోగ్యతాయోగ్యతల్ని బట్టి ఉద్యోగసమస్యని పరిష్కరించడం అవసరమని నేను భావిస్తాను. లంచగొండితనమంటే నాకు పరమ అసహ్యం. మోసానికీ, దౌర్జన్యానికీ అతీతంగా ఉండవలచాను. కల్లాకపటం లేని బ్రతుకు బ్రతకదలిచాను. దేవుడున్నాడో, లేడో నాకు తెలియదు. ఒకవేళ వుంటే, దైవచింతన చేయవలసిన అవసరం నాకు ఇంతవరకూ జీవితంలో కలగలేదు. నేడు పాత విలువలకి సమాదరణ తగ్గింది. వాటి స్థానే కొత్త విలువల్ని సృష్టించుకోవలసిన అవసరం ఏర్పడింది. నా జీవితంలో కొత్త విలువల్ని నిలుపుకోవడానికి వ్యక్తిగతంగా నేను కృషి సలుపుతున్నా" నని మంచిచెడ్డల బేరీజువేసి, వివిధ సమస్యల్ని గూర్చి తన వ్యక్తిగతాభిప్రాయాల్ని వెలిబుచ్చింది నళిని.

యువజనుల జీవితాలపైన ఏ దుష్టప్రభావాలూ పడకపోతే, యువత ఎంత స్వచ్ఛంగా, ఎంత స్వేచ్ఛగా జీవితసమస్యల్ని గూర్చి ఆలోచిస్తుందో, ఆనాడు మొదటిసారిగా తెలిసివచ్చింది మధుకి. తన సంకుచిత దృష్టితో, అల్పత్వంతో, స్వార్థనైచ్యాలతో యువజీవితాల్ని విషపూరితం చేయకూడదని ఎందుకు తోచదో ఈ గుడ్డిలోకానికి.

ఇంతలోకే కుసుమ మధుకీ, నళినికీ ఐస్‌క్రీమ్‌లు అందించింది. నళిని ఎడమచేతితో ఐస్‌క్రీమ్ ప్లేటుని అందుకుంటూ, కుడిచేత్తో కుసుమ ఎడమచేతిని గట్టిగా పట్టుకుంది. దొరికిన చేతిని కుదుపుతో "చెప్పు పిల్లా నువ్వేమి కాదలిచావో ?" అని ప్రేమ ఉట్టిపడుతున్న కంఠంతో నళిని గోముగా కుసుమని అడిగింది.

"నే నేమీ కాను - కాగా ఏమీ కాదల్చుకోలేదు. నీ సేవ చేస్తో, జీవితాంతం వరకూ నీ దగ్గరే పడివుంటాను - అంతే" అని కుసుమ నిస్సంకోచంగా జవాబు చెప్పింది.

కుసుమ చూపిన అవ్యాజానురాగానికి నళిని అమాంతంగా వెన్న ముద్దకుమల్లే కరిగింది. తన చేతిలోని ఐస్‌క్రీమ్ ప్లేటుని క్రిందికి జార విడిచి, చప్పున కుసుమని గట్టిగా కావలించుకుంది. ఐస్‌క్రీమ్ ప్లేటు క్రిందపడడంలో బద్దలైన సంగతి ఆమె గమనించలేదు. నళిని చర్యకి, కుసుమ మంత్రముగ్ధ అయింది. కుసుమ తన కౌగిలిలో నళినిని బంధిస్తూ "నేనంటే మా పిచ్చి వదినకి ఎంత ప్రేమమ్మా" అని వినీవినపడకుండా గొణిగింది. ఆ ఆప్యాయతకి అతిథులు చకితులైనారు. ఎందుకో మధు కళ్ళల్లో నీళ్ళు నిండాయి. నళినీ కుసుమలు వివశులై ఉత్తరక్షణం వరకూ ఒకరి కౌగిలిలో ఇంకొకరు వుండిపోయారు. ఆ క్షణం నిశ్శబ్దంగా నిలిచిపోయింది. ఎక్కడా సంచలనం లేదు. ఎక్కడా కదలిక లేదు. ఎక్కడ నిలుచున్నవాళ్ళు అక్కడే నిలబడిపోయారు. ఎత్తిన స్పూన్ల చేతులు ఎత్తినట్లుగానే వున్నాయి. స్పూన్‌లలో గాని, ప్లేట్లలో గాని ఐస్‌క్రీమ్ కరగడంలేదు. ఎవ్వరూ మాట్లాడడం లేదు. చివరకి పెదవులు కూడా కదపడంలేదు. ప్రకృతి అచేతనమైంది. యావత్తు దృశ్యం ఫోటోగా మారింది.

నళిని త్రుటికాలం తరువాత తేరుకుంది. నెమ్మదిగా కుసుమ కౌగిలిని సడలించి ఆ బాహుబంధంలోంచి బయటపడింది. అచేతనమైన ప్రకృతి చైతన్యవంతమైంది. యువజనం తిరిగి ప్రాణంపోసుకుంది. కదలిక, సంచలనం తిరిగి ప్రారంభమైంది.

"పైగా యిది ఒకటా? నిన్ను పోషించడమే కాక, ఎక్కడినించో ఒక అన్నయ్యని తెచ్చి, అతన్నికూడా నీతోపాటు పోషించమంటావు- ఇదేనా నీవు జీవితాంతంవరకు నాకు సేవచేయడం?" అని నళిని ఒక

ఛలోక్తిని విసిరింది. దానితో బిగుసుకుపోయిన వాతావరణం తిరిగి సడలిచ్చింది. వెంటనే అందరూ గొల్లుమన్నారు. కుసుమ శరీరంలోని ఆసాంతం రక్తం బుగ్గల్లోకి చిమ్ముకొచ్చి, ఒక త్రుటికాలంవరకు అక్కడ గడ్డకట్టుకు పోయింది.

"అన్నయ్యని తెచ్చి ఉభయులనీ పోషించడం అనవసరం. తెచ్చిన వెంటనే, ఇద్దరినీ ఇంట్లోంచి గెంటివేస్తే వున్నకాస్త పీడా విరగడై పోతుంది" అని ఆయెషా సలహా యిచ్చింది.

"భలే భేషైన సలహా" అని ఆయెషా ప్రతిపాదనని రెహానా బలపరిచింది.

"ఈ నంగనాచిని అల్లా సుళువుగా వదులుతానా ? జీవితాంతం వరకూ దీన్ని నా దగ్గర అట్టేపెట్టుకొని, నేనూ అన్నయ్యా కలిసి దీనికి మూడు చెరువులనీళ్ళు తాగిస్తాం" అంది నళిని గొల్లున నవ్వుతో - నళిని మాటలకి ఎవ్వరికీ నవ్వు ఆగలేదు. అందరూ తిరిగి గొల్లుమన్నారు.

"నేను అసలు పెళ్ళే చేసుకోను" అని గొణిగింది కుసుమ. ఆ గొణుగుడు దగ్గరున్న ఒక్క నళినికిమాత్రం వినపడింది.

"పెళ్ళిచేసుకోక గుదిబండవలె నా మెడకు పడుదామనా ? నీ ఆటలు నా దగ్గర ఏమాత్రం సాగవు" అని నళిని కోపాన్ని నటించింది.

కుసుమ ఏమీ సమాధానం చెప్పలేదు. "వదినా" అని మాత్రం, జాలి ఉట్టిపడే కంఠంతో అంది. అంతటితో నళిని గంభీరించింది. తిరిగి ఆ ప్రసక్తి తేలేదు.

ఐస్‌క్రీమ్‌లు తినడం పూర్తి అయింది. ఆహూతులు ఒక్కొక్కరే నళినికి అభినందల్ని చెప్పి శలవు పుచ్చుకుంటున్నారు.

మధుకి అభినందల్ని చెప్పడమంటే ఎందుకో నచ్చలేదు. తను ఆ యింట్లో ఒక నౌకరు. సమానస్కందులు చెప్పవలసినఅభినందనల్ని ఒక నౌకరు చెప్పడం సముచితంగా వుంటుందో, వుండదో అనే సంధిగ్ధా

వస్థలోపడి, అభినందనల్ని చెప్పకుండానే శలవు పుచ్చుకున్నాడు. కిశోర్ పాఠానికి ద్వితీయవిఘ్నం కలిగినందుకు మాత్రం అతని హృదయం చివుక్కుమంది. దారిపొడుగునా ఆనాటి పార్టీ సంగతుల్ని గూర్చి ఆలోచిస్తూ మధు యింటిముఖం పట్టాడు.

★ ★ ★

# 3

మధుకి పార్టీఅనంతరం రెండురోజులవరకూ కిశోర్ కనపడలేదు. మొదటిరోజున ఏదో సినిమాకి వెళ్ళాడని పనిమనిషి చెప్పా తను ఉసూరుమని వెంటనే తిరిగి యింటికి వెళ్ళాల్సి వచ్చింది మధుకి. రెండోరోజున తన సంగతి ఎవ్వరూ పట్టించుకోలేదు. కిశోర్ యింట్లో వున్నట్టుగాని లేనిదీకూడా ఎవ్వరూ చెప్పలేదు. ఆనాడు కిశోర్ గదివేపుకూడా ఎవ్వరూ వచ్చినట్లు లేదు. కూర్చొని, కూర్చొని మధుకి విసుగెత్తింది. తను ఎవ్వరితోనైనా చెప్పి వెడదామంటే ఎవ్వరూ కనపడరు. గంటకుపైగా కూర్చున్నాడు. చీకటిపడితే తనే గదిలో లైటు వేసుకున్నాడు. ఆ యింట్లో కిశోర్ చదువు విషయమై ఎవ్వరూ పట్టించుకోకపోవడం చూచి మధుకి ఆశ్చర్యంవేసింది. చిన్నతనంలో పిల్లల్ని అదుపు ఆజ్ఞల్లో పెట్టకపోతే, వాళ్ళు పెద్దవాళ్ళై అకుకు అందకండా-పోకకు పొందకండా చెడిపోతారు. ఆ యింట్లో ఆ సంగతి ఎవ్వరూ గుర్తించినట్లు లేదు. కుర్రవాడి ఖర్మానికి కుర్రవాడిని వదిలివేసారు. వాడు విచ్చలవిడిగా తిరుగుతున్నాడు. సాయంత్రం మాస్టర్ వస్తాడని వాడికి ఏమాత్రం భయంలేదు. పోనీ, ఈ విషయంలో ఎవరికైనా హెచ్చరిక చేతామంటే, ఆ యింట్లో ఎవ్వరూ కనపడరు. మొదటిరోజున కుర్రవాడిని వెంటబెట్టుకొచ్చిన రాములమ్మ

గారుకూడా ఈ మూడురోజులనుంచీ కనపడలేదు. గృహ యజమాని ఉమామహేశ్వరరావుగారు ఎక్కడ వుంటారో తెలియదు. వారి దర్శనం, తను ట్యూషన్‌కి కుదిరినప్పటినించీ ఇంతవరకూ కాలేదు. గడచిన రెండురోజులనించి నళిని కుసుమలుకూడా కనపడడం మానివేశారు. ఇంక కుర్రవాడి విషయంలో ఎవరితో మాట్లాడడం? ఎందుకో ఆ ట్యూషన్, ఇంక అట్టేకాలం కొనసాగదని తోచింది మధుకి. పోనీ తను ట్యూషన్ వదులుకుంటే? నిజమే, తను చదువు చెప్పకండా అన్యాయంగా ధనం ఆర్జించడమేమిటి? తనకు డబ్బు లేకనా? డబ్బు లేకపోయినప్పటికీ, అన్యాయార్జితానికి తన మనస్సు ఒప్పుకోదు. తీరా మలుకుంటే, తనకు ట్యూషన్ కుదిర్చిపెట్టిన రామచంద్రయ్య ఏమను వరక్కటాడో? రామచంద్రయ్య ఏమనుకున్నా తనకు అభ్యంతరంలేదు. మూడు:పట్ల తనకు సానుభూతి వుండవలసిన అవసరంలేదు. ఈ రామ మాటద్రయ్య, ఆ రంగనాయకుల అన్నయ్య కాదనా తను సానుభూతి ంథం? వీలవుతే ఉమామహేశ్వరరావుగారి దగ్గర రామచంద్రయ్య ఆ గోటకి పిలువలేకండా చేయడమే మంచిది. కాని, తాను ట్యూషన్‌కి ప్పుకుని, తీరా నాలుగురోజులైనా కాలేదు. అప్పుడే వదిలివేయడం బాగుంటుందా? కుర్రవాడి విషయంలో హెచ్చరిక చేయడానికి, గడచిన రెండు రోజులనించీ తనకు అవకాశం దొరకనిమాట నిజమే. కాని అంతమాత్రానికి ట్యూషన్ వదలుకోవడం భావ్యమేనా? ఈ రోజు దొరకకపోతే రేపు అవకాశం దొరుకుతుంది. రోజులతరబడి ఆ యింట్లో ఎవ్వరూ కనపడకండా వుంటారా కుర్రవాడిని గూర్చి మాట్లాడడానికి? అందువల్ల రెండురోజులకే, కుర్రవాడి విషయంలో తాను అంత నిరాశ జెందవలసిన అగత్యం ఏమీ కనపడలేదు మధుకి. నిజంగా తాను వదులుకోదలిచినా, వదులుకోగలడా ఆ ట్యూషన్‌ని? అది తనకు సాధ్యమా? ఏమో, సందేహమే!!! గడచిన నాలుగు రోజుల్లో ఆ

యింట్లో జరిగిన సంఘటనల్ని తాను మరిచిపోగలడా? మతిపోతేతప్ప. ఆ సంఘటనల్ని మరచిపోవడం అసంభవమని తోచింది మధుకి. నాలుగు రోజులక్రితం ఆ యింట్లో తనకు దైవికంగా కుసుమ కనపడింది. ప్రథమ దర్శనంలోనే తలనితలంపుగా తన శుష్కించిన ఆశాలతలు చిగురించాయి. అప్పుడే ఆ చిగుళ్ళు మొగ్గలు తొడుగుతున్నాయి. ఇంక మొగ్గలు కుసుమించడానికి అట్టేకాలం పట్టదు. త్వరలో తన హృదయం విరియబూసి నందనవనం కాబోతున్నది. అప్పుడు ఎటుచూచినా కుసుమాలే...ఎటు ఆఘ్రాణించినా కుసుమ సౌరభాలే...ఇట్టి శుభోదయ వేళ, తను సాహసించి చిగురించిన ఆ ఆశాలతల్ని తన చేతులారా త్రుంచివేసుకోగలడా? అసాధ్యం! ముమ్మాటికీ అసాధ్యం!!! తను సాహసించి జీవితంలో ఏపని చేయలేడు. పూచికపుల్లకిమల్లే, తను పరిస్థితులకి అనుగుణంగా కొట్టుకుపోవల్సిందే...అదే తన ప్రకృతి... అదే తన మనస్తత్వం...మరి అల్లాంటప్పుడు తను గొప్పలకి వెళ్ళడం దేనికి? ప్రగల్భాలు పలకడమెందుకు? ఏమో అంతా విచిత్రం...బహుశా అదే జీవితమేమో? జీవితానికి సంబంధించిన సుడిగుండంలోపడి తను ఆవిధంగా గిలగిల తన్నుకోవల్సిందే...నాలుగవరోజున కిశోర్ కోసం ఎదిరిచూచీ చూచీ చివరకు విసుగెత్తి, కుసుమకి సంబంధించిన కొన్ని కలల్నీ, కొన్ని ఆలోచనల్నీ వెంటబెట్టుకొని, మధు తన గదికి బయల్దేరి వెళ్ళాడు.

మధు అయిదవ రోజున మామూలు ప్రకారం సాయంత్రం ఆరు గంటలకల్లా ట్యూషన్‌కు వెళ్ళాడు. గదిలో కిశోర్ లేడు. తలవనితలంపుగా నళిని కూర్చొనివుంది. గదిలోకి వెళ్ళడమా, లేక మానడమా అనే సందేహం కలిగింది మధుకి. నళిని ఆ సంగతి గ్రహించినట్లు వుంది. "రండి మాస్టరుగారు, లోపలికి రండి" అని అంది. మధుకి గదిలోకి వెళ్ళక తప్పిందికాదు. అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా గదిలోకి వెళ్ళాడు.

"ఆడపిల్లల్ని చూసి, అంత భయపడితే ఎల్లాగండీ మాస్టర్ గారు?" అని అడిగింది నళిని కొంటెగా.

"ఆడపిల్లలంటే నాకా భయం?" అని హీరోకి మల్లే ఎదురుప్రశ్న వేసాడు మధు. కాని అతని కంఠస్వరమే అతనికి విచిత్రంగా ధ్వనించింది.

"మరికాకపోతే, లోపలికిరావడానికి ఎందుకంత సందేహించారు?" అని అడిగింది నళిని, తన వాదాన్ని దృఢపరుస్తో —

"లేదే" అని తప్పించుకోవడానికి చూచాడు మధు. నళినికి తను పట్టుబడిపోయినట్లు అతనికి తట్టలేదు.

సంభాషణ ధోరణి చూచి, టాపిక్ మార్చింది నళిని. "కూర్చోరేం, అల్లా నిలబడుతారెందుకు?" అని అడిగింది నళిని, మధుని-

ఈసారి ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే కుర్చీలో కూర్చున్నాడు మధు. అతని తొందరపాటుని గమనించి, కొద్దిగా చిరునవ్వు నవ్వింది నళిని. ఆ చిరునవ్వులోని అంతరార్థం గ్రహించకపోలేదు మధు. కాని అదేవిషయాన్ని సాగదీస్తే ఇంకే అనర్థానికి దారితీస్తుందోనని భయపడి మౌనంవహించాడు. ఎందుకో అతనికి నళినిముందు మెలగడం ఎంతో యిబ్బందిగా తోచింది.

"ఇంట్లో బాబు లేడు- కుసుమకూడా లేదు- ఏమీతోచక యిటుకేసి వచ్చా"నంది నళిని అలవోకగా. గుండెల్లో పెద్దగుండు పడ్డట్లైంది మధుకి.

"ఎక్కడికి వెళ్ళారు?" అని మాత్రం అడగగలిగాడు మధు, కాస్త తేరుకొని-

"బాబుకి బట్టలు కావల్సివచ్చి, బజారుకువెళ్ళా"రని నళిని సమాధానం చెప్పింది.

"ఎప్పుడు వెళ్ళా"రని ప్రశ్నించాడు, మధు ఆతురతగా-

"ఇంతకుముందే వెళ్ళారు. తిరిగి రావడానికి ఒక గంటకు పైగా పట్టవచ్చు" అంది నళిని లీలగా-

తన శరీరంపైన వందలిందెల చన్నీళ్ళు కుమ్మరించినట్లైంది మధుకి. "అయితే, నేను వెడతాను- నేను వచ్చినట్టు మాత్రం బాబుకి చెప్పండి" అని తత్తరపాటుతో లేచాడు మధు. ఆ తత్తరపాటు చూచి, నళినికి నవ్వు వచ్చింది. ఈసారి జంకూ, గొంకూ లేకండా స్వేచ్ఛగా నవ్వేసింది.

" ఎందుకలా నవ్వుతున్నారు ? " అని అడిగాడు మధు నళిని మనస్తత్వం అర్థంకాక-

"ఊరికేనే" అని బొంకింది నళిని- "కూర్చోవడమా, లేక వెళ్ళడమా" అనే సంధిగ్ధావస్థలో పడ్డాడు మధు. ఎంత ఆలోచించినా, ఎటూ తేల్చుకోలేకపోయాడు. ఆ అనిర్ణీతస్థితిలో నిలుచున్నవాడు నిలుచునేవుండిపోయాడు.

"తొందరపడి తనని ఎంత తప్పుగా అర్థంచేసుకున్నాడీ మాస్టర్" అని అనుకుంది నళిని లోలోపల. "వెడుదురుగాని కూర్చోండి" అని మాత్రం పైకి అనగలిగింది.

మధు విధిలేక తిరిగి కూర్చున్నాడు.

తను ఒంటరిగా అతనితో మాట్లాడినంతమాత్రాన తనకు ఏదో దురుద్దేశాన్ని అంటగట్టాడు. అతను ఇంతవరకు ఏ స్త్రీతో ఒంటరిగా మాట్లాటివుండడు- మొత్తంమీద మనిషి చాలా అమాయకుడనుకుంది నళిని. మాస్టర్ అమాయకత్వానికి జాలిపడి, నళిని అతన్ని పూర్తిగా క్షమించివేసింది. అయినా ఎందుకో అతన్ని ఉడికింతామని బుద్ధిపుట్టింది ఆమెకు.

"మీరు వెళ్ళదల్చుకుంటే వెళ్ళిపోవచ్చు" అని అంది నళిని, తన వాక్యం అతనిపైన ఏలాటి ప్రభావం కలగజేస్తుందో, చూతామనే కుతూహలంకొద్దీ-

మధు ఆ వాక్యానికి నిర్ఘాంతపోయాడు. మొహంమీద కత్తివేసినా రక్తంచుక్కలేదు. ఒక క్షణంవరకు నిరుత్తరుడైనాడు.

"అదేమిటి అల్లా విచిత్రంగా మాట్లాడుతున్నారు. ఇంతకుముందే వుండమని, ఉత్తరక్షణంలో వెళ్ళమంటున్నారు" అన్నాడు మధు ఆశ్చర్యం ఉట్టిపడుతున్న కంఠంతో.

"ఆఁ, ఏమీలేదు, మీకేమైనా తొందరపనుంటే వెళ్ళవచ్చునన్నాను. అంతే" అని సర్దేసింది నళిని.

"ప్రత్యేకంగా పనేమీలేదు. ఇంటికి వెడితే ఏదైనా పనిచూసుకో వచ్చునని వెడుతానన్నాను" అని కొంచం కుదుటపడ్డాడు మధు.

ఒక వ్యక్తిని తన తెలివితేటలతో ఆడించివేయడం, ఇది మొదటి మాటు కాదు నళినికి. సమాన ఉజ్జీలైతే, ఆ ఆడించడం కొంత సరదాగా వుంటుంది. కాని మాస్టర్‌వంటి అమాయకులు దొరికినప్పుడు, ఆటసాగక విసుగెత్తుతుంది. కాని ఇందులో యితరుల మనస్సు నొప్పించడం ఆమె ఉద్దేశ మెన్నటికీకాదు. ఎదుటివాళ్ళు ఆ సంగతి గుర్తించడం ఎంతైనా క్షేమకరం.

కుసుమకుమల్లే మాస్టర్‌తో దొంకతిరుగుడుగా వ్యవహరించడం ప్రమాదకరమని గుర్తించింది నళిని. అందువల్ల అతనితో సూటిగా వ్యవహరించడానికి పూనుకుంది ఆమె.

"మీ పేరేమన్నారు ?" అని అడిగింది నళిని.

"మధుసూదనరావు" అని జవాబు చెప్పాడు మాస్టర్.

"అంత పొడుగాటి పేరుతో పిలవడం కష్టమేనే" అంది నళిని, మాస్టర్ రియాక్షన్ కోసం ఎదురుచూస్తూ.

"పోనీ, అందరిలాగా మీరూ నన్ను మధు అనే పిలవండి" అని సూచించాడు అతను.

"మీరేమీ అనుకోకపోతే......"

"అబ్బే, ఏమీ అనుకోను" అని నళిని వాక్యం పూర్తికాకముందే, మధు సమాధానంచెప్పాడు.

"నన్నెవరైనా 'నళినిగారూ' అని పిలుస్తే నాకు చికాకుగా వుంటుంది. కారణమేమిటో ఊహించగలరా?" అని అడిగింది నళిని మధుని.

"లేదే, ఊహించలేకపోతున్నాను" అన్నాడు మధు అమాయికంగా-

"నా పేరు చివరన ఆ గారుంచే, అది కృత్రిమంగా ధ్వనిస్తుంది. అందువల్ల ఎవ్వరైనా 'నళినిగారు' అని నన్ను పిలుస్తే నాకు ఎబ్బెట్టుగా తోస్తుంది" అని అంది నళిని, సూటిగా మధు మొహంలోకి చూస్తూ-

"ఏదో నిగూఢ కారణమైవుంటుందని నేను అప్పటినించీ ఆలోచిస్తున్నాను. ఇంత సులువైనదని ఊహించలేకపోయాను" అని అన్నాడు మధు, సంగతి సందర్భాలు విశదీకరిస్తో-

"మన ఉభయుల మధ్య కొంతకాలంపాటు సంభాషణ కొనసాగాలంటే, మీరు ఆ 'గారు' అనే మాట తీసేసి మాట్లాడాల్సివుంటుంది" అని అంది నళిని, మధుతో-

"కాని, ఒక్క షరతుపైన" అని అన్నాడు మధు జవాబుగా-

"ఆ షరతు ఏమిటో చెప్పండి?" అని అడిగింది నళిని.

"మీరు నన్ను ఏకవచనంతో సంబోధిస్తే, నేను మిమ్మల్ని 'మీరు' అనడం మానుకుంటాను" అన్నాడు మధు.

"నాకేమి అభ్యంతరంలేదు" అంది నళిని.

"నాకూ అభ్యంతరంలేదు" అన్నాడు మధు.

"అయితే, నన్ను 'నళినీ, నళినీ, నళినీ' అని మూడుసార్లు పిలవండి" అంది నళిని ఒప్పందానికి నాంది ప్రస్తావనగా. ఆ సూచనకి మధుకి ఫక్కున నవ్వువచ్చింది. స్వచ్ఛంగా గలగల నవ్వేసాడు మధు.

"నవ్వుతున్నా రెందుకు?" అని అడిగింది నళిని.

"మీ సూచన పిల్లలాటగా వుందని" అన్నాడు మధు.

"యువతీ యువకులు కూడా పిల్లలకిమల్లే స్వేచ్ఛగా నవ్వడం నేర్చుకోవాలి" అంది నళిని.

"అప్పుడుగాని దేశం బాగుపడదంటారా?" అని అడిగాడు మధు.

"దేశంమాట దేవుడెరుగు - మీరుమాత్రం బాగుపడరని నాకు తెలుసు" అంది నళిని జవాబుగా.

"ఎందువల్ల?" అని అమాయికంగా అడిగాడు మధు.

"గడచిన అయిదు రోజులనుంచీ మీ మొహంమీద ఏ ఒక్కసారికూడా చిరునవ్వు చూడలేదు. అంత గంభీరంగావుండి ఈ విశాల విశ్వంలో మీరు ఏ మహత్తరకార్యాన్ని సాధించదలిచారో నాకు తోచడం లేదు." అని అంది నళిని తన అభిప్రాయాన్ని విపులీకరిస్తో.

"జీవితంలో సాహసించి నేను ఏకార్యమూ చేయలేనని, ఆనాడు పార్టీలో చెప్పానే" అని అన్నాడు మధు తన అశక్తతని వెల్లడిస్తో.

"మరి ఎందుకు వచ్చిన గాంభీర్యం చెప్పండి?" అని నళిని సూటిగా మధుని ప్రశ్నించింది.

"అరనిమిషం క్రితమే ఆ గాంభీర్యాన్ని ఎగురగొట్టి వేసారే" అన్నాడు మధు జవాబుగా.

"అసలు విషయాన్ని తప్పించివేయడానికి చూస్తున్నా"రని నిందారోపణ చేసింది నళిని.

"లేదే!" అని తిరిగి తప్పించుకున్నాడు మధు.

"మిమ్మల్ని ఒక విషయం అడగ దలిచాను. ఏ అరమరలేకుండా సమాధానం చెబుతారా?" అని అడిగింది నళిని మధుని.

"చెప్పదగిన విషయమైతే తప్పకుండా చెబుతాను" అన్నాడు మధు.

"ఎదుటి వ్యక్తిని విశ్వసిస్తే, చెప్పగూడని విషయమంటూ ఒకటి వుండదు" అని అంది నళిని.

"అది నిజమే, కాని ఎదుటి వ్యక్తిపైన గురి కుదరడానికి కూడా కొంతకాలం పడుతుంది" అని అన్నాడు మధు.

"అది కాదనను. గురికుదరడానికి, ఆ ఎదుటవ్యక్తి ఎటువంటిదో, కొంత తెలుసుకోవాల్సి వుంటుంది. ఆ విషయం తెలియజేయడానికే, అసలు నేనీ గదిలోకి వచ్చింది" అంది నళిని తనపై ఖరిని విశదీకరిస్తో.

"అన్ని విషయాలు ముందుగానే ఆలోచించి, ఈ గదిలోకి వచ్చారన్నమాట" అని అన్నాడు మధు.

"కొంతవరకు అంతే" అని నళిని క్లుప్తంగా జవాబు చెప్పింది.

"మిమ్మల్ని నేనూ, నన్ను మీరూ తెల్సుకోవాల్సిన అవసరం ఏర్పడిందన్నమాట" అన్నాడు మధు.

"మిమ్మల్ని" "మీరూ" అన్న మాటల్ని ధ్వని పూర్వకంగా నొక్కుతూ.

"కొంతవరకు" అని తిరిగి అంది నళిని ధ్వని ప్రధానమైన మాటల్ని అర్థం చేసుకుంటూ.

"అయితే, మీరు అడగదలచిన ప్రశ్న ఇంక అడగవచ్చు" అని అన్నాడు మధు.

"బహువచనంలోనే సంభాషణ కొనసాగించడం అవసరమని, ఇంకా మీరు భావిస్తున్నారా" అని అడిగింది నళిని.

"లేదు - మీ పేరుపెట్టి, ముచ్చటగా మూడుసార్లు మిమ్మల్ని పిలవమన్నారు. పిలవనా ?" అని అన్నాడు మధు, ఒక ఒప్పందం కుదుర్చుకునే ఉద్దేశంతో.

"మన ఉభయులమధ్య ఏ ముచ్చటా వుండడానికి వీలులేదని, మీకు ఈపాటికే తెలిసివుంటుంది" అని అంది నళిని.

"తెలుసు" నన్నాడు మధు జవాబుగా.

"బహువచన ప్రయోగం మన సంభాషణకి ఏలాటి అంతరాయం కలిగించడంలేదు. అందువల్ల బహువచనంలోనే మన సంభాషణ కొనసాగించుకుందాం" అని సూచించింది నళిని.

"మీయిష్టం" అని మాత్రం అనగలిగాడు మధు. ఎందుకో అతని 'అహం' బలంగా దెబ్బతిన్నది. నళిని ఆవిషయం గ్రహించకపోలేదు.

"ఏదో సంఘటన మీ జీవితాన్ని క్రుంగదీస్తున్న దన్నారు - ఆ సంఘటనేమిటో చెబుతారా ?" అని అడిగింది నళిని సూటిగా.

"అది వ్యక్తిగతమైన విషయం - చెప్పజాలనందుకు ఎంతో చింతిస్తున్నాను" అని మర్యాదగా తప్పించుకున్నాడు మధు.

"చెప్పలేకపోతే చెప్పకండి - కాని ఆ సంఘటన మిమ్మల్ని క్రుంగదీయడం మాత్రం నాకేమీ నచ్చలేదు" అని అభిప్రాయపడింది నళిని.

"ఆ సంఘటన నాకు ఒక అబ్సెషన్‌గా తయారైంది. దానికి విరుగుడేమిటో తోచడంలేదు" అని తన నిస్సహాయతని వ్యక్తపరిచాడు మధు.

"ఎటువంటి సంఘటనైనా ఆప్తులతో చెప్పుకోవడం మంచిది. దానివల్ల హృదయం కొస్త తేలిక పడుతుంది" అని సూచించింది నళిని.

"నిజమే, ఆప్తుల్ని సృష్టించుకోవడం కూడా ఒకకళే" అని అభిప్రాయపడ్డాడు మధు.

"మీ జీవితంలో ఆ అవకాశాన్ని కల్పించడం కోసమే, నేను ఈ గదిలో నేడు మీకోసం నిరీక్షించడం" అని విస్పష్టపరిచింది నళిని.

"కృతజ్ఞుడిని - ఆ అవకాశాన్ని పురస్కరించుకొని, మీకు ఎన్నడో నా హృదయాన్ని విప్పిచూపుతాను" అని మధు, నళినిపట్ల తన విశ్వాసాన్ని ప్రకటించాడు.

"మీకు ఏ సమయంలో, ఏ సహాయం కావల్సివచ్చినా నళినిని అడగడం మాత్రం మరిచిపోకండి." అని చెప్పింది నళిని. వెంటనే అక్కడినించి బయల్దేరి తనగదికి వెళ్ళడానికి ఉద్యుక్తురాలైంది. ఆసంగతి గ్రహించినట్టున్నాడు మధు.

"వెళ్ళడానికి తొందర పడుతున్నట్టున్నారు. పనిలేకపోతే కాసేపు కూర్చోండి" అని అర్థించాడు మధు నళినిని జాలిగా.

"పనేమీ లేదు, చెప్పండి" అని నళిని లేస్తున్నదల్లా తిరిగి కూర్చున్నది.

"కుసుమ మీకు మరదలు ఎల్లా అవుతుందో కాస్త చెబుతారా ?" అని అడిగాడు మధు. ఎంతో ధైర్యంకూడ గట్టుకొని.

"కుసుమ మా మామయ్యకూతురు - అందువల్ల నాకు మరదలవుతుంది" అని చెప్పింది నళిని.

"మామయ్య అంటే ఉమామహేశ్వరరావుగారా ?" అని అడిగాడు మధు.

"అవు"నని నళిని క్లుప్తంగా సమాధానం చెప్పింది.

"మీరు రాములమ్మగారి............"

"అవును, రాములమ్మగారి కుమార్తెనే" అని మధువాక్యం పూర్తి కాకముందే, అతనికి కావల్సిన సమాచారం అందజేసింది నళిని.

"కుసుమ ఉమామహేశ్వరరావుగారి స్వంతకూతురా ?" అని అడిగాడు మధు, కంఠంలో ఏదో సందేహాన్ని ధ్వనింపజేస్తూ.

"స్వంతకూతురు కాకపోతే, ఈ యింట్లో ఎందుకుంటుంది ?" అని ఎదురుప్రశ్న వేసింది నళిని. దానితో మధు తికమకపడ్డాడు.

"స్వంతకూతురంటే........." ఏదో అడగడానికి మధు సందేహిస్తున్నట్లు కనపడింది నళినికి, ఆ వాక్యనిర్మాణం ప్రశ్నార్థకంగావున్నా, అతడు దానిని ప్రశ్నార్థకంగా ఉచ్చరించకపోవడంవల్ల - అతని సందేహా

మేమిటో, నిజంగా అతను ఏమి అడగదల్చుకున్నాడో, నళినికి బోధ పడింది.

"ఇప్పటికి యిరవై సంవత్సరాల క్రిందిమాట - ఒకనాడు ఉమామహేశ్వరరావుగారు ఒక బ్రాహ్మణ యువతిని లేవదీసుకొని వచ్చారు - ఆమె విధవ - చిన్నతనంలోనే భర్త పోయాడు. జీవితంలో అశుభమూ శుభమూ ఎరుగదు. ఆమె ఉమామహేశ్వరరావుగారినే, నిజమైన భర్తగా భావించింది. యావజ్జీవితం వారిని పూజించింది. అప్పటికి కిశోర్ తల్లి, అంటే మా మేనత్త బ్రతికేవుంది. ఆమె తనయింట్లో ఆ బ్రాహ్మణ యువతిని ఉంచడానికి యిష్టపడలేదు. ఉమామహేశ్వరరావుగారు ఆ యువతిని పల్లెపల్లె గ్రామంలో తమ తోటలోని బంగళాలో వుంచి, ఆమెతో విడిగా ఇంకొక కాపురం పెట్టారు. రెండు కాపురాలూ అప్పట్లో సమంగా చూచుకున్నారు. దాదాపు అయిదు సంవత్సరాల తరువాత కుసుమ పుట్టింది. పుట్టిన మూడు సంవత్సరాలకి ఆమెకి మాతృవియోగం కలిగింది. అప్పటికే మా నాన్న పోయాడు. మా అమ్మ పుట్టింటిపంచలు పట్టింది. తల్లి పోవడంతోనే మా అమ్మ కుసుమని దగ్గరికి తీసింది. అప్పటినించీ నేనూ, కుసుమా స్నేహితుల మైనాం. ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకున్నాం. అప్పుడు నాకు అయిదేళ్లు. కుసుమకి మూడేళ్లు. అప్పటినించీ మేము ఉభయులం ఏకగర్భ జనితులకిమల్లే పెరిగాం. ఉమామహేశ్వరరావుగారు కోరి ఏర్పర్చుకున్న కాపురం పటాపంచలు కావడంతో ప్రేయసీ వియోగానికి తట్టుకోలేక తాగుడుకు అలవాటుపడ్డారు. ఉదయంనుంచీ, సాయంత్రం వరకూ ఒకటే తాగుడు - భార్య ఎంత వారించినా, ఏమాత్రం లక్ష్యం చేయలేదు. తాగుడుకి స్త్రీ వ్యసనం జతపడింది. ఈ రెండు వ్యసనాలకి అధికంగా డబ్బు ఖర్చుకావడం మొదలెట్టింది. ఇంతలోకే కిశోర్ పుట్టాడు. భర్త అధోగతిపాలు కావడం చూడలేక మా అత్తయ్య

మంచానపడ్డది. ఒక సంవత్సరం నవిసి, చివరకి కాలధర్మం చెందింది. మరికొన్ని సంవత్సరాలపాటు తమ్ముడి ఆటలు ఆ విధంగానే కొనసాగ నిస్తే, తప్పక యిల్లు గుల్ల అవుతుందని మా అమ్మ గ్రహించింది. ఎంతోకాలంనుంచి మా ఉప్పు తింటున్న ఒక లాయర్‌ని పిలిపించి, అతని సలహా ప్రకారం, జాగీర్ వ్యవహారాలని చూడడానికి ఒక కొత్త మానేజర్‌ని నియమించింది. పాత మేనేజర్‌ని తొలగించింది. మా అమ్మ ఈ వ్యవహారం ఎంతో చాకచక్యంతో నడిపింది. పాత మేనేజర్‌ని తొలగించివేయడంతో, తమ్ముడికి డబ్బుతో గల సంబంధాలు తెగతెంపులైనాయి. ఉమామహేశ్వరరావుగారు స్వంతంగా తమ వ్యవహారాలు తాము చూసుకునే స్థితిలో లేరు. వారికి కావల్సింది డబ్బు. ఆ డబ్బు ప్రతి నెలా వారికి మా అమ్మ అందజేయడం మొదలెట్టింది. దానితో ఉమామహేశ్వరరావుగారి నోరు కట్టుబడిపోయింది. ఇంట్లో వున్న సొమ్ము మా అమ్మ బ్యాంకులో వేసింది. చేతిలో వున్న డబ్బుతో నగరంలో యిండ్లు కొనడం మొదలెట్టింది. తనవి కొన్నీ, తమ్ముడివి కొన్నీ పొలాలు అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో లాయర్ సలహా ననుసరించి, ఎన్నో కంపెనీలలో షేర్లుకొన్నది. ఆ విధంగా యిండ్లూ, షేర్లు కొనడంలో, వున్న ధనాన్ని అసాంతం వెచ్చించింది. ఇంతలోకే జాగీర్లు రద్దు అయినాయి. పల్లెర్ల జాగీర్‌మీద ప్రతి సంవత్సరం వచ్చేటంతటి ఆదాయం జాగీర్లు రద్దు అయ్యేనాటికే నగరంలోని యిండ్ల బాడుగుల మీద, షేర్ల లాభాలమీద రావడం మొదలెట్టింది. కాని మా అమ్మ ఉమామహేశ్వరరావుగారికి ఈ విషయం తెలియనిచ్చిందికాదు. జాగీర్లు రద్దు అవుతాయని తెలియగానే, వారు బెంబేలు పడిపొయ్యారు. అదే అదనుగా ఎంచి మా అమ్మ వారి స్వంత ఖర్చు తగ్గించివేసింది. ప్రస్తుతం వారికి యింటిఖర్చు పోను మా అమ్మ నెలకి అయిదువందల రూపాయిలు యిస్తున్నది. కాగా ఆ ఎదురుగా వున్న మేడ వారికి కొనియిచ్చింది.

ఆ అయిదువందల రూపాయలతో వారు తమ యిష్టమొచ్చినట్లు ఆ మేడలో వ్యవహరిస్తారు. ఎప్పుడైనా భోజనానికి యింటికి వస్తే కద్దు - లేకపోతే లేదు. మా అమ్మ వారానికి ఒకమాటు ఆయింటికి వెళ్ళి తమ్ముడిని చూసివస్తుంది. వారు వచ్చి మమ్మల్ని చూసేతప్ప, మేమెవ్వరమూ ఆ యింటికి వెళ్ళడానికి వీలులేదు. అప్పుడప్పుడు ఆ ఎదురు బంగళాలో ఎవరో స్త్రీ కనపడడం కద్దు - ఆమెని చూచినప్పుడల్లా నాకు ఒక కొత్త అత్తయ్య వచ్చిందని నేను అనుకుంటాను. నాకు కొత్త అమ్మ వచ్చిందని కుసుమ అనుకుంటుంది. జాగీర్లు రద్దు కావడంతో నూకూ, పర్లెర్లకూ గల సంబంధం తెగిపోయింది. ఆ వస్తున్న నష్టపరిహారంతో మా అమ్మ నగరంలో ప్రతి సంవత్సరం మరికొన్ని యిళ్ళు కొంటున్నది. ప్రస్తుతం మాకు నగరంలో దాదాపు పాతిక యిండ్లు ఉన్నాయి. ఆ యిండ్లపైన నెలకి అయిదువేలదాకా బాడుగ వస్తుంది. ఈ బాడుగల్ని వసూలు చేయడానికి కొందరు నౌకర్లున్నారు. వచ్చిన ఆదాయాన్నీ, జరుగుతున్న ఖర్చుల్ని వ్రాసుకోవడానికి రామచంద్రయ్య వున్నాడు. ఈ వ్యవహారాలన్నీ స్వంతంగా మా అమ్మ చూసుకుంటుంది. కుసుమ మా యింటికి సంబంధించిన పనులు చూసుకుంటుంది. మా ముగ్గురి చదువుల విషయంలో నేను శ్రద్ధ తీసుకుంటున్నాను. ఇదీ క్లుప్తంగా మా చరిత్ర - ఇంత గాథ చెప్పకపోతే మేము ఎవ్వరమో, ఒకరికి ఒకరం ఏమవుతామో, మా అనురాగాలు ఏమిటో, మా ప్రేమలు ఏమిటో, మామా బాధ్యతలు ఏమిటో మీకు అర్థంకావు. నిజం విచారిస్తే మీ రడిగిన ప్రశ్నకి రెండు ముక్కల్లో సమాధానం చెప్పవచ్చు. కాని 'అవును', 'కాదు' అని జవాబు చెప్పడం వల్ల లాభం ఏమీ వుండజాలదని గ్రహించి, మీరు మా స్థితిగతుల్ని తెలుసుకొని వుండడం ఏనాటికైనా మంచిదని తోచి, గత యిరువై సంవత్సరాల చరిత్ర మీ ముందు విప్పాను. మా స్వంత గొడవలతో

మిమ్మల్ని ఇంతసేపు విసిగించినందుకు మీరు నన్ను సంపూర్ణంగా క్షమిస్తారని నేను ఆశిస్తున్నాను" అని నళిని తన గాథని ముగించింది.

అయిదు రోజులక్రితం మధుకీ, ఆ కుటుంబానికీ ఏమీ సంబంధం లేదు. నళిని ఎవ్వరో, కుసుమ ఎవ్వరో అతనికి తెలియదు. ఏ సుముహూర్తాన మధు ఆ యింట్లో అడుగు పెట్టాడో, అతనిపట్ల ఎక్కడలేని విశ్వాసాన్ని కనపరిచి, నళిని తన వంశచరిత్రని ఆమూలాగ్రంగా వివరించింది.

ఏ విధంగా ఆలోచించినా, తను ఆ విశ్వాసానికి అర్హుడిని కానని తోచింది మధుకి. తన జీవితంలో ఒక జరగగూడని సంఘటన జరిగింది. ఆ సంఘటన తనని నిలువునా క్రుంగదీస్తున్నది. కాని తను ఆ సంఘటనని గూర్చి నళినితో ఏమీ చెప్పుకోలేకపోయాడు. ఆమె చూపిన విశ్వాసంలో నూరవవంతైనా తను నళినిపట్ల కనపరచలేకపోయాడు. నిజం విచారిస్తే, తన హృదయం చాలా సంకుచితమైంది. నళిని విశాల హృదయం ముందు తన సంకుచితత్వంతో మధు నిలువలేకపోయాడు. అతని అల్పత్వం అతని కళ్ళముందు నిలిచి, అతని పేదరికాన్ని పైకి ఎత్తిచూపింది. సిగ్గుతో అతని తల క్రిందికి వాలింది. ఉత్తరక్షణం వరకూ అతను తన హృదయ సంక్షోభంనించి తేరుకోలేకపోయాడు.

"మీ రిదంతా నా కెందుకు చెప్పినట్టు?" అని అడిగాడు మధు నళినిని, ఏమీ తోచక.

"ఊరికేనే" అని బొంకింది నళిని.

"నిజం చెప్పండి, ఎందుకు చెప్పారో?" అని మధు అదే ప్రశ్నని ఇంకొక విధంగా అడిగాడు.

"జీవితం సుఖమయంగా గడుపుకోవాలంటే, మన బాధల్ని మన హృదయంలో దాచిపెట్టుకో కూడదు - మన దుఃఖాన్ని యితరులతో పంచుకోవాలి - ఇతరులు సానుభూతి చూపితే, మన హృదయం తేలిక

పడుతుంది. ఎదుటివాళ్ళని విశ్వసిస్తేనే గాని మన బాధల్ని వాళ్ళతో చెప్పుకోవడం జరగదు - ఈ విషయాన్ని మీకు కరతలామలకం చేయ డానికే నేను మీకు మా వంశచరిత్ర సవివరంగా చెప్పాను. ఇంటింటికీ మంటి పొయ్యి వుంటుంది. దాన్ని గూర్చి బాధపడడం అనవసరం - ఎదుటివాళ్ళని విశ్వసించడం నేర్చుకోండి. దానివల్ల మీకు జీవితంలో కొందరు స్నేహితులు ఏర్పడుతారు. వాళ్ళు సమయం వచ్చినప్పుడు మీ సుఖదుఃఖాల్ని పంచుకుంటారు" అంటూ కారణంతోపాటు కొంత హితవును కూడా జతపరిచి సమాధానం చెప్పింది నళిని.

కుసుమ ఎప్పుడు బజారునించి తిరిగివచ్చిందో కాని, ఒక ట్రేలో టీ సామగ్రి, బిస్కట్లు పెట్టి కిశోర్ గదిలోకి తెచ్చింది. కుసుమని చూడడంతోనే మధు మొహం వికసించింది. ఆ సంగతి నళిని గమనిం చకపోలేదు.

"బజారునించి ఎప్పుడు తిరిగివచ్చావు ?" అని అడిగింది నళిని కుసుమని, ఏమీ తోచక —

"ఇంతకు ముందే"నని కుసుమ క్లుప్తంగా జవాబు చెప్పింది.

"వచ్చేరావడంతోనే, మాకు 'టీ' అవసరమనితోచి, టీట్రే పట్టు కొచ్చావా ?" అనినళిని కొంటెగా ప్రశ్నించింది. కుసుమ నళిని ప్రశ్నకి ఏమీ సమాధానం చెప్పక, ట్రే టేబిల్‌పైన పెట్టి, రెండు కప్పుల్లో టీ కలిపింది. బిస్కట్లూ టీ కప్పులూ నళినీ మధులముందుకు తోసింది.

"ట్రే తీసుకురావడానికి పనిమనిషులెవ్వరూ కనిపించలేదా ?" అని తిరిగి ప్రశ్నించింది నళిని. ఆ ప్రశ్నలోని అంతరార్థం మధుకి బోధ పడలేదు.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పక, కుసుమ నళినిని పులుకుపులుకునా చూసింది.

"మూడవకప్పు అక్కరలేదా?" అని నళిని, ట్రేలో రెండుకప్పులే వుండడం గమనించి, కోపాన్ని నటించింది.

"ప్రస్తుతం నాకు టీ అక్కరలేదు. అందుకోసం రెండు ఖాళీ కప్పులు మాత్రం తెచ్చా"నని చెప్పింది కుసుమ జవాబుగా.

"మేమెవ్వరమూ టీ తాగొద్దనుకొన్నావా?" అని అడిగింది నళిని, కుసుమని.

మధుకి, నళిని కోపకారణమేమిటో అర్థంకాలేదు. ఉభయుల సంభాషణవింటో, మధ్యలో ఏమీ కల్పించుకోకండా మౌనం వహించాడు.

వెంటనే కుసుమ యింట్లోకి వెళ్ళి ఇంకొక ఖాళీకప్పు తీసుకొచ్చింది. వదినకేసి చూడకండా ఖాళీకప్పులో టీ పోసి చక్కెరవేసి, పాలు కలిపింది, ఆ కప్పు తన ముందుకు లాక్కుంది. బిస్కట్లు ఎవ్వరూ ముట్టుకోలేదు. టీలు చప్పరిస్తో, మౌనంగా కూర్చున్నారు ముగ్గురూనూ.

" మీ ఉభయులకూ టీ తాగాలని లేకుండిందేమో? కాని నాకు మాత్రం. తీరా పుచ్చుకుంటున్నప్పుడు టీ అవసరమే ననిపించింది." అన్నాడు మధు ఏదో సంభాషణ కుపక్రమిస్తో.

"టీ ఎల్లావుం"దని అడిగింది నళిని కొంటెగా కళ్ళతో నవ్వుతో.

"దివ్యంగా వుం"దని మధు అన్నాడు కుసుమకేసిచూస్తో.

"కుసుమచెయ్యి పడితే, దివ్యంగా వుండకేమి చేస్తుంది?" అని తిప్పికొట్టింది నళిని.

మధు గతుక్కుమన్నాడు. కుసుమ చెక్కిళ్ళు ఎర్రబారాయి.

నళిని ధోరణి కుసుమకి ఏమాత్రం అర్థంకాలేదు. టీ తీసుకు రావడంలో తనేమైనా పొరపాటు చేసానా అని భయపడింది. నళినికేసి దీనంగా చూచింది.

"మీరు అంతలోకే ప్రసన్నులౌతారు - అంతలోకే బిగిసిపోతారు. మిమ్మల్ని అర్థం చేసుకోవడం ఎల్లాగో నాకు ఏమాత్రం తోచడంలేదు" అన్నాడు మధు తన ఓటమిని ఒప్పుకుంటో-

"మీరు అర్థం చేసుకోవాల్సింది నన్ను కాదని. ఇప్పటికైనా మీరు గుర్తించడం అవసరం" అని హెచ్చరిక చేసింది నళిని-

"మీ సహాయ సానుభూతులు వుంటేతప్ప, నే నెవ్వరినీ అర్థం చేసుకోలేమోనని నాభయం" అని తన చేతిలోని ముక్కలు క్రింద పడేశాడు మధు.

మధుపైన నళినికి సానుభూతి కలిగింది. కుసుమకిమల్లెనే, మధుకి సంభాషణలో నేర్పరితనంలేదు. కొంచం తిప్పికొడితే బెంబేలుపడి పోతాడు. ఎదుటివాళ్ళ ఉద్దేశాన్నే శంకిస్తాడు. కంగారుపడి తప్పుగా అర్థం చేసుకునే అవకాశం కూడా లేకపోలేదు. కుసుమ మధుల మనస్తత్వాల్ని ఒకదానిపక్కన ఇంకొకదాన్ని వుంచి, పోల్చి చూసింది నళిని - ఇద్దరికీ మౌనం ఒకభూషణం - అవసరమైతే తప్ప ఇద్దరూ మాట్లాడరు. గతచరిత్ర ఉభయులనీ పట్టి పీడుస్తున్నది. మధు ప్రతి విషయాన్నిగూర్చి గట్టిగా ఆలోచిస్తాడు. కుసుమ ఏ విషయాన్ని గూర్చి కూడా ఆలోచించి లాభంఉండదని ముందుగానే తేల్చుకుంటుంది. ఇద్దరూ పరిస్థితులకి ఎదురీదలేరు. ఉభయులూ పరిస్థితులకి అనుగుణంగా నడుచుకుంటారు. మధు తన ఆలోచనలతో ఏ పనీ చేయలేడు. కుసుమ ఆలోచించడంకూడా వృథాప్రయాస అని భావిస్తుంది. ఆ కాలాన్ని యితరులకి సేవ చెయ్యడంలో వినియోగిస్తుంది. ఉభయులూ ఎవ్వరికీ నొప్పించకండా కాలం గడపడానికి చూస్తారు. అవసరమైతే, తాము బాధపడుతారు కాని యితరులని బాధపెట్టరు. ఇవి భారతీయ తత్వానికి అనుగుణమైన మనస్తత్వాలు - కాగా కడు ప్రాచీనమైనవి - ఇటువంటి మనస్తత్వాలతో జాతి ముందుకు వెళ్ళలేదు. ఉన్నచోటునే వుండి

పోతుంది. విలువలు క్షణక్షణానికి మారిపోతున్న ఈ ఆధునికయుగంలో ఇట్టి మనస్తత్వాలికి విలువేమిటని తనని తాను ప్రశ్నించుకుంది నళిని. తన మనస్తత్వం, ఈ ప్రాచీన మనస్తత్వాలకి కడుభిన్నమైంది. తనకు సుఖం కావాలి. సంతోషంకావాలి. తన సుఖ సౌఖ్యాలకోసం ఎంతటి సాహసకృత్యానికైనా తను సంసిద్ధపడుతుంది. నీతి అవినీతుల పరిధుల్ని కూడా అవసరంవస్తే తను అవలీలగా దాటగలుగుతుంది. డబ్బుతో అవినీతిని నీతిగా మార్చివేయవచ్చునని తనకు తెలుసు. అందువల్ల నీతి అవినీతులంటే తనకు భయంలేదు. తన జీవితం, విప్లవాన్ని ఆకాంక్షి స్తుంది. తిరుగుబాటుని కోరుతుంది. మొనాటనీని సహించదు. గతానుగతి కాన్ని ద్వేషిస్తుంది. నిత్యనూతనత్వాన్ని అన్వేషిస్తుంది. సంఘర్షణని ప్రేమిస్తుంది. యువతని కామిస్తుంది. తను స్థాణువుగా పడివుండలేదు. తను జీవంతో తొణికిసలాడాలి ఇతరులని కవ్వించాలి. బెల్లించాలి. ఏడ్పించాలి. అప్పుడుగాని తనకి సంతోషం కలగదు. తృప్తివుండదు. హాయి అనిపించదు.

నళిని దగ్గరినించి ఏలాటి సమాధానం రాకపోవడంతో, తన అభ్యర్థన వృథా అయిందని తోచింది మధుకి. ఇంక ఏమీ లాభం వుండ దని తెలుసుకొని మౌనం వహించాడు.

గదిలో మౌనం గడ్డకట్టుకుపోయింది. దాన్ని పగలగొట్టడం, దుస్సాధ్యంగా తోచింది కుసుమకి - అందులో వదినె ముఖ్యంగా అను కూలంగాలేదు - తన కెందుకొచ్చిన గొడవ అని కుసుమకూడా మౌనం వహించింది.

నళినికి కూడా ఆ నిశ్శబ్దత దుర్భరంగా తోచింది. కుసుమ మధులు యిద్దరూ మౌనం వహించడంతో, తనే విధిలేక తిరిగి సంభా షణ ప్రారంభించింది.

"కిశోర్ ఏడీ?" అని కుసుమని అడిగింది నళిని.

"గుడ్డలమూట పట్టుకొని అత్తయ్య దగ్గరకి పరుగెత్తాడు" అని జవాబు చెప్పింది కుసుమ.

"ఈ పూటకి చదువూ చట్టుబండలు ఏమీలేనట్లేనా ?" అని దూకుడుగా ప్రశ్నించింది నళిని.

"వెళ్ళి పంపిస్తా"నని లేచింది కుసుమ.

"మాస్టర్‌గారు వచ్చి దాదాపు రెండుగంటలైంది. ఇంకా ఎంత సేపని కూర్చుంటారు?" అని కసిరింది నళిని -

ఆ వాక్యానికి కుసుమ నిశ్చేష్టురాలైంది - వెళుతున్నదల్లా అక్కడే నిలబడిపోయింది.

కిశోర్ ఈ అయిదురోజులనించీ ఏమీ చదువుకోవడం లేదని చెప్పడమా మానడమా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు మధు. చివరకి చెప్పకండా వుండడమే మంచిదని అతనికి తోచింది అప్పటి పరిస్థితుల్లో— "ఇంక నేను వెళ్ళొస్తానండీ" అని అతను లేచాడు. నళిని ఏమీ మాట్లాడలేదు. కుసుమ ఎదురుగావున్న గదులకేసి వెళ్ళింది వాటిలో ఒకదానిలో అదృశ్యమైంది. అదృశ్యమౌతూ తనకేసి ఒకమాటు కుసుమ చూడడం మధు లీలగా పరికించాడు. అతను మెట్లుదిగి సాలోచనగా ముందుకు సాగాడు. ఇంట్లోనించి వెలుపలికి వచ్చేసరికి అసంఖ్యాకంగా ఆలోచనలు మెదడులో ముసిరాయి. నళినికి సంబంధించిన ఆలోచనలు తప్ప తక్కినవన్నీ మధు ప్రయత్నపూర్వకంగా పారద్రోలాడు. నళిని అప్పటికప్పుడే ఆగ్రహిస్తుంది. అప్పటికప్పుడే శాంతిస్తుంది. అంతలోకే బిగుసుకుపోతుంది. అంతలోకే సడలిపోతుంది. క్షణంలోనే సానుభూతి చూపుతుంది. క్షణంలోనే కాఠిన్యాన్ని వహిస్తుంది. నిముషంలోనే ఉత్సాహోద్రేకాల్ని ప్రదర్శిస్తుంది. నిముషంలోనే నిరుత్సాహాన్ని ప్రకటిస్తుంది. తృటికాలంలో కరిగి నీరై వెల్లువగా ప్రవహిస్తుంది. తృటికాలంలో గడ్డకట్టి జడపదార్థంగా నిలిచిపోతుంది.

ఎందుకో నళినినిగూర్చి ఆలోచిస్తున్నకొద్దీ మిణుగురు పురుగు, పాద రసం మధుకి జ్ఞాపక మొచ్చాయి. నిజమే. నళిని మిణుగురుపురుగుకు మల్లే అంతలోనే జిగేలున మెరిసి అంతలోనే ఆరిపోతుంది. పాద రసానికిమల్లే చాంచల్యాన్ని ప్రదర్శిస్తుంది. ఉన్నచోట నిలువదు. నిలిచిన చోట వుండదు. చపలచిత్తంతో ముందుకీ, వెనక్కీ పరుగెడుతుంది. పరుగెత్తడమే తన జీవిత లక్ష్యమని భావిస్తుంది. ఇవన్నీ యౌవన ప్రాదుర్భావానికి చెందిన వికారచేష్టలు కావుగదా? ఏమో? అయితే కావచ్చు. కాని ఎన్నడో ఈ వికారచేష్టలు ఆమెని గోతిలో దించక మానవు. అప్పుడు ఆమె గర్వం బలంగా దెబ్బతింటుంది. దర్పం పటాపంచలవుతుంది. అవమానభరంతో భూగర్భంలోకి క్రుంగిపోతుంది. జీవంలేని కట్టెకుమల్లే అధఃపాతాళంలోకి జారుతుంది. ఆ దుష్టక్షణం నించి నళినిని కాపాడడం చాలా అవసరం. ఆ కార్యం ఒంటరిగా తాను సాధించగలడా? లేదు. దానికి ఎవరి సహాయమైనా తనకి కావాలి. తనకు జీవితంలో ఒక్క కుసుమతప్ప, ఇంకెవ్వరి సహాయం లభిస్తుందని? అప్పటికీ తను ఆ కార్యం సాధించగలడని ఏమి నమ్మకం? తను ఏ కార్యమూ సాధించలేడు. ఏపనీ చేయలేడు. అశక్తత, అసామర్థ్యం తనని వేనోళ్ళ వెక్కిరిస్తున్నట్లు తోచింది మధుకి. ఆ తలవంపులకి తట్టుకోలేక మధు వడివడిగా నడిచాడు. వెక్కిరింపులు గట్టిగా, ఇంకా గట్టిగా వినపడుతున్నాయి. అవి వినపడ్డాకొద్దీ మధు వడిగా, ఇంకా వడివడిగా నడిచాడు. వెళ్ళి అమాంతంగా పక్కమీద పడ్డాడు. ఏ వెక్కిరింపులూ వినపడకండా గట్టిగా రెండుచేతులతో రెండు చెవులూ మూసుకున్నాడు. బలవంతంగా రెండు కళ్ళూ మూసుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో ఏమో అతనికే తెలియదు.

★ ★ ★



కాలచక్రం తిరుగుతున్నది. నిమిషాల్ని గంటల్లోకీ, గంటల్ని రోజుల్లోకీ, రోజుల్ని మాసాల్లోకి తిప్పేస్తున్నది. మధు ఒక్క ఆది వారాలుతప్ప, ప్రతి రోజు ట్యూషన్‌కి వెడుతున్నాడు. కిశోర్ చదువు కున్ననాడు చదువుకుంటాడు. లేనినాడు లేదు. కాని తనుమాత్రం రోజూ ట్యూషన్‌కి వెళ్ళవల్సిందే. తను ఒక్కరోజుకూడా బద్ధకించడానికి వీలు లేదు. బద్ధకిస్తే, ఎవ్వరైనా తనని ఏమన్నా అంటారని కాదు. రాని రోజులకి జీతం తెగగోస్తారనికాదు ఎందుకో తనకే వెళ్ళకుండా వుండడ మంటే మనస్సు ఒప్పదు. రోజూ సాయంత్రం కాగానే, ఉమామహే శ్వరరావుగారి యింటికి వెడుదామని మనసు పీకుతుంది. తను ఒక రొటీన్‌కి అలవాటు పడ్డాడు. రోజూ ఉదయం కావడంతోనే యాంత్రి కంగా కాలకృత్యాలు తీర్చుకున్నట్లే, సాయంత్రం కాగానే అలవాటు ప్రకారం ఉమామహేశ్వరరావుగారి యింటికి వెడుతున్నాడు. ఆ రొటీన్‌ని తప్పించివేయడం తనకు శక్తికిమించినపని. కాగా అక్కడికి వెడితే, కుసుమ కనపడుతుంది. కొంతకాలం హాయిగా గడిచిపోతుంది. ఈ మధ్య కుసుమ ఏదో నెపంమీద రోజూ కిశోర్ గదికి వస్తున్నది. ఏవో గుడ్డలు సద్దుతుంది. ఏవో పుస్తకాలు షెల్ఫులో అమరుస్తుంది. ఏవో ఆట వస్తువులు క్రమపద్ధతిలో పెడుతుంది. ఒకవేపు తను కిశోర్‌కి చదువు చెబుతుంటే, ఇంకొకవేపు ఆమె గదిలో ఏదో పనిలో నిమగ్నమై వుంటుంది. ఆమె పనీ జరగదు. తన చదువు చెప్పడమూ కొనసాగదు. మధ్య మధ్య చూపులు కలుస్తాయి - తిరిగి విడిపోతాయి. ఏదో అవసర మొస్తే తప్ప మాట్లాడదు. తనే రోజూ పలకరించాల్సి వస్తున్నది. ఆ పలకరింపులకికూడా టూకీగా సమాధానం చెబుతుంది. తను మాటకారి కాడు ఆమెను మాటల్లోకి దింపి ఎక్కువకాలం సంభాషణలో బంధించి

వేయడానికి, తమ సంభాషణ పొడిమాటలతో ఆరంభమై పొడిమాటలతో అంతమొందుతుంది - ఏదైనా దీర్ఘచర్చ జరుపాలని మధు ఎప్పటికప్పు డనుకుంటాడు కాని విషయమేమీ దొరకక తికమక పడుతాడు.

"నళిని యింట్లో లేదా ?"

"లేదు"

"ఎక్కడికి వెళ్ళింది ?"

"ఏమో"

అంతటితో సంభాషణ ఆగిపోతుంది. తిరిగి సంభాషణ ఏవిధంగా ప్రారంభించాలో మధుకి తోచదు.

"నిన్న మీరు కనపడలేదు ?"

"ఇంట్లోలేను"

"ఎక్కడికి వెళ్ళారు ?"

"పనిమీద"

"ఏమిపని అని అడగవచ్చునా ?"

సమాధానం రాదు. సంభాషణ కుంటుపడుతుంది.

ఒక్కొక్క రోజున కుసుమ వచ్చేసరికి కిశోర్ గదిలో వుండడు. ఆ సంగతి గమనించి ఆమె వెంటనే ఒక్కమాటైనా మాట్లాడకండా వెనక్కి గిరుక్కున మళ్ళుతుంది. అప్పుడు తనే కుసుమని మాట్లాడించాల్సి వస్తుంది.

"కిశోర్ యింకా రాలేదు - ఇంట్లోలేడా ?"

"ఇంట్లో లేకే, ఇప్పుడే పంపిస్తాను"

కుసుమ వచ్చింది వచ్చినట్లుగానే గదిలోంచి వెళ్ళిపోతుంది.

కిశోర్ యింట్లో లేనిరోజున, కుసుమ కిశోర్ గదిలోకి రాదు. "కుర్రవాడు లే"డని ఏ పనిమనిషితోనో కబురు పంపిస్తుంది. కిశోర్ లేనిరోజున, మధుకి వచ్చిన వెంటనే వెళ్ళిపోవడానికి వీలుకలుగు

తున్నది. అతనికోసం గంటలతరబడి నిరీక్షించవలసిన అవసరం ఏమాత్రం లేకుండా పోతున్నది.

ప్రతిరోజూ కుసుమ ట్రేలో టీ తీసుకు వస్తుంది. కుర్రవాడులేని రోజున 'టీ' పనిమనిషితో పంపిస్తుంది. దీనివల్ల ప్రతి సాయంత్రం మధుకి రెండపసార్లు టీ త్రాగడం అలవాటైంది.

"చక్కెర ఎన్ని స్పూన్‌లు వెయ్యమంటారు ?"

"రెండు"

"బిస్కట్లు తీసుకోండి"

"..................."

"మీరేదో విచారంగా కనపడుతున్నారు కారణం ?"

"మీరా, నేనా ?

"ఉభయులమూను"

"కారణమేమిటో చెబుతారా ?"

"ఏమీలేదు"

"మరి మీరో ?"

"నేను విచారంగా ఉన్నానా ? లేదే ?"

ఇదీ సంభాషణ ధోరణి - ఈ పొడిమాటలతో ఎంతకాలమని సంభాషణ కొనసాగుతుందని ? సహజంగా వెంటనే ఆగిపోతుంది.

కిశోర్ గదిలో ఏవో చిన్నచిన్న మార్పులు జరుగుతున్నాయి. టేబుల్‌పైకి క్లాత్ వచ్చింది. డోర్‌కీ, కిటికీలకీ కర్టన్‌లు వచ్చాయి టేబుల్‌పైన ఒక ఫ్లవర్ వేజు. దానిలోకి రోజూ రకరకాల పువ్వులు వస్తున్నాయి. కుసుమ గదిలో ఈ చిన్నచిన్న మార్పులు ఎందుకు చేస్తున్నట్లు ? సాయంత్రాలు తనే స్వయంగా టీ ఎందుకు తెస్తున్నట్లు ? ఏదో నెపంమీద కుసుమ పదేపదే గదిలోకి రావడం ఎందుకు ? వచ్చినా, తనపని చూసుకొని వెంటనే వెళ్ళిపోక గదిలో తారట్లాడడమెందుకు ?

గదిలో అనవసరంగా కాలయాపన చేయడమెందుకు? ఈ చిన్నిచిన్ని కటాక్షాలూ, ఈ వికారచేష్టలు కుసుమ తనని గాఢంగా ప్రేమిస్తున్నదని చెప్పడానికి నిదర్శనాలు కావా? నిజం విచారిస్తే తను ఇంతదూరం ఆలోచించవలసిన అవసరమే లేదేమో? కుసుమ తనని ప్రేమిస్తున్నదని ఆమె చూపులే చెప్పక చెబుతున్నాయి. నిమిషనిమిషానికీ ఆ సంగతి ఆ చూపులే పట్టిస్తున్నాయి దొంగచాటుగా కుసుమ తనని చూడడం తన చూపులు కలవడంతోనే తత్తరపాటు చెందడం ఆ తత్తరపాటులో చెక్కిళ్ళు ఎర్రబారడం ఇవన్నీ ప్రేమకి సంబంధించిన వికారచేష్టలు కావా? ఎప్పటికప్పుడు ఈ వికారచేష్టలుకూడా కుసుమ తనని ప్రేమిస్తున్న దన్నసంగతిని పట్టిస్తూనేవున్నాయి. ఆ చిన్నిచిన్ని కటాక్షాలు ఆమె ప్రేమని క్షణక్షణానికి ధృవపరుస్తూనే వున్నాయి. కుసుమ తనతో ఎక్కువగా మాట్లాడకపోవచ్చు. ఆ మాట్లాడకపోవడంకూడా దీర్ఘంగా ఆలోచిస్తే ప్రేమకి ఒక చిహ్నమే. లజ్జాభరంతో నోటమాట పెకలకపోవచ్చు. కాగా "నేను నిన్ను ప్రేమిస్తున్నా"నని భారతదేశంలో ఏ స్త్రీ ఏ పురుషుడితో చెబుతుందని? నిజంగా చెప్పవలసి వచ్చినప్పుడు, అక్కడి నించి తుర్రున పారిపోతుంది. ఆ పారిపోవడాన్నిబట్టే ఆమె ప్రేమిస్తున్న దని మనం వూహించుకోవాలి. అంతకివస్తే పురుషుడుమాత్రం "నేను నిన్ను ప్రేమిస్తున్నా"నని చెబుతాడా? ఒక్క సినిమాల్లోతప్ప, ప్రేయసీ ప్రియులు, ప్రేమనిగూర్చి ఎన్నడూ మాట్లాడుకోవడం జరగదు. చూపుల ద్వారా, ఏవో వికారచేష్టలద్వారా తమ ప్రేమని వ్యక్తపరుస్తారు. ఆ చూపుల్ని, ఆ చేష్టల్ని ఎదుటి హృదయం అర్థం చేసుకుంటుంది. మాటల కతీతమైన ఏ భాషలోనో, ఆ ఎదుటిహృదయం మారుపలుకుతుంది. అంతే. దానితో ఒకరిపైన ఇంకొకరికి విశ్వాసం కుదురుతుంది. పూజ్య భావం కలుగుతుంది. ఏనాటికానాడు ఒకరిని ఇంకొకరు గమనిస్తూ తమని తాము ఒండొరుల కనుకూలంగా మలచుకుంటారు. ఈ మలచుకోవడంలో

కొత్తజన్మలను ఎత్తుతారు. పూర్వపు అభిరుచులూ ఆశయాలూ ఆదర్శాలూ క్రమంగా మార్పుజెందుతాయి. ఏకీభావం సిద్ధించేవరకూ ఈ క్రమ పరిణామం కొనసాగుతూనే వుంటుంది. ఈ ఏకీభావం సిద్ధించడంతోనే యిరువురు విభిన్నవ్యక్తులు, ఏకైక ఆశయంతో ఏకైక ఆదర్శంతో, ఒకే వ్యక్తిగా విలసిల్లుతారు. ఇదే ప్రేయసీప్రియులకి పునర్జన్మ. మధు యువత ఈ ధోరణిలో అప్పుడప్పుడు గంటలతరబడి ఊహాగానం చేయడం కద్దు. కుసుమ తనని ప్రేమిస్తున్నదీ, లేనిదీ అతను తేల్చుకోలేకపోయేవాడు. ప్రేమిస్తున్నట్లు ఎన్ని నిదర్శనాలు కనపడ్డప్పటికీ, ఎప్పటికప్పుడు ఏదో శంక మధు హృదయాన్ని పట్టి బాధించేది. ఈ విషయంలో అటో, ఇటో తేల్చుకుందామని మనస్సు ఉర్రూతలూగేది. కాని మధు సాహసించి ఏదీ తేల్చుకోలేకపోయేవాడు. తేల్చుకోవడానికి ఎట్లా ఉపక్రమించాలో కూడా అతనికి తోచేదికాదు. ఇదమిత్థమని తేలక ఆ అనిర్ణీతస్థితిలోనే కాలం గడిచిపోతున్నది మధుకి.

ఒకనాటి సాయంత్రం మధు కిశోర్‌కి చదువు చెబుతుండగా, నళిని అమాంతంగా ప్రత్యక్షమైంది: వచ్చినవెంటనే "మాస్టర్‌గారూ, సినిమాకి వెడదాం లెండి" అని అంది. ఒక ఆడపిల్ల తనని సినిమాకి రమ్మనడం మధుకి వింతగా తోచింది. ఏమి సమాధానం చెప్పాలో అతనికి బొత్తిగా తోచలేదు. పాఠంమధ్యలో వున్నాడు. అకాస్త పూర్తి చేతామని తిరిగి కిశోర్‌కి చదువుచెప్పడం ఆరంభించాడు. నళిని ఆ విషయం గ్రహించినట్లు వుంది. "మిగతాపాఠం రేపు చెప్పవచ్చులెండి. ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే బయల్దేరండి" అని నళిని తొందరపెట్టింది. వస్తున్నానని కానీ, రావడంలేదనికాని మధు జవాబు చెప్పలేదు. గత్యంతరం లేక పాఠం చెప్పడంమాత్రం ఆపివేశాడు. సినిమాకి ఎవరెవరు వెడుతున్నారో తెలియదు. తనని ఒంటరిగా తనతో సినిమాకి తీసికెళ్ళదుగద? ఏమో? కిశోర్ ఏమీ మాట్లాడకండా

కూర్చుంటాడేం ? తనూ సినిమాకి వస్తానని ఎందుకు అనడు ? వదిన అంటే భయమేమో ? అయితే కావచ్చు. అందుకోసమే మెదలకండా కూర్చున్నాడు. కాకపోతే డిసిప్లిన్ కావచ్చు. కలిగినవాళ్ళు తమ పిల్లల్ని అలా అదుపుఆజ్ఞల్లో పెడతారు. లేనివాళ్ళు పిల్లల ఖర్మానికి పిల్లల్ని వదిలి వేస్తారు. అందువల్లనే మధ్యతరగతి కుటుంబాల్లో పిల్లలు విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. వాళ్ళకి కట్టుబాట్లంటూ వుండవు. ఈ తరగతికి చెందిన పిల్లలు పెరిగి పెద్దవాళ్ళై, అయితే గొప్ప మేధావులూ విప్లవకారులూ సంఘ సంస్కర్తలూ రచయితలూ అవుతారు. లేకపోతే ఎందుకు పనికి రాకండా పోతారు. కాని కలిగిన కుటుంబాలకి చెందిన పిల్లలు క్రమశిక్షణతో పెరిగి, సాంఘికంగా తండ్రితాతల అంతస్తుని అందుకుంటారు. సహజంగా ఆ అంతస్తునుంచి దిగజారిపోవడమంటూ వుండదు.

"టైం అయిపోతూవుంటే, ఏమిటా ఆలోచన - ఇంక లేస్తారా, లేదా ?" అని నళిని విసుక్కుంది. వెంటనే మధు తన ఆలోచనల్లోంచి తేరుకున్నాడు. నళినితో మెలగడం అతనికి యిబ్బందిగా వుంది. రానని చెబితే ఏమి పుట్టిముణుగుతుందో ? కాగా కుసుమ తమతో సినిమాకి వస్తున్నదో, లేదో ? ఆమె రావడమే సంభవిస్తే కుసుమతో కలిసి సినిమాకు వెళ్ళే ఒక సదవకాశాన్ని చేతులారా జారవిడుచుకోవడం జరుగుతుంది. అందువల్ల మధు "రానని" నళినితో నిక్కచ్చిగా చెప్పలేక పోయాడు. అనాలోచితంగా కుర్చీలోంచి లేచాడు. నళినిని అనుసరించాడు. ఉభయులూ మేడమెట్లు దిగి క్రిందికి వచ్చారు. కార్ దగ్గరికి వెళ్ళారు. కుసుమ కార్ దగ్గర నళినికోసం ఎదిరిచూస్తూవుంది. మధుకి కుసుమని చూడడంతోనే మనస్సు కుదుటబడింది. క్షణంక్రితం అతనిని ఆవరించిన సంశయాలన్నీ అమాంతంగా తొలగిపోయినాయి.

నళినీ కుసుమలు కార్‌లో వెనకాల కూర్చున్నారు. మధు డ్రైవర్ పక్కన ముందుసీటులో కూర్చున్నాడు. కార్ కదిలింది. సికింద్రాబాద్

దారి పట్టింది. డ్రైవర్‌కి ఎదురుగావున్న గుండ్రని అద్దంలో మధుకి నళినీ కుసుమలు కనపడుతున్నారు. నళిని గులాబీరంగుచీర కట్టింది. అదేరంగు జాకెటు వేసుకుంది. కొప్పులో ఒకేఒక గులాబీపువ్వు. చేతిలో కుంకుమరంగు మఖమల్ వ్యానిటీబ్యాగ్. కుసుమ తెల్లటి హాండ్ లూమ్ చీర కట్టుకుంది. తెల్లటి పట్టుజాకెటు వేసుకుంది. తలలో అరవిచ్చిన మల్లెమొగ్గలదండ అర్ధచంద్రాకారంలో కొప్పుచుట్టూ అమర్చు కుంది. కుడిచేతిలో తెల్లటి చేతిరుమాలు. ఆ ఉభయులూ ధరించిన దుస్తుల్ని బట్టి వారివారి మనఃప్రవృత్తులు ద్యోతకమవుతున్నాయి. రోజారంగు ప్రణయానికీ, మోహానికీ చిహ్నం. తెలుపు స్వచ్ఛతకీ ప్రశాంతతకీ చిహ్నం. రోజాపుష్పం అందంగా కన్నులపండుగగా వుంటుంది. మల్లికా కుసుమం నిర్మలంగావుండి ఆత్మకింపైన సువాసనల్ని వెదజల్లు తుంది. కొందరికి గులాబీ యిష్టం. మరికొందరికి మల్లిక అభిమాన పుష్పం. వారివారి అభిరుచుల్నిబట్టి భేదాలేర్పడుతాయి. ఎందుకో మధు హృదయంమాత్రం మల్లికాకుసుమంవైపుకే మొగ్గింది.

కార్ సికింద్రాబాద్‌లోని ప్యారడైసు టాకీస్‌దగ్గర ఆగింది. కార్ ఆగడంతోనే నళినీ కుసుమలకోసం నిరీక్షిస్తున్న సలీం వెళ్ళి టికట్లు కొనుక్కొచ్చాడు. నలుగురూ హాలువేపు నడిచారు. నళినీ సలీంలు ఏవో కబుర్లు చెప్పుకుంటూ మేడమెట్లు ఎక్కుతున్నారు. మధు వాళ్ళని అనుస రించాడు. కుసుమ మధుని అనుసరించింది. పైకివెళ్ళి టికెట్లు యిచ్చి నళినీ సలీంలు మధు కుసుమలకోసం ఎదిరిచూస్తున్నారు. వాళ్ళు కలుసు కోవడంతోనే నలుగురూ హాలులోకి నడిచారు. నళిని కుసుమతో ఏదో మాట్లాడింది. కుసుమ ఏమీ జవాబు చెప్పలేదు. అప్పటికే వార్తాచిత్రం ప్రారంభమైంది. లోపల చీకటి. ఎవరో బ్యాట్రీలైటుతో దారి చూపిస్తు న్నాడు. నళినీ సలీంలు ఒక బాక్సులోకి వెళ్ళారు. మధూ కుసుమలు మిగిలిపోయారు. ఆ ఉభయులకీ బ్యాట్రీలైటుమనిషి ఇంకొక బాక్సు

చూపించాడు. విధిలేక మధు బాక్సులోకి నడిచాడు. కుసుమ అతన్ని అనుసరించింది. మధు ఎన్నడూ బాక్సులోకి వెళ్ళలేదు. సలీం చేసిన ఏర్పాటు మధుకి వింతగా తోచింది. బ్యాట్రీలైటుమనిషి బాక్సు కర్టన్ వేసి వెళ్ళిపోయాడు. బాక్సులో మధూ కుసుమలు మిగిలిపోయారు. మధు కళ్ళు ఇంకా చీకటికి అలవాటు పడలేదు. అతను కాసేపుఆగి బాక్సు కలయచూచాడు. బాక్సులో రెండు సోఫాలున్నాయి. ఇద్దరు మనుషులకి రెండుసోఫాలు ఎందుకో అతనికి అర్థంకాలేదు. నెమ్మదిగా నడిచి ముందుసోఫాలో ఒక పక్కకి ఒదిగి కూర్చున్నాడు. కుసుమకూడా వెళ్ళి అదే సోఫాలో కూర్చున్నది. మధుగుండె దడదడ కొట్టుకోవడం మొదలెట్టింది. వార్తాచిత్రానికి సంబంధించిన హిందీ వ్యాఖ్యానం వినపడ్డానికి వినపడుతున్నది గాని ఏమీ అర్థంకావడంలేదు. మధుకి క్షుణ్ణంగా ఉర్దూ వచ్చు. మాతృభాష తెలుగులో బోలెడు సంస్కృత పదాలు ఉన్నాయి. ఉర్దూ తెలుగూ వచ్చిన వాళ్ళకి ఎంత కఠినమైన హిందీ అయినా సులభంగా అర్థం అవుతుంది. ఎందుకో ఆ క్షణంలో ఆ భాషే అర్థంకాకండా పోతున్నది. కాగా వార్తాచిత్రంకూడా సరిగ్గా అర్థంకావడం లేదు మధుకి. మెదడు పనిచేయడం మానుకోలేదుగద ? ఎందుకో తల బరువుగా వుంది. కణతలు కొట్టుకుంటున్నాయి, నోరు ఎండిపోతున్నది. మధు నాలుగు వేపులా కలయజూచాడు. ఎక్కడా జనం కనపడలేదు. హాలులో ఎవ్వరూ జనం లేరా ? ఈసారి లేచి కాసేపు నిలబడి పరికించాడు. హాలులో అసంఖ్యాకంగా తలలు కనపడ్డాయి. బాక్సు అంత ఎత్తుగా వుండడానికి కారణం ? హాలులోని జనం ఎవ్వరూ కనపడకండా వుండడానికా ? అంతే అయివుంటుంది. అప్పుడు తను ఎవ్వరికంటబడకండా బాక్సులో కుసుమతో ఏకాంతంగా వున్నాననుకున్నాడు మధు. ఆ ఏర్పాటు ఎంతో నచ్చింది మధుకి. వెంటనే సోఫాలో కూర్చున్నాడు. కుసుమ ఏదో

మాట్లాడుతున్నది. ఆ మాటలు వినపడక మధు కొంచెం కుసుమకి దగ్గరగా జరిగాడు. ఆ సంగతి ఆమె అంతగా పట్టించుకోలేదు.

"ఎందుకు లేచారు ?"

"దాహం వేస్తున్నది. లేచి మనిషికోసం చూచాను"

"వెళ్ళి గేటుదగ్గర మనిషితో చెప్పండి ఏవైనా డ్రింక్సు పంపించమని"

మధు డ్రింక్సుకోసం చెప్పి వచ్చాడు. చెప్పివచ్చిన అయిదు నిమిషాల్లో పింటోలు వచ్చాయి. వార్తాచిత్రం అయిపోయింది. ఏవో అడ్వర్టైజుమెంట్లకు సంబంధించిన రీళ్ళు చూపిస్తున్నారు. "పక్క బాక్సులోకి డ్రింక్సు పంపించమంటారా?" అని అడిగాడు మధు కుసుమని.

"ఈ మహద్భాగ్యానికి వాళ్ళనికూడా డిస్టర్బ్ చేయడం దేనికి?" అని ఎదురుప్రశ్న వేసింది కుసుమ.

మధు కుసుమ ఇంగితాన్ని గ్రహించాడు. ఇద్దరూ డ్రింక్సు పుచ్చుకున్నారు.

డబ్బులివ్వడానికి డ్రింక్స్ తెచ్చిన మనిషికోసం చూస్తే వాడు కనపడలేదు. గ్లాసులు అక్కడే వదిలివెళ్ళాడు. తిరిగి ఎప్పుడో ఇంటర్వెల్‌లో వాటికోసం వస్తాడు కాబోలు.

పిక్చర్ "నౌరంగ్"-టైటిల్సుచూపిస్తున్నారు-రాజకమల్ సమర్పణ. దర్శకుడు శాంతారాం - మిగిలిన టైటిల్సు మధుని అంతగా ఆకర్షించ లేదు. అవి చూపెడుతున్నప్పుడు అతను కుసుమకేసి చూచాడు. కుసుమ స్క్రీన్‌కేసి చూస్తున్నది.

పింటో పుచ్చుకున్న తరువాత మధు హృదయం కాస్త తేలిక పడింది. కాని కుసుమకేసి చూస్తుంటే ఎందుకో పిచ్చెక్కుతున్నది.

శాంతారాం, తను ఆ పిక్చర్ తయారు చేయడానికిగల కారణాల్ని వివరిస్తున్నాడు. తనకు తాత్కాలికంగా దృష్టిలోపం కలిగిందట. చీకటి

తెరమాటున తన మెదడు చురుకుగా పనిచేసించట. అప్పట్లో తనకు ఎన్నో భావాలు వచ్చాయట, ప్రపంచానికి దూరమై చిక్కని తమస్సులో కన్నులు తెరచి, వచ్చిన భావాలకి రంగులు వేసుకున్నాడట. స్విట్జర్ లాండ్‌లో కళ్ళకి ఆపరేషన్ చేయించాడట. లోపించిన దృష్టి తిరిగి వచ్చిందట. వెంటనే "నౌరంగ్" చిత్రం తీయడానికి పూనుకున్నాడట. అంధత్వంలో జాగరితమైన భావాలకి, "నౌరంగ్" చిత్రం, టెక్నికలర్‌లో ఒక రూపక కల్పన అని చెబుతున్నాడు శాంతారాం.

శాంతారాం తొలిపలుకు నచ్చింది - కాని పిక్చర్ మాత్రం స్ట్రీటు సీనుతో డల్‌గా ప్రారంభమైంది. పిక్చర్‌లో ఆసక్తి తగ్గింది మధుకి - ఏదో బలవత్తరమైనశక్తి మధుని తిన్నగా పిక్చర్ చూడనివ్వడంలేదు. మధు తన దృష్టి కుసుమపైన ప్రసరించాడు. చీకటికి అలవాటుపడ్డ అతని కళ్ళు కుసుమని విస్పష్టంగా చూడగలుగుతున్నాయి. ఎందుకో కుసుమ చెక్కిళ్ళపైన దృష్టి నిలిచిపోయింది. ఆ మసకచీకటిలో చెక్కిళ్ళు నున్నగా మృదువుగా కనపడుతున్నాయి. ఏదో ఉద్రేకం తనని ముంచెత్తు తున్నది. ఆ చెక్కిళ్ళని ఒకమాటు తాకగలిగితే? హాయిగా స్పర్శ సుఖాన్ని అనుభవించవచ్చు. చేతితో తాకితే తృప్తికలుగుతుందా? తనివితీరుతుందా? ఎందుకో పెదవులతో తాకాలనిపించింది మధుకి. కుసుమ ఏమంటుందో? అమాంతంగా బాక్సులోంచి వెళ్ళిపోతే? నళినీ, నళీంలముందు తనకు తలవంపులుగావుంటుంది. తనంటే యిష్టంలేకపోతే కుసుమ తనతోకలిసి బాక్సులో ఎందుకు కూర్చుంటుంది? తను సోఫాలో ఒక ఒకప్రక్కకు కూర్చుంటే తనకి దగ్గరగా, కొంచెం ఎడంతో కుసుమ నాల్లోకి ఎందుకు కూర్చున్నది? తన ప్రక్కనే తనని తాకుతూ ఎందుకు కు లేదు? అప్పుడు తన సంశయాలూ, సందేహాలూ అన్నీ తనసింది. పోయేవి. తనుకూడా ఇంకా దగ్గరగా జరిగేవాడు. పోనీ ఇప్పు మధూ కొంచం దగ్గరిగా జరిగిచూస్తే? కావాలని జరిగినట్లు కాక ఏదో పిక్చ

చూస్తూ జరిగినట్లు వుండాలి. అప్పుడు కుసుమకి యిష్టంలేకపోతే తనకి దూరంగా జరుగుతుంది. అప్పుడు అటో, ఇటో తేలిపోతుంది. కుసుమ తనని ప్రేమిస్తున్నదా, లేదా అని తెలుసుకోడానికి తనకి ప్రస్తుతం ఒక మంచి అవకాశం దొరికింది. తర్జనభర్జనలతో అనవసరంగా కాలయాపన చేయక అటో, ఇటో తేల్చుకోవాల్సిన తరుణం ఆసన్నమైంది. మళ్ళీ ఇటువంటి సదవకాశం లభించదు. ఈ తరుణాన్ని జారవిడుచుకోవడం భావ్యంకాదు. కుసుమకి దగ్గరగా జరిగే ఉద్దేశంతో తిరిగి పిక్చర్ చూడడం ఆరంభించాడు మధు. పిక్చర్ మీద మనస్సు నిలవడంలేదు, కథ ఏమాత్రం అర్థంకావడంలేదు. పిక్చర్ రంగుల్లో కొట్టుకుపోతున్నది హృదయం. 'సంధ్య' స్థానే వెండితెరమీద కుసుమని నిలుపుతున్నాడు మధు. 'నౌరంగ్' స్థానాన్ని తను తీసుకుంటున్నాడు. 'నౌరంగ్' భార్యగా 'సంధ్య' ఎంత గాంభీర్యాన్ని ప్రదర్శిస్తున్నదో తనపక్కనవున్న కుసుమ కూడా అంత గాంభీర్యాన్ని వ్యక్తపరుస్తున్నది. గడ్డకట్టుకుపోయిన ఆ గాంభీర్యాన్ని ద్రవింపజేయడానికి వెండితెరమీద తను నిలుపుకున్న కుసుమకి సృష్టిలోని సప్తవర్ణాల్ని పులుముతున్నాడు మధు. ఆ పులుముడులో తన పక్కనున్న కుసుమకి కొంచం దగ్గరగా జరిగాడు. వెండితెరమీద నిలిపిన కుసుమలో గాని, పక్కనున్న కుసుమలో గాని ఏలాటి చలనం కలగలేదు. కణతలు వేగంగా కొట్టుకుంటున్నాయి. శరీరం సలసల కాగిపోతున్నది. తల దిమ్మెక్కుతున్నది. కొద్దిగా [illegible]రికి జరిగాడు కుసుమకి—ఇంకా...ఇంకా...శరీరాలు తాకుతున్నాయి [illegible] భగ్గుమన్నది మధుకి. ఇంక ఉండబట్టలేకపోయాడు మధు. వెంటనే రెండు బాహువుల్లో కుసుమ శరీరాన్ని గట్టిగా బంధించాడు. ఆమె [illegible]పైకి కొద్దిగా వాలి, తన పెదవులని ఆమె పెదవులపైవుంచి గట్టిగా [illegible]డు. ఆ ఉద్రేకంలో ఉభయులకీ వూపిరి సలపలేదు. మధు తన [illegible]లిని కొద్దిగా సడలించాడు. పెదవులు కొద్దిగా విడిపోయాయి. త్రుటి

కాలం తరువాత మళ్ళీ కలుసుకున్నాయి. ఈసారి మధు కుడిచెయ్యి కుసుమ వక్షోజాలపైకి జారింది. ఉభయులూ వళ్ళుతెలియని ధూకుడులో విలీనమైనారు.

"ఎవరైనా చూస్తారు, ఇంక వదలండి" అంది కుసుమ ఆయాసంగా వూపిరి పీలుస్తో.

తిరిగి ఇంకొకసారి కుసుమ మొహాన్ని ముద్దులతోనింపి ఆమెని వదిలాడు మధు.

ఇద్దరూ వెనక్కి జేర్లగిలబడ్డారు ఎగదమ్ముతో—

ఇంటర్వల్ అయి, లైట్లు వచ్చేదాకా ఈ లోకంలో లేరు ఉభయులూనూ—

డ్రింక్సుకుర్రాడు గ్లాసులూ, డబ్బులూ తీసుకెళ్ళాడు.

ఇంటర్వెల్‌లో మధు కుసుమలు హాలుని ఆనుకొనివున్న బాల్కనీలోకి వెళ్ళారు. అక్కడ నళినీ సలీంలు పచార్లుచేస్తూ కనబడ్డారు.

"పిక్చర్ ఎల్లావుంది?" అని అడిగింది నళిని మధుని చూడడంతోనే—

"అద్భుతంగా వుం"దని జవాబు చెప్పాడు మధు ఆలోచనా రహితంగా—

ఆ జవాబుకి నళిని సాలోచనగా మధు మొహంలోకి చూచింది. కాగా సన్నగా చిరునవ్వింది. ఆ నవ్వులోని అంతరార్థాన్ని కుసుమ గ్రహించింది. వెంటనే సిగ్గుతో తలవాల్చింది.

ఇంటర్వల్ అయిపోయింది. నలుగురూ తమ తమ స్థానాల్లోకి వెళ్ళి కూర్చున్నారు.

ఏవో అడ్వర్టైజుమెంట్ల తరువాత పిక్చర్ ప్రారంభమైంది.

మిగతా సగం పిక్చర్ దాని మానానికి అది ఆడింది. మధూ కుసుమలు తమ ప్రణయలీలల్లో తాము నిమగ్నమైపోయారు.

"నళినికి అసలీ భావం ఎలావచ్చింది ?" అని అడిగాడు మధు కుసుమని.

"ఏ భావం ?" అని ప్రశ్నించింది కుసుమ.

"అదే మనమంతా కలిసి సినిమాకి వెడదామని" అని తన ఉద్దేశాన్ని వివరించాడు మధు.

"వదినె సినిమాకి వెడుదామని ఎంతోకాలంనుంచి అంటున్నది. కాని నేనే చాలాకాలం వరకు ఒప్పుకోలేదు" అని చెప్పింది కుసుమ.

"కారణం ?" అని అడిగాడు మధు ఆతురతగా.

"ఏమీలేదు - నాకే ధైర్యం చాలలేదు" అంది కుసుమ క్లుప్తంగా.

"మరి ఈ రోజు ఎల్లా ఒప్పుకున్నావు ?" అని ప్రశ్నించాడు మధు కుసుమని.

"ఈరోజు వదినె మరీ బలవంత పెట్టింది. ఆమెమాట కాదనలేక సరే నన్నాను" అని చెప్పింది కుసుమ.

"నళినికి తెలుసునన్నమాట మన సంగతి" అని అన్నాడు మధు.

"ఆమె ప్రోత్సాహం లేకపోతే, ఇంతదూరం వచ్చేదేకాదు మన సంగతి" అని విశదీకరించింది కుసుమ.

"నువ్వు మనసంగతి ఆమెతో ఎప్పుడైనా చెప్పావా ?" అని అడిగాడు మధు.

"నేనేమీ చెప్పలేదు. మొదట ఆమెనే ఊహించింది. తరువాత మన ప్రవర్తన ఆ విషయం పట్టించింది" అని వివరించింది కుసుమ.

"మన సంగతి మీ యింట్లో ఇంకెవరికైనా తెలిసిందా ?" అని అడిగాడు మధు. తన చెవులనే తాను నమ్మలేక.

"దాదాపు అందరికీ తెలుసు" నని చెప్పింది కుసుమ.

"చివరకి మీ అత్తయ్యకికూడా" అని అడిగాడు మధు ఆతురతగా.

"ఆఁ" అని క్లుప్తంగా జవాబు చెప్పింది కుసుమ.

"మీ అత్తయ్య ఏమీ అనలేదా ?" అని అడిగాడు తిరిగి మధుసూదనరావు.

"వదిన అంగీకారముంటే అత్తయ్య ఏమీ అనదు. ఆమెకి వదినగారి మాటపైన ఎంతో గురి" అని వివరించింది కుసుమ.

"మీ యింట్లో నళినీ సలీంల ఉదంతం కూడా తెలుసునా ?" అని ప్రశ్నించాడు మధు.

"ఆఁ అన్నీ తెలుసు - కాని ఎవ్వరూ ఏమీ మాట్లాడరు" అంది కుసుమ.

"ఎందువల్ల ?" అని అడిగాడు మధు కారణం తెలుసుకోవాలన్న కుతూహలంకొద్దీ.

"ఈ మధ్య మా అత్తయ్యకి గుండెజబ్బు వచ్చింది. అందువల్ల ఆమె ఏ విషయంలోనూ కల్పించుకోవడం లేదు. అన్ని విషయాలూ వదినకి వదలివేసింది. ఇండ్ల బాడుగలూ, షేర్ల లాభాలు మొదలైన విషయాలన్నీ ప్రస్తుతం వదినే చూసుకుంటున్నది" అని చెప్పింది కుసుమ సంగతిసందర్భాలు టూకీగా వివరిస్తో!

ఏవో మాటలవల్ల ప్రణయానికి అంతరాయం కలిగింది. వెంటనే మధు ఆ సంగతి గ్రహించి కుసుమ కుడిచేతిని తన ఎడమచేతితో వాళ్ళోకి తీసుకున్నాడు. ఆ చేతిని మృదువుగా తాకుతూ తన కుడిచేతి వేళ్ళని ఆమె కుడిచేతి వేళ్ళలోకి పోనిచ్చాడు. కుసుమ కుడిచెయ్యి నొక్కిపట్టి తన చెయ్యి వెనక్కి నెమ్మదిగా లాగాడు. కుసుమ అమాంతంగా తన వక్షస్థలంపైన వెల్లికిలాపడింది. కుసుమ కొప్పు ఎడమ భుజంపైన ఆనింది. కొప్పులోని మల్లికా గుచ్ఛం కొద్దిగా నలిగి నలుగడలా కమ్మని సువాసల్ని వెదజల్లింది. పుష్పసౌరభాలు మధు నాసికా పుటల్లోకి చొచ్చుకొని వెళ్ళాయి. ఆ సౌరభాలకి తట్టుకోలేక కుడిచెయ్యి కొద్దిగా సడలించాడు. కుసుమ తల చప్పున మధు ఎడమ మోచేతిలోకి జారింది - మోచెయ్యి పైకి ఎత్తి ఆమె పెదవులని తన పెదవుల దగ్గరికి

్రకున్నాడు. తన పెదవుల్ని ఆమె పెదవులపైన వుంచి గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. ఇంకా మధు కుడిచెయ్యి కుసుమ కుడిచేతిలోనే వుంది.

"నా చెయ్యి మీ చేతులోకి తీసుకున్నారు - దాని అర్థం ఏమిటో మీరు గ్రహించారా ?" అని అడిగింది కుసుమ, మధు పెదవులు తన పెదవులకి కొద్దిగా దూరం కావడంతోనే.

"లేదే" అన్నాడు మధు అమాయికంగా.

"నా పాణిగ్రహణం చేసారు - ఇంక ఎన్నడూ ఆ చేతిని వదల నని ప్రమాణం చెయ్యండి" అని కోరింది, కుసుమ డగ్గుత్తికతో.

"ఇదుగో నీ మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. ఏ పరిస్థితుల్లో కూడా నీ చెయ్యి వదలను" అని ప్రమాణం చేసాడు మధు

కుసుమ సంతృప్తితో తన తలని మధు వక్షంలో దాచుకున్నది. ఆ క్షణంలో పర్వత శిఖరాగ్రంపైన తను నిలబడి వున్నట్టు తోచింది మధుకి. చెదిరిన కుసుమ ముంగురులని సవరిస్తో మైమరచాడు మధు. కుసుమ ఎంతకాలం మధు వక్షస్థలంపైన వొరిగిందో ఆమెకి తెలియదు. మధుకీ తెలియదు. ఇద్దరూ వెండితెరపైన కనపడుతున్న సప్తవర్ణాల్లో తేలిపోతున్నారు.

పిక్చర్ లో ఎంతోకాలం ఎడబాటు ననుభవించిన ప్రేయసీ ప్రియులు తిరిగి కలుసుకున్నారు. వాళ్ళ మధ్యగల విభేదాలు సమసి పోయినాయి. విడదీయజాలనంతటి గాఢంగా తిరిగి ఏకమైనారు.

నౌరంగ్ భార్య, మానవజన్మకు సంబంధించిన ఏడు దశల్లో భర్తని అంటిపెట్టుకొని వుంది. ఆ ఏడు దశల్లోకూడా తను కుసుమకి అండగా నిలుస్తా ననుకున్నాడు మధు లోలోపల.

పిక్చర్ పూర్తి అయ్యేసరికీ రాత్రి తొమ్మిదింబావు దాటింది. లైట్లు రావడంతోనే కుసుమ పైటా, ముంగరులూ సవరించుకుంది. బాక్సు లోకి వెళ్ళేటప్పుడు ఎంత ఆందోళనకరంగా వుండిందో, అంతటికన్నా

ఎక్కువ ప్రశాంతతతో ఉభయులూ వెలుపలికి వచ్చారు. నళినీ సలీంలని కలుసుకున్నారు. మెట్లు దిగుతూ ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఎవళ్ళ భావాల్లో వాళ్ళు నిమగ్నులై కార్లదగ్గరికి వెళ్ళారు. సలీం కుసుమతోగానీ, మధుతో గానీ ఏమీ మాట్లాడలేదు. "వెళ్ళివస్తా" నని నళినితో చెప్పి తన కార్ దగ్గరికి వెళ్ళాడు సలీం. మిగిలిన ముగ్గురూ కార్ లో తమ పూర్వస్థానాల్లో కూర్చున్నారు. వెంటనే కార్ కదిలింది. టాంక్ బండ్ మీదుగా పోనివ్వమని నళిని డ్రైవర్ కి ఆదేశించింది. సందు దాటి మహాత్మాగాంధీ రోడ్ మీదికి వచ్చి కార్ స్పీడ్ పికపు చేసింది. పోలీసు స్టేషన్ దగ్గర సలీం కార్, తమకార్ ని ఓవర్ టేక్ చేసింది. స్వయంగా సలీం కారు నపుడుతున్నాడు. కారులో డ్రైవర్ ఎవ్వడూ లేడు. ఓవర్ టేక్ చేస్తున్నప్పుడు సలీం తన కార్ ని తమ కార్ కి పక్కపక్కగా పోనిచ్చి నళినిని చూచి తన ఎడమచెయ్యి గాలిలో వూపాడు. అతని కుడిచెయ్యి స్టియరింగ్ పైన వుంది. దానికి జవాబుగా నళినికూడా కుడి చెయ్యి గాలిలో వూపింది. దానితో సలీం కార్ పెద్ద స్పీడ్ తో రంయ్యిన ముందుకు సాగింది. ఒక నిమిషం తరువాత కార్ కనుచూపుమేరలో అదృశ్యమైంది.

ప్రపంచమంతా పాలు వొలకబోసినట్లు బయటవెన్నెల. మహాత్మా గాంధీరోడ్ లోని విద్యుద్దీపాల కాంతికి వెలవెలబోయిన వెన్నెల, టాంక్ బండ్ పైన తన వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటం చేసింది. బండ్ పైన విద్యుద్దీపాలు లేవు. ఇటు వెన్నెల, అటు వెన్నెల. ఎటుచూచినా వెన్నెలే. కార్ బండ్ సమీపించడంతోనే "నెమ్మదిగా పోనివ్వ" మని నళిని డ్రైవర్ తో చెప్పింది. వెంటనే కార్ స్పీడ్ తగ్గింది. రోడ్, చెట్లూ, యిండ్లూ, కొండలు, వెన్నెలని కప్పుకొని ప్రశాంతంగా నిద్దరోతున్నాయి. ఆ ప్రశాంతతని భంగపరచకుండా కార్ అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగుతున్నది. షోడశకళలతో అలరారుతున్న వెన్నెల బాలని

చూచి, హుసేన్‌సాగర్‌లోని నీళ్ల అలలు అలలుగా గంతులేస్తున్నాయి. వెన్నెల బాలని తమ కౌగిలిలో బంధించివేయాలనే ఉత్సాహంకొద్దీ ఉవ్వెత్తున లేచి క్రింద పడుతున్నాయి. నురుగులు నురుగులుగా కిలకిలా నవ్వుతున్నాయి. వెన్నెలబాలని చూస్తే ఆ సాగరజలాలకి అంత పొంగ రెందుకో? అంత పెంకెతన మెందుకో? ఆ త్రుళ్ళిపడడ మెందుకో? ఆ కేరింతలు కొట్టడ మెందుకో? వెన్నెలబాలని ఆమె మానాన ఆమెని వదిలివేయక, ఆ జలాలు ఒకటేపనిగా ఆమెని వెంటాడడ మెందుకో? ఆ సాగరజలాల ఉత్సాహంచూచి, ఎందుకో మధుకి కూడా గంతులేయా లనిపించింది. కిలకిలా నవ్వాలనిపించింది. కేరింతలు కొట్టాలనిపించింది. పిచ్చిగా కేకలు పెట్టాలనిపించింది. కాని విధిలేక పొంగులెత్తుతున్న తన ఉత్సాహాన్ని హృదయంలో అణచుకున్నాడు మధు. కార్ బండ్ దాటింది. లిబర్టీ టాకీస్ మలుపు మళ్ళింది. హార్డీకర్‌బాగ్ మీదుగా, హిమాయత్ నగర్ చేరుకుంది. నారాయణగూడాకి వెళ్ళే రోడ్‌మీద మస్జిద్‌కి ఎదురుగావున్న ఒకసందుముందుగా కార్ ఆపివేయమని డ్రైవర్‌తో చెప్పి, ఆగడంతోనే కార్ దిగాడు మధు.

"ఈ సందులోనేనా మీరు ఉండడం" అని అడిగింది నళిని, మధు కార్ దిగడంతోనే.

"అవునండీ. ఎడమచేతివేపు నాల్గవ యిల్లు" అని మధు తనుండే యింటి ఆనవాలు చెప్పాడు.

"ఇంక శలవు—నమస్కారాలు" అంది నళిని మధుతో.

"నమస్కారాలు" అన్నాడు మధు జవాబుగా. కుసుమదగ్గర కళ్లతో శలవు పుచ్చుకున్నాడు అతను.

కార్ కదిలింది. కనుచూపుమేరదాకా కార్ వెళ్ళేవరకూ మధు సందుముందు నిలబడ్డాడు. కార్‌కి సమంగా తన హృదయం కుసుమతో పరుగెడుతున్నది. దాన్ని ఆపడం తనకు అశక్యం. ఊసురోమని కాళ్ళీడ్చు

కుంటూ తన గదివేపు బయల్దేరాడు. గదిలో అతనికి ఏమీ తోచలేదు. అన్నం తిందామంటే సహించలేదు. కాగా ఆకలికూడా వేయడంలేదు. కలిపిన అన్నం కలిపినట్లుగానే వదిలివేశాడు. చెయ్యి కడుక్కొని శూన్య హృదయంతో పక్కమీద పడ్డాడు. నిద్ర పట్టదు. అది విచారమూకాదు, సంతోషమూ కాదు. రెండింటికీ ఏదో మధ్యస్థితి, ఏదో శూన్యస్థితి. ఉండుండి ఏదో అలికిడి అవుతుంది. తీరా చూస్తే ఎవ్వరూ ఉండరు. ఎవ్వరో తన పక్కదగ్గరికి వచ్చినట్లు అనిపిస్తుంది. తిరిగిచూస్తే ఏమీ ఉండదు. తన శూన్య జీవితంలోకి ఎవ్వరైనా ప్రవేశిస్తున్నారా? ఆ భావం కలగడంతోనే శరీరం గగుర్పాటు పొందింది. అందరికిమల్లేనే తనకూ ఒక యిల్లంటూ ఏర్పడుతుందా? తన రాకకోసం ప్రతిసాయంత్రం ఎవ్వరైనా ఆతురతగా నిరీక్షిస్తారా? జీవితంలో తను ఆ భాగ్యానికి నోచు కున్నాడా? ఏమో......ఎవ్వరో వచ్చి తన పక్కమీద పడుకున్నట్లని పించింది. ఏదో సులివెచ్చని శరీరం తన శరీరానికి తాకుతున్నది. తను నిద్రపోయినట్లు నటిస్తున్నాడు. పక్కనున్న వ్యక్తి ఆ సంగతి నమ్మలేక పోతున్నది. ఒకచేతిమీదుగా కొద్దిగాలేచి తనమొహంలోకి చూస్తున్నది. ఆ చల్లనిచూపులు తన చెంపలమీద కళ్ళమీద పడుతున్నాయి. తను గట్టిగా కళ్ళుమూసుకొని నిద్ర నభినయిస్తున్నాడు. "అప్పుడే నిద్ర పోయారా? అమ్మా దొంగా, అంతా ఉత్తదే. నన్ను పిచ్చిదాన్నిచేసి ఏడిపిస్తున్న సంగతి నాకు తెలియదూ" అంటూ కిలకిల నవ్వుతున్నది. తనకూ నవ్వు ఆగలేదు. దొంగనటన మాని తనూ గొల్లున నవ్వాడు. రెండుచేతులతో ఆ మొహాన్ని, తన మొహంలోకి తీసుకున్నాడు. ఆ కిలకిల నవ్వులు, గొల్లుమనే తన నవ్వులో కలిసిపోయినాయి......ఆ తరువాత ఎప్పుడు నిద్రపట్టిందో మధుకి తెలియదు.

  

౨౪

రాములమ్మగారు జబ్బుపడ్డప్పటినించీ నళిని అన్ని వ్యవహారాలూ తను స్వంతంగా చూసుకుంటున్నది. ఏ చిన్నవ్యవహారంకూడా నమ్మి రామచంద్రయ్యకి ఒప్పజెప్పడంలేదు. వచ్చిన షేర్ల లాభాలూ, ఇండ్ల బాడుగలూ ఎప్పటికప్పుడు ఒకచిన్న నోట్ బుక్‌లో వ్రాసుకుంటున్నది. ఏ కంపెనీనించి అయినా లాభాలు రావడం ఆలస్యమైతే, వాళ్ళతో ఉత్తర ప్రత్యుత్తరాలునడిపి ఆలస్యానికి కారణాలుతెలుసుకుంటున్నది. ఇండ్లబాడుగలు సమయానికి ఇవ్వనివాళ్ళకి లాయర్ ద్వారా నోటీసులు ఇప్పిస్తున్నది. ప్రతియింటికి వెళ్ళి ఆయా యిండ్లలో బాడుగలకి ఉంటున్నవాళ్ళతో పరిచయం చేసుకుంటున్నది. జాగీర్ నష్టపరిహారం వసూలుచేయడానికి రామచంద్రయ్యని సమయానికి జాగీర్ అడ్మినిస్ట్రేటర్ ఆఫీసుకు పంపుతున్నది. చేతికందిన డబ్బుని జాగ్రత్తగా బ్యాంకులో వేస్తున్నది. వివిధబ్యాంకుల పాసు బుక్కులూ రామచంద్రయ్య దగ్గరినించి తనస్వాధీనం చేసుకున్నది. జాగీర్‌కి సంబంధించిన ఫైళ్ళూ, దస్తావేజులు, ముంతఖబు కాగితాలూ, మొదలైనవి అతని దగ్గరినించి తీసుకున్నది. జాగీర్లు రద్దుకావడంతో పల్లెర్ల జాగీర్ బెడద చాలావరకు తగ్గింది. అమ్మింది అమ్మగా పల్లెర్లలో ఆ కుటుంబానికి కొంత స్వంతభూమి ఉంది. ఆ భూమికి సంబంధించిన కౌలు ఆ కుటుంబానికి సరిగ్గా అందటంలేదు. ఆ కౌలు వసూలు చేయడానికి రామచంద్రయ్యని అప్పుడప్పుడు నళిని పల్లెర్లగ్రామానికి పంపిస్తున్నది. ఆ భూమి నళినికి ఒక తలనొప్పిగా తయారైంది. కలకాలం నించీ ఆ భూమి సేద్యం చేస్తున్న రైతులకి, ఆ భూమిపైన కొన్ని హక్కులు సంక్రమించాయి. వాళ్ళకి ప్రభుత్వంనించి టెనెన్సీపహాణాలు లభించాయి. ఆ హక్కుల్ని తాము న్యాయశాస్త్రదృష్ట్యా కాదనడానికి వీలు లేదు. భూమిని అమ్మదలుచుకుంటే వాళ్ళకే అమ్మాలి. వాళ్ళని కాదని

యితరులకి ఆ భూమి అమ్మడానికి వీలులేదు. కాగా భూముల ధరలు కూడా పడిపోయినాయి. ఏ యితర రైతులుకూడా ఆ భూమి కొనడానికి సంసిద్ధంగా లేరు. తాము ఆ భూమిలో స్వంత వ్యవసాయం పెట్టుకోవడానికి పరిస్థితులు ఏమాత్రం అనుకూలంగా లేవు. తమలో ఎవరైనా ఒకరు స్వంత వ్యవసాయం చూసుకోవడానికి పల్లెర్లలో ఉండాలి. అది తమలో ఏ ఒక్కరికీ సాధ్యపడదు. లాయర్‌తో సంప్రదిస్తే, ప్రస్తుతం ఆ భూమిని సేద్యం చేస్తున్న రైతుల దగ్గరినించి రాజీనామాలు తీసుకోవడం అవసరమని చెప్పాడు. అప్పుడు ఆ భూమి అమ్మడానికి వీలుంటుందని అన్నాడు. ఆ భూమి సేద్యం చేస్తున్న రైతులదగ్గరినించి రాజీనామాలు పొందడం, ఏ విధంగా వలనుపడుతుందో ఆలోచించి లాయర్ ఒక కిటుకు చెప్పాడు. ఆ భూమిలో ఎకరమో, రెండు ఎకరాలో వాళ్ళకి దానమిస్తే మిగతా భూమికి వాళ్ళు రాజీనామాలు ఇవ్వవచ్చునన్నాడు. అప్పుడుగానీ, ఆ భూమికీ తమకీ ఏమి సంబంధం లేదని, ఆ రైతులు వ్రాసియివ్వడం జరగదని అన్నాడు. రైతులతో బేరమాడి రాజీనామాలు తీసుకోవడానికి కూడా అప్పుడప్పుడు రామచంద్రయ్య పల్లెర్ల గ్రామానికి వెళ్ళివస్తున్నాడు.

నళిని పెత్తనం వహించినప్పటినించీ, రామచంద్రయ్యకి జీవితం కంటకంగా పరిణమించింది. పనితో ఏమాత్రం ఊపిరి సలపడంలేదు. కాగా నీడపట్టుని ఒకచోట పడివుండకండా నళిని ఊళ్ళూ, వీథులూ తిప్పుతున్నది. డబ్బువిషయంలో తనని ఏమాత్రం నమ్మడం లేదు. వసూళ్ళు ఆలస్యమైతే ఎందుకు ఆలస్యమవుతున్నవని అడుగుతుంది. బ్యాంకులో డబ్బుకట్టడం ఆలస్యమవుతే డబ్బు ఇంకా దగ్గరపెట్టుకొని ఎందుకు కూర్చున్నావని అడుగుతుంది. రాములమ్మగారి హయాంలో తన చేతినిండా డబ్బు ఉండేది. చిన్నచిన్న లెక్కలు అసలు అడిగేదే కాదు. హుందాగా వ్యవహారం నడిపేది. ఈ వస్తువుకి ఇంత డబ్బు ఎందుకు ఖర్చు అయిందని ఎన్నడూ అడిగేదికాదు. ఇంత అయిందంటే

మారుమాట్లాడకండా ఊరుకునేది. ఆమె హయాంలో తనది ఆడింది ఆటగా పాడింది పాటగా ఉండేది. ఇంటికి కావల్సిన వస్తువులన్నీ తను పనిమనుషులతో తెప్పించేవాడు. కాగా యిష్టమొచ్చినంత ఖర్చు వ్రాసుకునేవాడు. దానివల్ల తనకి కొద్దోగొప్పో ముట్టుతుండేది. ఇప్పుడు సామానుకొట్టుకు తను వెళ్ళిన కొంతకాలానికి కారులో కుసుమకూడా వస్తున్నది. ప్రతి వస్తువు ధరలు కాగితంమీద వేసుకుంటున్నది. వలసిన వస్తువుల పట్టికవ్రాసి యిస్తున్నది. ఆ పట్టికప్రకారం ఎంతడబ్బు అయ్యేదీ కొట్టువాడితో ముఖాముఖి మాట్లాడి తేల్చుకుంటున్నది. కాగా ఆ డబ్బు తనే కొట్లో యిస్తున్నది. ఒక బండి కుదుర్చుకొని వస్తువులు తీసుకు రావడం, అవి యింట్లో పెట్టించటం, బండివాడికి బాడుగ యివ్వడం తన వంతు అవుతున్నది. కాగా చిల్లరదుకాణంలో ఏమీ ఖాతా వుంచడంలేదు. కుసుమ ఎప్పటికప్పుడు డబ్బు పారేస్తున్నది. దానివల్ల చిల్లరదుకాణం వాడికి వెయ్యిరూపాయలు అని తను దొంగలెఖ్ఖలు వ్రాసి కొంతడబ్బు కొట్టేయడానికి అవకాశం లేకుండా పోతున్నది. గుడ్డలు కొనడానికి అసలు తనని పంపడమేలేదు. కావల్సిన గుడ్డలు కుసుమనే కార్‌లో వెళ్ళి తీసుకొస్తున్నది. ఆవిధంగాకూడా తననోట్లో గడ్డపడుతున్నది. తన ఆదాయం రోజుకురోజు తగ్గుతున్నది. ఇందులో కుసుమ దోషమేమీ లేదు. నళినే యింటిపనులన్నీ ఆమెకి ఒప్పజెప్పి ఆమెతో పని తీసుకుంటున్నది. "ఈ బెడద అంతా నేనుండగా నీ కెందుకమ్మా" అంటే "ఎవరింటిపనులు వాళ్లు చూసుకోకపోతే ఎల్లాగ మామయ్యా" అని చల్లగా సమాధానం చెబుతుంది కుసుమ. దానితో తన ఆట పూర్తిగా కట్టుబడిపోయింది. తనకు భార్యాపిల్లలు లేనిమాట నిజమే. తను ఒంటరిగాడు. ఏ చెట్టుక్రింద కూర్చున్నా తనపొట్ట గడిచిపోతుంది. అసలు తనకోసంకానేకాదు ఈ తాపత్రయంఅంతా. తనకి ఒక తమ్ముడు ఉన్నాడు. వాడికి బోలెడుమంది పిల్లలు. సంసారం ఈదలేకుండా నానాఅవస్థలు

పడుతున్నాడు. వాడికి ఊళ్లో వచ్చేది ఏపాటని? వాడి సంపాదన ఏమూలకు పోతుందో ఏమో? తను ఇక్కడ ఉద్యోగంచేస్తూ, నెలకి రెండుమూడు వందలకి తక్కువగాకుండా వాడికి లోగడ అందించేవాడు. తను యాభై రూపాయల జీతంతో ఇంత డబ్బు ఎక్కడనించి అండించగలడని? రాము లమ్మగారు చూసీచూడకుండా కొంతడబ్బు తీసి, తమ్ముడికి పంపించేవాడు. పోయిన నాలుగు మాసాలనించీ జీతండబ్బులు తప్ప తను ఏమీ పంపించ లేకపోతున్నాడు. ఇంటినించి డబ్బుకోసం ఉత్తరాలపైన ఉత్తరాలు వస్తు న్నవి. కాని తను ఏం చేస్తాడు, కానిరోజులు వచ్చి పడ్డప్పుడు? లోగడ లాయర్‌కికూడా తన చేతిమీదుగానే డబ్బు యిచ్చేవాడు. అయిదువందలిస్తే ఆరువందలని వ్రాసుకునేవాడు. కాని యిప్పుడు అల్లాకాదు. నళిని లాయర్‌కి యిచ్చి పుచ్చుకోవడాలు కూడా తనే జరుపుకుంటున్నది. ఆ విధంగాకూడా తనకు ఏమాత్రం డబ్బు గిట్టడంలేదు. పనిమనుషుల కిచ్చే జీతాల్లో మాత్రం ప్రతినెలా నాలుగుడబ్బులు మిగులుతున్నవి. ఎవరి కెంత జీతమో ఆ యింట్లో ఎవ్వరికీ తెలియదు. పనిమనుషుల జీతాలు ఎంత అంటే ఒక మొత్తం తాను చెప్పాడు. ప్రతి నెలా ఆ మొత్తం తనకు యిచ్చి జీతాలు పంచిపెట్టమని చెబుతున్నారు. ఈ పద్ధతి ఇంకా ఎన్ని రోజులు సాగుతుందో తెలియదు. వాళ్ళే జీతాలివ్వడం మొదలుపెట్టిన రోజున తను చేస్తున్న మోసం బయటపడుతుంది. అప్పుడు ఒకటీ, రెండు రోజులవరకు తనకు ఆ యింట్లో తలవంపులుగా వుంటుంది. పనిమనుషుల ముందు కూడా తను లోకువయ్యేగతి పడుతుంది. ఆ ఘడియ రాకుండా చూసుకోవాలి. ఇప్పటికే తనమాట అంటే పనిమనుషులు ఏమాత్రం లక్ష్యం చేయడంలేదు. చాటుమాటుగా తన పెత్తనం అంతా పోయిందని గుసగుసలు ప్రారంభించారు. వాళ్ళ జీతాల్లోంచి తను కొంత డబ్బు కొట్టేస్తున్నాడని వాళ్ళకి తెలిస్తే, అప్పుడు తనని పూచికపుల్లక్రింద జమ డుకతారు. రాజఠీవితో బ్రతికిన ఇంట్లో బానిసగా బ్రతకడం ఎందుకని

ఉద్యోగం వదలివేతామంటే, ఇంకొకచోట ఈపాటి ఉద్యోగంకూడా దొరకదు. తనకి వచ్చిన చదువు ఏపాటని, ఇంతకన్నా మంచి ఉద్యోగం దొరకడానికి ? తనకు ఇంగ్లీషు ఏమాత్రం రాదు. కొస్త తెనుగూ, ఉర్దూ వచ్చు. ఈ రోజుల్లో ఉర్దూకి ఏమాత్రం ఖాతర్ లేదు. పెద్దపెద్ద ఇంగ్లీషు చదువులు చదువుకున్న వాళ్ళకే ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరకకుండా పోతున్నవట. వాళ్ళముందు తనెంతటివాడని, తనకు వాళ్ళకి లేని మంచి ఉద్యోగాలు దొరకడానికి ? ఉమామహేశ్వరరావుగారి తాగుడు, ముండలు, మందుల వ్యవహారాలుకూడా తనే చూస్తున్నాడు. ఇంటి ఖర్చులు పోను నెళకి ఒక ఐదువందల రూపాయలు వారికి ప్రతి నెలా దొరుకుతున్నాయి. ఆ అయిదువందల్లో ఎటులేదన్నా తనకు ఒక వంద రూపాయలు గిట్టుబాటవుతున్నాయి. ఈ ఉద్యోగం వదులుకుంటే ఆ వందరూపాయల ఆదాయం కూడా ఉసూరుమనిపోతుంది. తనకు భోజనపు ఖర్చులు ఏమీ లేవు. భోజనపు సామగ్రి అంతా వాళ్ళేయిస్తున్నారు. తను విడిగా వంట చేసుకుని భోజనం చేస్తున్నాడు. పుట్టింది బ్రాహ్మణపుట్టుక. ఆ వెలమల యింట్లో తను ఎల్లా భోజనం చేస్తాడని? తనకు ఏనాడో భార్య పోయింది. ఉప్పూ, కారం తింటున్న శరీరం తనది. తనకు కాలక్షేపం జరగడం ఎల్లా ? తనకూ, మోహనాంగికీ ఎన్నడో సంబంధం ఏర్పడింది. మోహనాంగి దాసీది. ఆ యింట్లో పుట్టి, ఆ యింట్లో పెరిగింది. ఒక కాలంలో ఉమామహేశ్వరరావుగారికి అదంటే ఎంతో యిష్టం. కొంతకాలం రాణివాసం అనుభవించింది. కాని ప్రస్తుతం అదంటే ఎందుకో వారికి మోజు తగ్గింది. వయస్సుకూడా ఒక కారణం కావచ్చు. దానికి ప్రస్తుతం పాతిక ఏళ్ళకి పైగా వుంటాయి. కొంచం ఈడు మళ్ళినా, చూడడానికి పచ్చగా, అందంగా వుంటుంది. తనకు ఈడు ప్రధానం కాదు. గుణం ప్రధానం - అందువల్ల తను మోహనాంగిని చేరదీసాడు. తను దానికి కొంత డబ్బు యిస్తున్న మాట నిజమే - కాని అది తనకు చేస్తున్న

సేవకి తను యిస్తున్న డబ్బు ఒక లెఖ్ఖలోనిది కాదు. అది ఉమామహే శ్వరరావుగారి ప్రాపకంలోనే వుంటే, ఇంకా ఎంతో డబ్బు సంపాదించి వుండేది. కాని ఎందుకో అయిదు, ఆరు సంవత్సరాలకన్నా ఎక్కువ రాణివాసంలో నిలువలేదు. ఇప్పటికీ అది ఆ ఎదురింటికి ఎన్నడో ఒక నాడు వెళ్ళడం కద్దు. ఆ యింటికి వెళ్ళవద్దని మోహనాంగిని తను ఎల్లా శాసించ గలడని ? తనూ, మోహనాంగీ ఆ యింటి ఉప్పే తిని బ్రతుకు తున్నారు. వారికి సపర్యలు చేయడం దాని ముఖ్యవిధి. కాగా దానికి చిన్నతనంలో కన్నెరికం కూడా ఉమామహేశ్వరరావుగారే చేశారు. నిజం విచారిస్తే. అది వారి సొత్తు - అటువంటి పరిస్థితుల్లో తను దాన్ని ఆ ఎదురింటికి వెళ్ళవద్దని ఏ మొహంతో అనగలుగుతాడని ? దీర్ఘంగా ఆలోచిస్తే, దురాక్రమణ చేసింది తను. ఇతరుల సొత్తుకి ఆశపడింది తను. దానికీ, తనకూ ఏదో సుముహూర్తాన సంబంధం కుదిరింది. ఆ సంబంధం యితరుల కంటబడకుండా గుట్టుగా కొనసాగుతున్నది. అల్లాంటప్పుడు తను మోహనాంగి విషయంలో కట్టుబాట్లు పెడితే, వ్యవహారం బెడిసికొడుతుంది. అది ఉమామహేశ్వరరావుగారితో పూర్తిగా తెగతెంపులు చేసుకుంటే, ఈ యింట్లో అది ఒక్క క్షణం కూడా ఉండడానికి వీలుండదు. అప్పుడు దాని భారం పూర్తిగా తన నెత్తిన పడుతుంది. దానికి తను సంసిద్ధంగా ఉన్నాడా ? ప్రత్యేకంగా తను ఒక యిల్లు తీసుకుని, ఒక సంసారం నడుపగల స్థితిలో వున్నాడా ? కాగా ఈ కానిరోజుల్లో ఒక సంసారం నడపడమంటే మాటలా ? అధమం రెండువందల రూపాయలైనా కావాలి. తనకు నెల పేరట వచ్చే డబ్బు ఆ విధంగా ఖర్చు అయితే, తమ్ముడికి ఏమి పంపించ గలడని ? పెద్ద ఎత్తులకి వెళ్ళి, నలుగురు నోళ్ళల్లో పడి రభస కావడం తప్ప ఫలితమేమీ ఉండదు. అందువల్ల మోహనాంగి ఎదురింటికి వెళ్ళినా చూసీ, చూడనట్లు ఊరుకుంటున్నాడు. నొప్పించక, తా నొవ్వక తప్పిం

చుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ అని సుమతీశతకకారుడు అన్నాడు. ఆ హితవు ననుసరించే ప్రస్తుతం తను మెలగుతున్నాడు. మోహనాంగికి తను ఇంతవరకు ఆరు తులాలు పెట్టి ఒక బంగారు గొలుసు చేయించాడు. రెండు తులాల పట్టెడ చేయించాడు. దానికీ, దీనికీ అని మోహనాంగికి పది తులాలవరకు బంగారం ముట్టింది. దానితో అది సంతోషపడుతున్నది. తనకు సుఖంగా కాలం గడుస్తున్నది. అందువల్ల ఆ వ్యవహారానికి సంబంధించినంతవరకూ తను ఆలోచించవలసిన అగత్యమేమీ లేదు. "రాబడి తగ్గిందే, పలుకుబడి తగ్గిందే" అన్నది ఒక్కటే బెంగ ప్రస్తుతం తనకి - పలుకుబడి తగ్గితే తను ఏమాత్రం లెఖ్ఖచెయ్యడు. పలుకుబడి తగ్గితే పోయే దేముందని? నలుగురి ముందర తను చులకన అవుతాడు. ఆ పని ఇదివరకే జరిగింది. పోయిన పలుకుబడి ఏలాగూ తిరిగిరాదు కనుక ఇంక దానికోసం విచారించడం అనవసరం. ఇక మిగిలింది రాబడి. కాలం ఎప్పుడూ ఒక్క తీరుగా వుండదు. నాలుగు రోజులు ఓపికపడితే ఆ చింతకూడా తీరవచ్చు. నళిని కలకాలం ఈ యింట్లో పీటవేసుకొని కూర్చోదు. నాలుగు రోజు లయితే, నళిని పెండ్లిచేసుకొని ఏ యింటికో వెడుతుంది. అదృష్టం కలిసివస్తే అప్పుడు తన మేనకోడలు కుసుమ చేతికి పెత్తనం రావచ్చు. కుసుమ హయాంలో తను తిరిగి ఒక ఆట ఆడించవచ్చు. తను మోసం చేస్తున్నాడని తెలిసినా, కుసుమ అప్పట్లో ఆ విషయం బైటికి పొక్కనివ్వదు. కడుపులో పెట్టుకొని మౌనం వహిస్తుంది. తనకు ఆ మంచిరోజులు రావడానికి ఇంక ఎంతోకాలం పట్టదు. ఒక నాలుగైదు సంవత్సరాలు ఓపికపడితే చాలు, కన్ను మూసి కన్ను తెరిచేసరికీ, ఆ నాలుగైదు సంవత్సరాలు ఇట్టే గడచిపోతాయి.

ఒక రోజు రామచంద్రయ్య యింటికి నెలసరి సామాను తేవడంలో నిమగ్నమై ఉమామహేశ్వరరావుగారి మందు సంగతి మరచిపోయాడు

అప్పటికే సాయంత్రమైంది. ఎప్పుడు వెళ్ళి ఎప్పుడు తీసుకొస్తాడని ? మనిషి కొంచెం స్థూలకాయుడు. సాయంత్రందాకా ఏదో తంటాలు పడు తాడు ఆ పనీ ఈ పనీ అని - కాని సాయంత్రం కాగానే బద్ధకిస్తాడు. అందులో డిసెంబర్ మాసం. చీకటిపడడంతోనే చలి మొదలవుతున్నది. అప్పుడు ఆబిడ్సుకి వెళ్ళి సాధన ఔషధాలయంనించి మందు తీసుకు రావడమంటే తలప్రాణం తోకకివస్తుంది. నడిచి వెళ్ళడానికి వీలులేదు. బర్కత్‌పూరా ఆబిడ్సుకి రెండు మైళ్ళకి పైగా వుంటుంది. బస్సులో వెడదామంటే రెండు బస్సులు మారాలి. కోఠీవరకు సెవన్-సి లో వెళ్ళి అక్కడ ఎనిమిదవ నెంబర్ బస్సు ఎక్కాలి. వచ్చేప్పుడు కూడా అదే విధంగా రెండు బస్సులు మారాలి. రిక్షాలో వెడుదామంటే చల్లగాలి. రెండు మూడు రోజులనించీ తను జలుబుతో అవస్థపడుతున్నాడు. ఆ జలుబుతో యిప్పుడు ఆబిడ్సుకి వెళ్ళివస్తే జ్వరం వచ్చినా రావచ్చు. కాగా రెండు రోజులనించి తనకు కొద్దిగా చలిగా కూడా వుంటున్నది. రోజు రాత్రి మిరియాలు వేసుకొని పాలు తాగుతున్నాడు. అయినా జలుబు తగ్గడంలేదు. రేపు ఉదయం ఎనిమిది గంటలవరకు ఉమామహేశ్వర రావుగారికి మందు అందాలి. లేకపోతే తను వారి ఆగ్రహానికి గురికావలసి వస్తుంది. మొదలే ఇవి కానిరోజులు. ఈ రోజుల్లో తను ఉమామహేశ్వర రావుగారి ఆగ్రహానికి గురి అవుతే ఆ యింట్లో తనకు భావి అనేది ఏమైనా వుంటుందా ? ఏదో ఉపాయంచేసి ఎవ్వరితోనైనా మందు తెప్పించాలి. పనిమనుషులతో అయ్యే పని కాదు ఇది. పనిమనుషులు కాకపోతే, ఈ యింట్లో ఈ పని సానుకూలం చేసిపెట్టేవాళ్ళెవరున్నారు ? చప్పున రామచంద్రయ్యకి మధుసూదనరావు జ్ఞాపకం వచ్చాడు. నిజమే అతను వెళ్ళి, ఈ మందు తీసుకొని ఇక్కడున్నట్టుగా రాగలడు. ఇప్పుడే ఆరు గంట లైంది. బహుశా ఈపాటికి ట్యూషన్ చెప్పడానికి వచ్చేవుంటాడు. వెంటనే రామచంద్రయ్య కిశోర్ గదిలోకి వెళ్ళాడు. మధుసూదనరావు

కిశోర్‌కి పాఠం చెబుతున్నాడు. రామచంద్రయ్యని చూడటంతోనే, ఏదో పనిమీద వచ్చి వుంటాడని గ్రహించి, మధుసూదనరావు పాఠం చెప్పడం ఆపి వేశాడు.

"ఏదో పనిమీద పైకి వచ్చినట్టున్నారు?" అని అన్నాడు మధు, రామచంద్రయ్య కిశోర్ గది గుమ్మం దాటడంతోనే.

"అవును - చిన్నపని మీదే వచ్చాను. మీరు చేస్తానంటే చెబుతాను" అన్నాడు రామచంద్రయ్య.

"చేయదగ్గ పని అయితే తప్పకుండా చేస్తా" నన్నాడు మధు జవాబుగా.

"చేయకూడని పని నేను ఏమీ చెప్పనని మీకు తెలుసుకదూ?" అన్నాడు రామచంద్రయ్య మధు దగ్గరినుంచి వచ్చిన జవాబుకి కొద్దిగా స్తిమితపడుతో.

"అయితే శలవివ్వండి" అన్నాడు మధు రామచంద్రయ్యతో.

"ఏమీలేదు - ఈ మందు కాస్త వెంటనే తెచ్చిపెట్టాలి" అంటూ ఒక చీటీ, యాభై రూపాయలు ఇచ్చాడు రామచంద్రయ్య మధుకి.

"వెంటనే కావాలంటారా?" అని అన్నాడు మధు రేపటికి వాయిదా వేయవచ్చునేమోననే ఆతురతకొద్దీ.

"అవును. రేపు ఉదయం ఎనిమిది గంటలవరకు ఉమామహేశ్వర రావుగారికి ఈ మందు అందితీరాలి" అని అన్నాడు రామచంద్రయ్య సంగతి సందర్భాలు వివరిస్తో.

"అంటే ఇప్పుడే తీసుకురావాలన్నమాట - పోనీ ఎక్కడ దొరుకుతుందో, ఎంత తీసుకురావాలో చెప్పండి - అల్లాగే తెచ్చియిస్తాను" అన్నాడు మధు రామచంద్రయ్య మాట త్రోసివెయ్యలేక.

"తులం మందు కావాలి - బహుశా తులానికి నలభై అయిదు రూపాయలు అవుతుంది. ఆబిడ్సులోని సాధన ఔషధాలయంలో దొరుకు. తుంది" అని వలసిన వివరాలన్నీ చెప్పాడు రామచంద్రయ్య మధుతో.

మధు చీటీ చూసుకున్నాడు. "శుద్ధమకరధ్వజ" మని ఆ చీటీలో వ్రాసివుంది. మందు పేరు జ్ఞాపకం వుంటుందో లేదో ? ఎందుకైనా మంచిదని చీటీ, రూపాయలు జేబులో వేసుకొని, ఆనాటికి పాఠం ఆపివేసి మందుకోసం బయల్దేరాడు.

"వెంటనే తెస్తారుకదూ ?" అన్నాడు రామచంద్రయ్య తొందరగా మందు తీసుకురావడం అవసరమని మధుకి నర్మగర్భంగా చెబుతూ.

"ఇక్కడున్నట్టు తేనూ ?" అన్నాడు మధు జవాబుగా.

రామచంద్రయ్య హృదయం స్తిమితపడింది. ఏదో భారం తగ్గి నట్లయింది. వెంటనే వంట ప్రయత్నములో నిమగ్నమైనాడు అతను.

ఆబిడ్సులో సాధన ఔషధాలయం సులభంగా కనపడింది మధుకి. సాగర్ టాకీస్ పక్కన వుంది.

లోపలికి వెళ్ళి "ఒక తులం 'శుద్ధమకరధ్వజం' కావాలి" అని అడిగాడు అతను.

"తులం నలభై అయిదు రూపాయలు" అని మందు ధర చెప్పాడు కొట్టువాడు బెంగాలీయాసలో.

"సరే - ఒక తులం యివ్వండి" అని అడిగాడు మధు.

"ఈ మందు ఎవ్వరికి ? మీకా ?" అని సందేహిస్తూ అడిగాడు కొట్టువాడు తులం మందు తూచుతూ.

"ఎందుకలా అడుగుతున్నారు ?" అన్నాడు మధు అమాయికంగా.

"ఏమీ లేదు" అని తప్పించుకోవడానికి చూచాడు కొట్టువాడు.

"ఏదో చెప్పడానికి సందేహిస్తున్నా" రన్నాడు మధు కొట్టు వాడితో.

"ఈ మందు ముసలివాళ్ళకి ఉపయోగపడుతుంది. యువకులకు కాదు" అన్నాడు కొట్టువాడు.

"అంటే మీ ఉద్దేశ మేమిటో నాకు అర్థంకావడంలేదు" అన్నాడు మధు తిరిగి అమాయకంగా.

"నరాల పటుత్వం తప్పిన ముసలివాళ్ళు ఈ మందు వాడుతారు" అని చెప్పాడు కొట్టువాడు డొంకతిరుగుడుగా.

"అయినా నాకు అర్థంకావడంలే" దన్నాడు మధు తిరిగి.

"మగతనంకోసం ఈ మందు తింటారు" అని చెప్పాడు కొట్టువాడు అసలు విషయాన్ని విస్పష్టపరుస్తో.

"ఈ మందు నాకు కాదు - ఒక జాగీర్‌దార్‌కి" అని వెంటనే అన్నాడు మధు, కొట్టువాడు తన మగతనాన్ని ఎక్కడ శంకిస్తున్నాడో అనే సందేహం కొద్దీ.

"అల్లా చెప్పండి - మీకేమోనని మొదట నేను అనుమానపడ్డాను" అన్నాడు కొట్టువాడు తను పొరపడ్డానని, నిలకడమీద తెలుసుకొని.

మందు తూచడం, పొట్లం కట్టడం పూర్తి అయింది. వెంటనే మధు అయిదు, పది రూపాయల నోట్లు కొట్టువాడి కిచ్చాడు. కొట్టువాడు అయిదు రూపాయల నోటు మధుకి తిరిగి యిచ్చాడు. మందు పొట్లం, రసీదు తీసుకొని, రిక్షాలో బర్కతుపురానికి వెళ్ళాడు అతను. రసీదు, మందు, అయిదు రూపాయల నోటు రామచంద్రయ్యకి అందజేసి బయట పడ్డాడు.

కాలినడకని తన గదికి బయల్దేరాడు.

దారిలో ఏవేవో ఆలోచనలు.

ఉమామహేశ్వరరావుగారి యిల్లు ఒక మహారణ్యంగా తోచింది మధుకి - ఆ అరణ్యంలో ఎన్నో జంతువులు - ఒక్కొక్క జంతువుది

ఒక్కొక్క మనస్తత్వం - ప్రతి మృగం ఒక ప్రపంచాన్ని సృష్టించుకొని ఆ ప్రపంచంలో జీవిస్తున్నది. ఆ మృగం ఆప్రపంచంనించి బయటికిరాదు. ఇతర ప్రపంచాల్నిగూర్చి ఆలోచించదు. దేనికదే తను సృష్టించుకున్న ప్రపంచంతో సంతృప్తి జెందుతున్నది.

ఉమామహేశ్వరరావుగారు యింటినించి ఎక్కడికీ కదలరు. ఎన్నడైనావస్తే ఆ యింటినించి ఈ యింటికి వస్తారు. లేకపోతేలేదు. రోజుల తరబడి కుటుంబంలోని యితర సభ్యుల్ని చూడరు. చూడవల్సిన అగత్యం లేదుకూడా వారికి. ఒకవేళ చూడడమే సంభవిస్తే మాట్లాడరు. మాట్లాడడంకూడా దేనికి ? వారికి కావల్సిన వస్తువులూ, డబ్బూ అడుగకుండానే వారి కాళ్ళదగ్గర వచ్చిపడినప్పుడు? సంపాదించవలసిన అవసరం ఏమాత్రంలేదు వారికి. రాములమ్మగారి పుణ్యమాఅని బ్యాంకుల్లో, కంపెనీల్లో డబ్బు మూల్గుతున్నది. ఎంత ఖర్చుపెట్టినా తరిగేది కాదది. కాగా ఎంతడబ్బు ఖర్చు అవుతున్నదీ, ఎంత వస్తున్నదీ కూడా వారికి తెలియదు. ఏ పనీ లేనప్పుడు ఏదో వ్యాపకం కల్పించుకోవడం అవసరం. వారు జీవితంలో ఒక వ్యాపకం సృష్టించుకున్నారు. అది జీవితాన్ని విలాసవంతం చేసుకోవడం, సుఖసౌఖ్యాలకోసం అన్వేషించడం. తమ ఆశయసిద్ధికోసం వారు త్రివిధసాధన జరుపుతున్నారు. అవి తాగుడూ, మందులూ, ముండలు. ఉదయం లేవడంతోనే తాగుడుతో తమ కార్యక్రమాన్ని ఆరంభిస్తారు. తాగుడుతో ప్రాణం విసిగితే ముండలు వుండనే వుంటారు. ఈ రెండు వ్యాపకాలకీ శరీరపటుత్వం కావాలి. దానికోసం మందులు వుండనే వున్నాయి. తాగుడు స్వైరవిహారానికి దారితీస్తుంది. ఈ రెండింటి వల్లా శరీరం గుల్ల అవుతుంది. నరాల పటుత్వం తగ్గుతుంది. మగతనం నశిస్తుంది. అప్పుడు మందుల అవసరం కలుగుతుంది. మందులు తినడం, సురాపానం చేయడం, స్వైరవిహారం జరపడం - ఇదీ విషవలయం -

ఈ విషవలయంలోపడి, ఉమామహేశ్వరరావుగారు సుఖసౌఖ్యాలని అన్వేషిస్తున్నారు. జీవితాన్ని సంతోషప్రదంగా మార్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఇవి క్షణిక సౌఖ్యాలనీ, వీటివల్ల జీవితంలోని మొనాటనీ తగ్గదని వారు ఏమాత్రం ఆలోచించరు.

రాములమ్మగారిది దీనికి పూర్తిగా విరుద్ధమైన ప్రకృతి. భర్త పోవడంతోనే తల్లిగారి యింట్లో ఆశ్రయం పొందారు. అదే తమ స్వగృహంగా భావించారు. ఆ ఇంటి సమస్యలే తమసమస్యలుగా ఎన్నుకున్నారు. ఆ యిల్లు నాశనంకావడం చూచి సహించలేక పోయారు. చక్కదిద్దడానికి పూనుకున్నారు. వెంటనే యింటికి పెత్తనం వహించారు. ఆదాయం ఎంతో, ఖర్చు ఎంతో చూసుకున్నారు. నిలువ ఏమీ కనపడలేదు. ఆదాయసాధనాల్ని పెంచడానికి పూనుకున్నారు. ఖర్చుల్ని తగ్గించివేసారు. చేతికందిన డబ్బుతో నగరంలో యిండ్లూ, కంపెనీలలో షేర్లూ కొనడం మొదలెట్టారు. పది సంవత్సరాలల్లో పాతిక యిండ్లు కొన్నారు. వివిధ కంపెనీలలో వందలాది షేర్లు సంపాదించారు. ఇంతలోకే పర్లెర్ల జాగీర్ పోయింది. అదే అవనుగా ఎంచి తమ్ముడి ఖర్చుల ఒక మితంలోకి తెచ్చారు. జాగీర్ పోయినా యిండ్ల బాడుగలవల్లా, షేర్ల లాభాలవల్లా ఆదాయం ఏమీ తగ్గలేదు. కాగా జాగీర్‌కిమల్లే ఒక స్థిరాస్తి ఏర్పడింది. పైగా మొదటికన్నా ఎన్నోరెట్లు ఆదాయం పెరిగింది. ఖర్చులు పూర్తిగా తగ్గాయి. ఇంతలోకే కూతురు నళిని చేతికి అందివచ్చింది. జీవితంలో తాము చేయదల్చుకున్న పని పూర్తి అయిందని తోచడంతో, యింటి పెత్తనాన్ని కూతురుకి ఒప్ప జెప్పారు. హృద్రోగం రావడంతో, జీవితం అశాశ్వితమని తోచింది. ప్రాపంచిక విషయాలపై వైముఖ్యత ఏర్పడింది. ఎన్నడూ లేనిది మృత్యుభయం కలిగింది. వెంటనే అలౌకిక విషయాల పైకి దృష్టి మళ్ళించారు. పూజాపునస్కారాలతో కాలం వెళ్ళబుచ్చడం మొదలెట్టారు. ఇంట్లో దేవుడి పూజకోసం ఒక బ్రాహ్మణ్ణి నియమిం

చారు. మధ్యాహ్నంవరకు దేవుడి పూజతో కాలం వెళ్ళిపోతుంది. ఆ తరువాత భోజనం, కాస్త విశ్రాంతి, ఆ తరువాత దాదాపు సాయంత్రం వరకూ భాగవత పురాణ కాలక్షేపం. సాయంత్రం తిరిగి పూజా పునస్కారాలు. ఇదీ వారి నిత్యకృత్యం. ఈ నిత్యకృత్యంలోపడి, వారు దేవతాగృహంనించి వెలుపలికి రావడంలేదు, పిల్లలసంగతి విచారించడం లేదు. అవసరమైనన్ని రోజులు వారు ప్రాపంచిక వ్యవహారాల్లో మునిగి తేలారు. ఆ తరువాత దైవచింతన ప్రారంభించారు. ఏపని చేసినా, తదేకదీక్షతో చేస్తారు. తక్కిన విషయాలు పట్టించుకోరు. ప్రేమానురాగాలు జీవితంలో ఎన్నడయినా వారిని సోకినవా అనే అనుమానం వేస్తుంది ఎవ్వరికైనా - వారిది యాంత్రిక జీవితం కాదుగదా అనే సందేహంకూడా కలుగుతుంది అప్పుడప్పుడు.

నళిని చాలా ప్రాక్టికల్ మనిషి. తెలివితేటలు కలది, తల్లిదగ్గరినించి యింటిపెత్తనం తీసుకుంది. ఆదాయానికి సంబంధించిన అన్ని వ్యవహారాలు తను చూసుకుంటుంది. ఇండ్ల బాడుగలు వసూలుచేయడం, షేర్ల లాభాలు రాబట్టుకోవడం, పల్లెల్లో తనకుగల భూమిని అమ్మడానికై వలసిన చర్యలు తీసుకోవడం మొదలయిన పనులు కడు చాకచక్యంతో నడుపుతుంది. గృహనిర్వహణ కుసుమకి ఒప్పజెప్పింది. డబ్బు విషయంలో రామచంద్రయ్య చేస్తున్న మోసాల్ని కనిపెట్టి వాటిని తగు విధంగా అరికట్టింది. విలాసవతి, సుఖసౌఖ్యాల్ని పొందడంలో జాతిమతభేదాలను పాటించదు. సలీంతో ప్రణయలీలలు నడుపుతున్నది. ప్రణయంలో ఎంతదూరం వెళ్ళిందీ తెలియదు. చుంబనాది ప్రక్రియలని దాటితే, ప్రమాదహేతువు. తల్లీ, మేనమామ మనస్తత్వాలకి నిజమైన వారసురాలు. గృహాధిపత్యం వహించి కుటుంబ సభ్యుల గౌరవాన్ని చూరగొంటుంది. వారిని కట్టుబాటులో వుంచుతుంది. విలాసవతిగా ఆనందాన్ని అన్వేషిస్తుంది. సుఖసౌఖ్యాల్ని కోరుతుంది. ఒకవేపు

యాంత్రికంగా ప్రవర్తించగలదు. ఇంకొకవేపు ఒయ్యారాన్ని ఒలక బోయగలదు. బాధ్యతలను గుర్తిస్తుంది. ప్రేయసిగా రాణిస్తుంది.

కుసుమ ప్రేమమయి. కుటుంబ సభ్యుల నందరినీ ప్రేమిస్తుంది, గౌరవిస్తుంది. సేవద్వారా తన ప్రేమని ప్రకటిస్తుంది. ఇతరుల గౌర వాన్ని చూరగొంటుంది. గృహ నిర్వహణ ఒక కళగా అభ్యసించింది. తను కష్టపడి అయినా, ఇతరులకి సౌఖ్యాన్ని సమకూర్చడానికి ప్రయ త్నిస్తుంది. నీళ్ళు ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకారాన్ని దాలుస్తాయి. అదేవిధంగా కుసుమ తన మనఃప్రవృత్తిని ఇతరులకి అనుగుణంగా మలుచుకుంటుంది. ఆదర్శ గృహిణి కాగల లక్షణాలు ఆమెలో కనపడు తాయి. విలాసానికి ఆమె జీవితంలో స్థానం లేదు. సుఖసౌఖ్యాలు ఆమె ఆదర్శం కావు. సేవాధర్మంతో ఒక ప్రేమపాశాన్ని అల్లుతుంది. దానితో కుటుంబసభ్యులనందరినీ బంధిస్తుంది. ఆమె మధుని ప్రేమిస్తున్నది. దాంపత్యజీవితం ఆమె ప్రేమకి లక్ష్యం. ఆనాడు సినిమాలో ఆమెచెయ్యి మధు తన చేతిలోకి తీసుకోగానే, "నా పాణిగ్రహణం చేశారు. అందు వల్ల నా జీవితాంతంవరకూ నన్ను భరించాల్సి వుంటుం"దని విస్పష్ట పరిచింది. తండ్రి స్వైరవిహారం యథేచ్ఛాజీవితం ఆమెను క్రమశిక్షణ వైపుకు మళ్ళించింది. మేనత్త ఏకాగ్రత, యాంత్రికజీవితం ఆమెను ప్రేమైకజీవిగా మార్చింది. నిజం విచారిస్తే ఉభయుల కనువిప్పుని సద్గు ణాలకి ఆమె ప్రతిబింబం.

ఇంక మిగిలింది కిశోర్. అతనింకా కుర్రవాడు. అతన్నిగూర్చి ఆలోచించవలసిన అవసరం కనపడలేదు మధుకి. రామచంద్రయ్య, మోహనాంగి, పనిమనుషులు ఆ కుటుంబరంగంలో చిల్లరపాత్రలు. "చిత్తం" అంటూ ప్రవేశిస్తారు. "చిత్తం" అంటూ నిష్క్రమిస్తారు. కుసుమ ఒక్కతే యావత్తు కుటుంబాన్నీ తన ప్రేమపాశంతో బంధి స్తున్నది. ఆ కుటుంబానికి ఆమెనే కేంద్రం. తననికూడా ఆ కేంద్రమే

ఆకర్షిస్తున్నది. తనని ఆ కేంద్రమే పరిభ్రమింప జేస్తున్నది. ఆ కేంద్రాన్ని తొలగిస్తే గ్రహాలు ఢీకొంటాయి. ప్రళయం చెలరేగుతుంది. విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తులు తమ సరదాకోసం సృష్టించుకున్న విభిన్న ప్రపంచాలు అమాంతంగా కూలిపోతాయి. నాశన మవుతాయి. విభిన్న మనస్తత్వాలు గల విభిన్న జంతువులమధ్య నిజంగా మానవమాత్రురాలిగా మనగలుగుతున్నది ఒక్క కుసుమే.

ఒక రోజున కిశోర్ యింట్లో లేడు. ఆ సంగతి మధు మేడమెట్లు ఎక్కుతుండగా ఒక పనిమనిషి చెప్పాడు. తిరిగి వెళ్ళడమాలేక కుసుమని చూడడమా అనే సంధిగ్ధావస్థలో పడ్డాడు మధు. ఈ మధ్య ఎందుకో కుసుమని చూడకండా ఉండలేకపోతున్నాడు అతను. చూడకపోతే ఆ రోజు అంతా ఏమీ తోచదు - ఏదో వెలితి కనపడుతుంది, మనశ్శాంతి కోసం, తను ఒక వ్యక్తిపైన సంపూర్ణంగా ఆధారపడవలసి వస్తున్నది. ఆమె కనుసన్నల్లో మెలగవలసి వస్తున్నది. ఇది తన జీవితంలో ఒక నూతన అధ్యాయం - ఈ అధ్యాయం కొన్ని నెలల క్రితం ప్రారంభమైంది. పరిస్థితులకి అనుగుణంగా తనని తాను మలచుకోవడం జీవితం తనకు నేర్పింది. దానివల్ల తన వ్యక్తిత్వం చాలావరకు హరించుకుపోయింది. మిగిలిన ఆకాస్తా వ్యక్తిత్వాన్ని ప్రేమ తుడిచివేస్తున్నది. అల్లాంటప్పుడు తను కుసుమని చూడదల్చుకోకపోయినా, చూడకండా వుండగలడా ? మరి "చూడడమా, లేదా" అనే ఈ తర్జనభర్జన ఏమిటి ? అనవసర మనిపించింది మధుకి. ఆ భావం కలగడంతోనే తనకు దారి యివ్వడానికి మెట్లమీద ఒక ప్రక్కన నిలబడివున్న పని మనిషికేసిచూచి, "కుసుమ యింట్లో వుందా ?" అని అడిగాడు. వాడు తన ప్రశ్నకి సమాధానం చెప్పకముందే, "ఉంటే నేను వచ్చానని ఆమెతో చెప్పు"మని అన్నాడు. పనిమనిషి "సరే" నన్నట్లు తలవూపాడు. చరచరా మెట్లు ఎక్కి కిశోర్ గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు మధు, కుసుమ రాక కోసం ఎదిరిచూస్తూ——

కాసేపటికి, టీ ట్రేతో కుసుమ పైకి వచ్చింది. టేబుల్‌పైన ట్రే వుంచి మధుకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చొని "టీ" కలపడం మొదలెట్టింది కుసుమ.

"నళిని యింట్లో వుందా ?"

"లేదు"

"ఎక్కడికి వెళ్ళిందీ ?"

"బర్కత్‌పురంలో ఏదో యిల్లు అమ్మకానికి వుందట. ఆ యింటి విషయంలో మాట్లాడడానికి వెళ్ళింది."

"ఉన్న యిండ్లు చాలకనా, ఇంకా యిండ్లు కొనడం ?"

"ఆ యిల్లు చాలా అందంగా వుందట. చూడడానికి నన్నుకూడా రమ్మంది. కాని నేను వెళ్ళలేదు."

"ఎందుచేత ?"

"సాయంత్రం ఆరుగంటలకి నాకు ఎక్కడికీ వెళ్ళాలని వుండదు."

కుసుమ టీ కలిపి మధుకి ఒక కప్పు అందించింది. తను ఒక కప్పు తీసుకుంది. మధు టీ చప్పరిస్తో తిరిగి సంభాషణలోకి దిగాడు.

"ఎందువల్లనని అడగవచ్చునా ?"

"నేను చెప్పదల్చుకోనప్పుడు, మీరు అడిగిమాత్రం ప్రయోజనం?"

"పోనీ నేను చెప్పనా, ఎందువల్లనో ?"

"అక్కరలేదు."

"అక్కరలేదంటే కుదురుతుందా ?"

"కుదరక ఏం చేస్తుంది ?"

"ఏం చేస్తుందా ? చెబుతాను వుండు" అంటూ మధు చేతిలోని కప్పు టేబుల్‌పైన పెట్టి, టేబుల్ చుట్టూ తిరిగి కుసుమవేపుకు వెళ్ళాడు. మధు దగ్గరికి వెళ్ళడంతోనే కుసుమకూడా తన కప్పు టేబుల్‌పైన పెట్టి

అనాలోచితంగా లేచి నిలుచున్నది. అమాంతంగా కుసుమని తన చేతులతో చుట్టివేసి, మధు ఆమె పెదవులపైన దీర్ఘంగా ముద్దుపెట్టుకున్నాడు.

"ప్రతిరోజూ సాయంత్రం ఆరుగంటలకి ఒక అమ్మాయి, ఒక అబ్బాయి రాకకోసం నిరీక్షిస్తుంది" అన్నాడు మధు తన పెదవుల్ని కుసుమ పెదవులనించి విడదీస్తూ—

ఆ వాక్యానికి ప్రపంచంలోని అరుణిమలన్నీ వచ్చి కుసుమ చెక్కిళ్ళలో దాక్కున్నాయి.

"ఛీ! అంతా అబద్ధం" అంది కుసుమ సిగ్గుతో తలవాల్చుకుంటూ.

ఆ క్షణంలో కుసుమ ఎంతో అందంగా కనపడింది మధుకి - ఆ సోయగానికి వివశుడై, ఆమె మెడమీద, నొసటిమీద, చెక్కిళ్ళపైన, పెదవులపైన ముద్దుల వర్షాన్ని కురిపించాడు అతను.

"పదినె కొత్త యిల్లు ఎవరిపేరట కొంటున్నదో తెలుసా?" అని అడిగింది కుసుమ చిన్నపిల్లకుమల్లే, వర్షంకురిసి కాస్త వెలసిన తరువాత.

"ఏమో నాకేమి తెలుసు?" అన్నాడు పిల్లలధోరణిలోనే.

"చెప్పుకోండి చూద్దాం?" అని అడిగింది కుసుమ ఏదో పొడుపు కథ విడదీయమన్నట్లు.

"కిశోర్ పేరట" అన్నాడు మధు జవాబుగా - ఎవరిపేరట కొంటున్నదో తెలిసికూడా తెలియనట్లు నటిస్తూ.

"కానేకాదు" అంది కుసుమ చిన్నపిల్లలాగ.

"నళినిపేరట" అన్నాడు మధు కావాలని తప్పుదారిన వెడుతో—

"ఓడిపోయారు, ఓడిపోయారు" అని చప్పట్లుకొడుతో గల్లంతు చేసింది కుసుమ.

"సరే ఓడిపోయాను - ఇంక నువ్వుచెప్పు" అన్నాడు మధు, ఆ ఓడిపోవడంలో గల మధురిమని అనుభవిస్తో.

"మీ పేరట" అంది కుసుమ, చిలిపిగా మధు కళ్ళల్లోకి చూస్తో.

"నా పేరటా ?" అని అడిగాడు మధు, ఆశ్చర్యచకితుడవుతూ.

"ఊఁ!" అంది కుసుమ గోముగా.

"నళిని నా పేరట యిల్లు కొనడమేమిటి ? నీకేమైనా మతిపోలేదు గద ?" అని అన్నాడు మధు, కుసుమ ధోరణికి కొద్దిగా విసుకెత్తుతూ.

"నా పేరట యిల్లు కొంటే, మీ పేరట కొన్నట్టుకాదా ?" అని అంది కుసుమ, మధు విసుకెత్తిపోవడం ఇట్టే గ్రహిస్తో.

కుసుమ తనపై కనపరచిన శ్రద్ధాభక్తులకి మధు మంత్రముగ్ధుడైనాడు. ఆ విశ్వాసానికి తను అర్హుడేనా అనే సంశయంకూడా కలిగింది అతనికి.

"ఆ యింటికి పేరుకూడా ఆలోచించి పెట్టాను" అంది కుసుమ మధుకేసి చూస్తో.

"ఆ పేరేమిటో చెప్పు - విని సంతోషిస్తాను" అన్నాడు మధు అనాలోచితంగా.

"మధువనం" అని చెప్పింది కుసుమ సిగ్గుతో తల వాలుస్తూ.

"ఆ పేరు పెట్టడానికి నేను ససేమిరా ఒప్పుకోను" అని అన్నాడు మధు కొంచెం కఠినంగానే-

"ఇల్లు నాది. నా యిష్టమొచ్చిన పేరు పెట్టుకుంటాను" అంది కుసుమ, తీర్పు చెబుతున్న ధోరణిలో.

"ఇంతకుముందే ఆ యిల్లు నాది అన్నావు. ఇప్పుడు నీది అంటున్నావు. ఇంతకీ ఎవరిది ఆ యిల్లు ?" అని అడిగాడు మధు సూటిగా.

"ఆ యిల్లు మీదీకాదు, నాదీకాదు" అంది కుసుమ జవాబుగా.

"మరి ఎవ్వరిది ?" అని మధు అదేప్రశ్న రెండవసారి అడిగాడు.

"మధుది" అంది కుసుమ కొద్దిగా సిగ్గుపడుతూ.

"ఆ మధు ఎవ్వరు?" అని ప్రశ్నించాడు మధు, కుసుమని.

"ఒక అబ్బాయి" అని కుసుమ చిలిపిగా సమాధానం చెప్పింది.

"ఆ అబ్బాయి, ఈ అమ్మాయికి ఏమవుతాడు?" అని అడిగాడు మధు కొంటెగా—

"ఏమవుతాడు? ఏమీ కాడు. మహా అవుతే రాగాపోగా రాయి అవుతాడు" అని అంది కుసుమ, కళ్ళల్లోని చిలిపితనాన్ని జిగేలు మనిపిస్తూ——

"ఆ రాతికోసం యిల్లుకూడా కొనడం దేనికి?" అని అడిగాడు మధు, ఆ సంభాషణలోని మధురిమని ఉంచుంచి అనుభవిస్తూ—

"ఊరికేనే" అంది కుసుమ ఏమీ సమాధానం దొరకక.

"పోనీ నేను చెప్పనా?" అని అన్నాడు మధు, ఆ సంభాషణని మధ్యలో వదిలివేయడం యిష్టంలేక.

"అక్కరలేదు - కాగా మిమ్మల్ని ఎవ్వరూ అడగలేదు" అంది కుసుమ తెచ్చిపెట్టుకొన్న కోపాన్ని అభినయిస్తూ—

"అడగకపోయినా నేను చెప్పదలచుకున్నాను" అని అన్నాడు మధు, తన నిశ్చయానికి తిరుగు లేదన్నట్లు.

"నేనుమాత్రం వినదలచుకోలేదు" అని అంది కుసుమ, తన నిశ్చయాన్ని కూడా ప్రకటిస్తూ.

"వినదల్చుకోకపోతే మానేసెయ్యి - నేను చక్కగా ఆ గోడకు చెప్పుకుంటాను" అని అన్నాడు మధు పసిపిల్లవాడికిమల్లే.

"గోడా, గోడా ఎవ్వరేమి చెప్పినా నువ్వేమీ వినకు" అంది కుసుమ గోడకి ఒక వ్యక్తిత్వాన్ని ఆపాదిస్తూ.

"గోడని శాసించడానికి నీకేమి అధికారముంది?" అని అన్నాడు మధు కయ్యానికి కాలుదువ్వుతో.

"చెప్పడానికిమాత్రం మీకేమి అధికారముంది?" అని తిప్పి కొట్టింది కుసుమ.

"ఇదిగో చెప్పేస్తున్నా" నన్నాడు మధు చివరమాటగా.

"ఇదిగో నేను వెళ్ళిపోతున్నా" నంది కుసుమ పాదరసానికిమల్లే అక్కడినించి జారుకుంటూ.

వెంటనే మధు కుసుమ దారిని అడ్డగించాడు. వదులువదులుగా ఆమె చుట్టూ రెండు చేతులువేసి, ఆమె మొహంలో తన మొహాన్ని చేర్చి "ఆ అబ్బాయి, ఆ అమ్మాయి మొగడు" అని అన్నాడు మధు గుసగుసగా.

"ఛీ, ఫో" అంటూ రెండు చేతులతో తన రెండు కళ్ళనీ మూసుకుంది కుసుమ, తన చెక్కిళ్ళలోని అరుణకాంతుల్ని పైకి కనపడకుండా అదిమిపడుతో.

కుసుమ మొహంమీద చేతుల్ని తొలగించకుండానే కుప్పగా ఆమెని తన హృదయానికి హత్తుకొని, నొసటిమీద తేలికగా ముద్దు పెట్టుకొని, గట్టిగా కౌగిలి బిగించాడు మధు, ఆ సంతోషాతిశయంలో... గట్టిగా.... ఇంకా గట్టిగా....

కుసుమ ముంజేతులు రెండు శరీరాల మధ్య నలిగిపోవడంతో, ఆమె చేతుల గాజులన్నీ అమాంతంగా చిట్లాయి. కొన్ని గాజుపెంకులు ఆమె చేతులకి గుచ్చుకున్నాయి. ఒక గాజుపెంకు మధు నెహ్రూషర్టు, బనియన్‌లలోంచి దూసుకెళ్ళి అతని వక్షస్థలానికి గుచ్చుకుంది. "అబ్బా" అని మధు తన కౌగిలి వదిలివేశాడు. వెంటనే కుసుమ మధు వక్షస్థలం నించి కొంచం ఎడంగా జరిగింది. ఆమె నొసటిలోని కుంకుమబొట్టు మధు బుజానికి రాచుకుపోయి చెరగిపోయింది. ముంజేతులకి గాజు పెంకులు గుచ్చుకుపోయి అవి రక్తం చిమ్ముతున్నవి. కుసుమ మధుకి ఎడంగా జరగడంతోనే ఒక గాజుపెంకు అతని వక్షస్థలానికి గుచ్చు

కొని వుండడం గమనించింది. నెమ్మదిగా ఆ పెంకుని తన రక్త
సిక్తమైన కుడిచేతితో లాగివేసింది. మధువక్షస్థలంలోంచి కొద్దిగా
రక్తం చిమ్ముకొచ్చి అతని నెహ్రూషర్ట్‌ని కొంచెం తడిపింది.
షర్ట్‌పైన నయాపైసంత రక్తం మరకపడింది. కుసుమ తన వక్ష
స్థలంనించి గాజుపెంకు లాగుతుండగా మధువృష్టి ఆమె నొసటి
పైన పడింది. బొట్టు చెరిగివుండడం గమనించి అతని మనస్సు
కలుక్కుమంది. గాజుపెంకులు క్రిందపడి గలగల మని శబ్దం
చెయ్యడం ఆ యిద్దరిలో ఎవ్వరికీ వినపడలేదు. కుసుమ తన బోసి
చేతుల్ని చూసుకొని ఖిన్నురాలైంది. రెండు చేతులకీ గుచ్చుకున్న గాజు
పెంకుల్ని నెమ్మదిగా తీసేసి, చిమ్మిన రక్తాన్ని కొంగుతో తుడుచుకుంది.
ఎందుకో తన బోసిచేతుల్ని మధుకి కనపడడం ఆమెకు కష్టంగా
తోచింది. వెంటనే ముంజేతులపైన తన కొంగు కప్పేసుకుంది. మనస్సు
పరిపరివిధాలా పోతున్నది. ఏదో అపశకునం జరిగిందని మనస్సు పదే
పదే చెబుతున్నది. ఎందుకో గట్టిగా ఏడ్చివేయాలనిపించింది కుసుమకి.
ఎందుకో తను రెండుగా చీలిపోతున్నట్లు తోచింది కుసుమకి - ఒక
ముక్కక వెంటనే మెదడుగా మారింది. రెండవ తునక హృదయంగా
రూపొందింది. రెండింటి మధ్య ఏదో సంఘర్షణ జరుగుతున్నది.
"ఇంక మధు నీకు దక్కడు" అని మెదడు మూల్గుతున్నది. "ఛీ, నోరు
మూసుకో అపశకునాలు పలుకకు" అని హృదయం చీత్కారం చేసింది.
"నిజం చెప్పడంవల్లనా ఈ నిష్ఠూరం ?" అని మెదడు వినీవినపడనట్లు
ప్రశ్నించింది. "నీ మొహం, నీకు నిజం ఏమితెలుసునని చెప్పడానికి ?"
అని హృదయం విసుక్కున్నది. "కొంచెం పరిస్థితుల్ని నా కళ్ళతో
పరిశీలించు, అప్పుడు నిజం నీకే గోచరిస్తుంది" అని తిరిగి మెదడు
అనునయ వచనాల్ని పలికింది. "గతానుగతికంగా ఆలోచించి భావిని
గూర్చి ఊహిస్తావు. అల్లా జరగడం అసంభవమని చెబితే బొత్తిగా

వినవు. ఇంక నీతో నాకు పొత్తు కుదరదు. ఇప్పటినించీ నీవు నాతో మాట్లాడకు" అని చీదరించుకుంది హృదయం. మెదడు విధిలేక మౌనం వహించింది. కాని ఎందుకో ఆ వెంటనే ఏదో ముప్పు వాటిల్లక తప్పదని హృదయానికి తోచింది. "మమతలు ఎందుకు పెంచుకున్నానా?" అని విచారించింది. బాధపడింది. రానున్న ముప్పుని తలచుకొని నిలువునా క్రుంగిపోయింది.

కుసుమ బొట్టు చెరగడం గాజులు చిట్లడంతో మధుకి ఏదో చేదు మింగినట్లైంది. కుసుమతో తనకు ఇంక వివాహం పొసగదని తోచింది. మృదుమధురంగా పాడుతున్న కంఠం జీరపోయిన ట్లనిపించింది. తేనెతో నిండిన కుండలో ఒక నీటిబొట్టు పడ్డట్లైంది. క్షీర పాత్రలో నిమ్మరసం చిలికినట్లు తోచింది.

ఒకరు ఆలోచిస్తున్న విషయం ఇంకొకరికి తెలియదు. కాని ఉభయులూ ఒకరికి తెలియకుండా ఇంకొకరు, ఒకే ధోరణిలో ఆలోచిస్తున్నారు. ఆలోచనలు ఒకటే అయినా శరీరాలు విడిపోయాయి. హృదయాలు వేరైనాయి. ఆత్మలు దూరమైనాయి.

ఉభయుల హృదయాల్లో ఒకే క్షణంలో ఒకే సంశయం తలెత్తింది.

"ఒకరికి ఇంకొకరం దక్కుతామా?" అనేదే ఆ సంశయం.

తమ సంశయాన్ని గూర్చి ఏ ఒక్కరూ మాట్లాడలేదు. ఎందుకో మాట్లాడడమంటేనే భయంగా వుంది.

ఉభయులమధ్యా నిశ్శబ్దం గడ్డకట్టుకుపోయింది.

కాని ఎంతకాలమని మాట్లాడకుండా వుండగలరు?

ఎంతకాలమని నిశ్చేష్టులై నిలచినచోటునే నిలబడిపోగలరు?

ఏదో ఒకటి మాట్లాడాలి - ఇంక మాట్లాడక తప్పదు.

ఏ విషయం అయితేనేం - ఏదో ఒక విషయం.

పోనీ నళినినిగూర్చి మాట్లాడితే? బాగానే వుంటుందని తోచింది మధుకి.

"నళిని నలింతో హద్దులు మీరి ప్రవర్తించడం లేదుకదా?" అని అడిగాడు మధు కుసుమని. అతని కంఠం అతనికే బోలుబోలుగా వినిపించింది.

"మనం హద్దులు మీరామా?" అని ఎదురుప్రశ్న వేసింది కుసుమ.

"............"

"వదినె హద్దుమీరి ప్రవర్తించడం అసంభవం" అంది కుసుమ బల్లగుద్దినట్లు సమాధానం చెబుతూ.

"వాళ్ళ ప్రణయం పైపై మెరుగులవరకే పరిమితంగా ఉందంటావా?" అని అడిగాడు మధు తిరిగి ఏమీ తోచక.

"ఆ పైపై లాంఛనాలుకూడా పూర్తిగా జరిగాయో లేవో?" అంది కుసుమ సంశయం వుట్టిపడుతున్న కంఠంతో. హు

"ఇంక నేను వెళ్ళొస్తా" నని అన్నాడు మధు. కాని హత్తు కంఠంలో ఆ ఎడబాటు ఏమీ ధ్వనించలేదు. డు చేతుల్లోని

"సరే" అంది కుసుమ యాంత్రికంగా. గారిస్తే అది ఒక

ఆనాడు మధు తన గదికి వెడుతున్నప్పుడు ఏ భావముగానీ, మధు ఏ ఆలోచనా కలగలేదు. మెదడు ఖాళీగా వుండింది. హృది మధు శూన్యంగా కనపడింది. సంతోషంగాని విచారంగాని కలగలేదు. నళిని గాని కుసుమగాని జ్ఞాపకం రాలేదు. వాతావరణాన్ని ఏదో స్తబ్ధత ఆవరించింది. హృదయాన్ని ఏదో మొనాటనీ చుట్టేసింది. ఒకటే మొనాటనీ - ఎడతెరిపిలేని మొనాటనీ.

★ ★ ★

౬

కుసుమ గాజులు చిట్లిన నాటినించీ మధుకి జీవితంలో అభి
రుచి తగ్గింది. ఆసక్తి క్షీణించింది. పైగా రోతపుట్టింది. ప్రతిరోజూ
ఉమామహేశ్వరరావుగారి యింటికి గానుగెద్దులాగా వెడుతూనే ఉన్నాడు.
కిశోర్ యింట్లో వున్ననాడు చదువు చెబుతున్నాడు. లేనినాడు లేదు.
రోజూ సాయంత్రం టీ వస్తూనే వుంది. టీ పనిమనిషి తీసుకువస్తూనే
ఉన్నాడు. టీ కళ్[illegible]పడడం, తాగడం భారంగా వుంది. టీతోపాటు
బిస్కట్లుకూడా వస్తున్నాయి. కాని ఎందుకో మధు బిస్కట్లు ముట్టు
కోవడం లేదు. టీకూడా తాగినన్నాడు తాగుతున్నాడు. లేనినాడు లేదు.
కిశోర్ యింట్లో లేనినాడు వెళ్ళిందే తడవుగా "కిశోర్ యింట్లోలే" దని
కబురు వస్తున్నది. తను వెంటనే కాళ్ళీడ్చుకుంటూ తన గదికి వెళ్ళి
[illegible]తున్నాడు. కుసుమ బొత్తిగా కనపడడం మానేసింది. ఎందుకో నళిని
స్తున్నా[illegible]నపడడంలేదు. తనకికూడా కుసుమనిగానీ నళినినిగానీ చూడా
హృదయ[illegible]ం బుద్ధి పుట్టడం లేదు. తనలో కలిగిన ఈ మార్పుకి
ఉభయ[illegible] ప్రత్యేకంగా కారణ మేమీ కనపడడం లేదు. ఏదో
తలెత్తింది. [illegible]టన జరిగింది. అది దైవికమని చెప్పక తప్పదు. ఆ సంఘ
విధంగా జరుగుతుందనికూడా ఎవ్వరూ ఊహించలేదు. దానికి
కారకు లెవ్వరని నిలబెట్టి గట్టిగా అడిగితే, ఎవ్వరూ కాదని నిక్కచ్చిగా
చెప్పవలసి వస్తుంది. ఏదో జరగకూడని సంఘటన అమాంతంగా
జరిగింది. దానితో మధు కుసుమల హృదయాల్లో ఒక సంశయం పొడ
సూపింది. "తమ అనురాగం ఫలప్రదమవుతుందా" అని? కాదని ఎందుకో
వాళ్ళకి ఆ సంఘటనతో తోచింది. రెండు కెరటాలలాగ పెనవేసుకున్న
ఆ హృదయాలు వెంటనే విడిపోయాయి. పాయలై పారాయి. ఆశ

యాలు భేదించాయి. గమ్యస్థానాలు విభిన్నమైనాయి. ఏదో ఒక అప
శకునం జరిగింది. దానితో వికసించిన హృదయాలు అమాంతంగా
ముడుచుకు పోయాయి. విప్పుకున్న మనస్సులు చప్పున ముకిళించుకు
పోయాయి.

మానవ ప్రకృతి చాలా విచిత్రమైంది. ఒక వ్యక్తి దేవుడు లేడని
గట్టిగా వాదిస్తూ దారిలో ఏదైనా దేవాలయం కనపడడంతోనే ఎందుకైనా
మంచిదని ఒక నమస్కారబాణం పడేస్తాడు. దేవుడున్నాడనే విశ్వాసం
తాత్కాలికంగా కుదరడంవల్ల కాదు, అతను ఆ పనిచేయడం. తరతరాల
నించి సంక్రమించిన విశ్వాసం అతన్ని ఆపని చేయిస్తున్నది. హేతు
వాదం అక్కడ ఏమాత్రం పనికిరాదు. హేతువాదందారి హేతువాదానిది.
విశ్వాసందారి విశ్వాసానిది. ఆ రెంటింటికీ ఎక్కడా సమన్వయం కుద
రడం లేదు. సమన్వయం కుదరనంతవరకు మానవుల బలహీనతలు
చిత్తాకర్షణీయంగా వుంటాయి.

రెండు చేతులతో రెండు కళ్ళు మూసుకున్న కుసుమని తన బాహు
బంధంలో గట్టిగా బంధించివేసి ఆమెని తన హృదయానికి హత్తు
కుంటాడు మధు. దానితో ఆమె బొట్టు చెరిగిపోతుంది. రెండు చేతుల్లోని
గాజులు ఒక్కటి మిగలకుండా చిట్లిపోతాయి. నిజం విచారిస్తే అది ఒక
హటాత్సంఘటన. హేతువాదాన్ని బట్టిచూస్తే, దానికి మనంగానీ, మధు
కుసుమలుగానీ ఎట్టి ప్రాముఖ్యతకూడా యివ్వకూడదు. కాని మధు
కుసుమలు ఆ సంఘటనకి తగు ప్రాముఖ్యత యివ్వకుండా వుండలేక
పోయారు. బొట్టు చెరిపివేయడం, గాజులు పగలగొట్టడం, ఒక స్త్రీ
భర్త చనిపోయినప్పుడు జరుపబడుతున్న కర్మకాండా విశేషము. దీనిని
బట్టి ఒక స్త్రీ బొట్టు చెరిగిపోవడం జరిగితే ఆమె గాజులు ఒక్కటి
మిగలకుండా పగిలిపోవడం సంభవిస్తే ఆ స్త్రీ భర్త తప్పక చనిపోతాడనే
మూఢవిశ్వాసం సర్వత్రా వ్యాపించింది. ఇది హఠాత్సంఘటన, దీనికి

ఎట్టి ప్రాముఖ్యత యివ్వకూడదని హేతువాదం ఒక చెంపన నొక్కి చెబుతున్నా మధు కుసుమలు ఆవాణిని లక్ష్యం చేయకండా తరతరాల నించీ మానవ హృదయంలో గూడుకట్టుకుపోయిన మూఢవిశ్వాసానికి తల ఒగ్గారు. కుసుమని పెళ్ళిచేసుకుంటే తను మరణిస్తానేమోననే భయం మధుకి కలిగింది. మధుని వివాహంచేసుకుంటే తన తల్లిలాగా తనకికూడా వైధవ్యం ప్రాప్తిస్తుందేమోననే భయం కుసుమ హృదయంలో పొడనూపింది. తమ హృదయాల్లో జనించిన సంశయాన్నిగూర్చి ఒక రితో ఇంకొకరు ఏమాత్రం చెప్పుకోలేదు. తమ సంశయాన్ని తమ హృదయంలోనే అణచివేసుకున్నారు. ప్రేయసీ ప్రియుల తమ సంబంధం ఏమాత్రం పొసగజాలదని తమలో తాము ఒక నిశ్చయానికి వచ్చారు. దానితో ఒండొరులు కలుసుకోవడం మానివేశారు. తిరిగి కలుసుకుంటే తమ ప్రేమ ప్రవర్ధమానమై తన వైధవ్యానికి దారితీస్తుందని కుసుమ భావించింది. ప్రేమ పర్యవసానంగా తన మరణ మాసన్నమౌతుందని మధు ఊహించాడు. ఈ సంఘటనవల్ల యిరువురి బలహీనతలూ పైకి ఉబికి వచ్చాయి. ఆ బలహీనతలు ఆ యిరువురి ప్రేమని విషాదాంతంగా మార్చాయి.

ఈ ధోరణిలో మధుగానీ కుసుమగానీ ఆలోచించలేదు. మొత్తం మీద విధిబలీయమైంది.

ఏది ఏవిధంగా జరుగనుందో అది ఆ విధంగా జరిగితీరుతుంది.

మధుకి తన జీవితం అర్థరహితంగా తోచింది.

లోకంలో కొందరు కారణజన్ములు అవతరిస్తారు. వాళ్ల జీవితంలో ఏదో మహత్కార్యాన్ని సాధిస్తారు. వాళ్ళలో ఏదో విశిష్టత ఉంటుంది. ఏదో ఘనత ఉంటుంది. తనలో ఏమి విశిష్టత వుందని? తనలో ఏమి ఘనత వుందని? మరి తనెందుకు పుట్టినట్లు? తన పుట్టుక వల్ల ఈ ప్రపంచానికి ఏమి ఒరుగుతున్నదని? తను గొప్ప మేధావా?

తన మేధాశక్తితో ప్రపంచాన్ని సముద్ధరించడానికి ? అసలే కాదు. తను గొప్పకళాకారుడా ? తన కళాఖండాలతో ప్రపంచాన్ని ఆనందమయం చేయడానికి ? తను కళాకారుడు అంతకన్నా కాదు. తను గొప్ప మత ప్రవక్తా ? తన మతప్రబోధంతో లోకాన్ని నీతివంతం చేయడానికి? తను మత ప్రవక్త అసలేకాదు. తను ఒక మామూలు మానవుడు. తనలో ఏ శక్తి సామర్థ్యాలు లేవు. మరి తన పుట్టుకవల్ల ప్రయోజనం ? ఏమీ లేదు. మరి తన పుట్టుకకి అర్థం ఏమిటి ? ఏమీలేదు. తన పుట్టుక ఒక దుస్సంఘటన. అర్థంలేకండా పుట్టాడు. అర్థరహితంగా జీవిస్తున్నాడు.

నిజం విచారిస్తే, జీవితానికి ఒక అర్థం ఆపాదించడంకూడా మూర్ఖలక్షణమేమో ?

ద్వంద్వాలకి అతీతమైన జీవితం ఏదైనా వుందా ? ఉంటే అది మనకు ఎల్లా సాధ్యపడుతుందనే జిజ్ఞాస మధులో రేకెత్తింది. ఎంత ఆలోచించినా శాశ్వతానందాన్ని సమకూర్చే జీవితవిధానమేదీ తట్టలేదు మధుకి. పోనీ, ముక్కుమూసుకుకూర్చుంటే తడుతుందా ? ఆ ముక్కుమూసుకుకూర్చునే విధానమేమిటో తనకు తెలియదు. పోనీ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తే ? సరిఅయిన గురువు లభించాలి. ఈ విశాల విశ్వంలో తనకు సరిఅయిన గురువు ఎక్కడ దొరుకుతాడని ? పోనీ గురువుకోసం అన్వేషిస్తే ? యావజ్జీవితం అన్వేషణలోనే గడచిపోతే ? ఈ జన్మలో శాశ్వతానందం లభించనప్పుడు, దానికోసం అన్వేషించడంమాత్రం దేనికి ? భవిష్యత్ జన్మలకోసమా ? భావినిగూర్చిమాత్రం ఇప్పుడు ప్రాకులాడడం దేనికి ? ప్రస్తుతం ఆలోచింపదగ్గ విషయం వర్తమానంఒక్కటే.

జీవితాన్ని ఉన్నది ఉన్నట్లు ఎందుకు పరిగ్రహించకూడదు ?

జీవితాన్ని ఆశలతో నింపుకొని, చివరికి నిరాశలతో క్రుంగిపోవడం దేనికి ?

జీవితాన్ని ఆనందమయం చేసుకోవడానికి ప్రయత్నించి, విఫలత పొంది చివరికి దుఃఖభూయిష్ఠం చేసుకోవడం దేనికి?

జీవితాన్ని క్షణికోత్సాహాలకు గురిచేసి, చివరకి నిరుత్సాహాలతో నిలువునా నీరవడం దేనికి?

జీవితాన్ని దానిదారిన దానిని వెళ్ళనివ్వాలి. దానిదగ్గరినించి ఏమీ ఆశించవద్దు. ఏమీ కోరవద్దు. జీవితాన్నిగూర్చి ఆలోచించినాకొద్దీ జీవితం భయంకరంగా తోచింది మధుకి. దాన్నిగూర్చి ఆలోచించడం అనవసరమనే నిశ్చయానికి వచ్చాడు అతను. దానిదారిని అది వెడుతూ అది అందించే సుఖసౌఖ్యాలని మహాప్రసాదమని స్వీకరించాలి. ఆ సుఖసౌఖ్యాల్ని తనివితీరా అనుభవించాలి. అది మనపైకి కష్టాల్ని విసురుతే సాధ్యమైనంతవరకు మనం వాటిని తప్పించుకొని తిరగాలి. తప్పించుకోలేని పరిస్థితుల్లో వాటికి లొంగిపోవాలి. దుఃఖం మన పాలటబడితే అదేపనిగా దానినిగూర్చి విచారించకూడదు. మనకన్నా ఎక్కువ దుఃఖాన్ని అనుభవిస్తున్నవాళ్ళని చూచి ఊగటచెందాలి. ఇతరుల దుఃఖంలో మనది ఎన్నోవంతని మనని మనం ఓదార్చుకోవాలి. సున్నిత హృదయాలకి ఈ ప్రపంచంలో స్థానంలేదు. బండబారిపోయి బ్రతకడమే మనం ఈ జీవితంనించి నేర్చుకోదగిన గుణపాఠం.

జీవితాన్ని గూర్చి ఏమీ ఆలోచించకూడదని ఒక నిర్ణయానికి వచ్చికూడా తిరిగి ఆలోచించకండా వుండలేకపోయాడు మధు. ఆలోచించడం నిరర్థకమని తెలిసికూడా మనం ఆలోచించడం మానుకోలేము. ఏ పని చేయకూడదనుకుంటామో అదేపని మనం మళ్ళీమళ్ళీ చేస్తుంటాము. అందులోనే మన అశక్తత మన బలహీనత యిమిడివుంటుంది. ఆ ఘట్టంలోనే మానవజీవితం మనకు విచిత్రంగా కనబడుతుంది.

ఎప్పటివలెనే మధు ఒకనాటి సాయంత్రం ఉమామహేశ్వరరావుగారి యింటికి వెళ్ళాడు. ఆ రోజున ఆ యిల్లు ఎందుకో కళావిహీనంగా

కనపడింది. "ప్రమాదమేమీ జరుగలేదుకదా?" అని మధు హృదయం ఆరాటపడింది. వాకిలిగుమ్మం బార్లా తెరిచివుంది. ఇంట్లో ఎవ్వరూ కనపడలేదు. "కారణం ఏమిటా?" అని ఆలోచిస్తూ అతను లోపలికి వెళ్ళాడు. మెట్లదగ్గర ఒక పనిమనిషి కనపడ్డాడు. తనని చూడడంతోనే "రాములమ్మగారు రాత్రి చనిపోయారు" అని చెప్పాడు. మధు ఆసంగతి నమ్మలేకపోయాడు. "రాములమ్మగారా?" అని ఆశ్చర్యంగా అడిగాడు. "అవునని" సమాధానం చెప్పాడు పనిమనిషి. నిన్నసాయంత్రం తను ట్యూషన్‌కి వచ్చినప్పుడు వారు జబ్బుగా వున్నారనికూడా ఎవ్వరూ తనతో అనలేదు. కిశోర్ కూడా యథాపూర్వం చదువుకున్నాడు. అతను కూడా ఏమీ చెప్పలేదు. "జబ్బేమిటి?" అని మధు పనిమనిషిని అడిగాడు. "ఏమీలేదు గుండె ఆగిపోయిం"దని చెప్పాడు పనిమనిషి. మధుకి తన గుండె ఆగిపోయినంతపని జరిగింది. ఈమధ్య రాములమ్మగారు హృద్రోగంతో బాధపడడం తనకు తెలుసు. దానివల్ల ఇంత ప్రమాదం జరగవచ్చునని అతను ఎన్నడూ ఊహించలేదు. "ఎల్లా మరణించారు?" అని అడిగాడు మధు ఉండబట్టలేక. "రాత్రి ఎనిమిదిగంటలకి గుండెలో ఏదో నొప్పని అన్నారు. కాసిని మంచినీళ్ళు యివ్వమని కుసుమమ్మని అడిగారు. మంచినీళ్ళు తెచ్చియిచ్చేలోపున కన్నుమూశారు" అని రాములమ్మగారి మరణానికి సంబంధించిన వివరాలు చెప్పాడు పనిమనిషి. చప్పున మెట్లెక్కి మేడమీదికెళ్ళాడు మధు. పనిమినిషి వెళ్ళిపోయిన సంగతి అతను గమనించలేదు. పైన ఎక్కడో నళినిగది వుంది. కాని ఏ గదో సరిగ్గా తెలియదు. పనిమనిషికోసం వెనక్కితిరిగి చూచాడు. పనిమనిషి కనపడలేదు. ఇప్పుడు నళినిగది కనుక్కోవడం ఎట్లా? కిశోర్‌గదికి ఎదురుగావున్న గదుల్లోకి వెడితే నళినిగది కనపడకపోదు. కాని తను ఆ గదుల్లోకి ఎన్నడూ వెళ్ళలేదు. ఇప్పుడు వెళ్ళడమా మానడమా అనే తర్జనభర్జనలో పడ్డాడు మధు. ఎన్నడూ వెళ్ళనిది

నళిని గదిలోకి హఠాత్తుగా వెడితే బాగుంటుందా అనే ఆలోచన కలిగింది మధుకి. కాగా తనకూ నళినికి అంత సాన్నిహిత్యం లేదు. వెడితే ఏమనుకుంటుందో? పోనీ కబురుచేసివెడితే? లోపలికి కబురు పంపించ డానికి ఎవ్వరూ పనిమనుషులు కనిపించడంలేదు. పైకివచ్చి నిలబడితే పనిమనుషులు కనపడతారా? క్రిందికివెళ్ళి వాళ్ళకోసం చూడాలిగాని. ఎందుకో అక్కడినించి తిరిగి క్రిందికి వెళ్ళడానికి మనస్సు ఒప్పలేదు మధుకి. నళినిమాత్రం ఏమనుకుంటుంది? తన దుఃఖాన్ని దిగమింగి ఇతను లోపలికి ఎందుకు వచ్చాడని అనుకుంటుందా? అసాధ్యం. ఆ విషయమే ఆమెకు తట్టదు. పోనీ ఎవరైనా వచ్చేవరకు కాసేపు ఆగితే? అప్పుడు నళినిగది ఎక్కడుందో కనుక్కోవచ్చు. కాగా లోపలికి కబురుచెప్పి పంపించవచ్చు. ఆగదల్చుకుంటే ఇక్కడ నిల బడడం దేనికి? వెళ్ళి కిళోర్ గదిలో కూర్చుంటే? బాగానే వుంటుంది. ఆ భావం కలగడంతోనే మధు వెళ్ళి కిశోర్ గదిలో కూర్చున్నాడు. ఎంతకీ ఎవ్వరూ కనపడరు. కూర్చొని కూర్చొని విసుగేసింది. ఇంక లాభం లేదనుకున్నాడు. ఎవ్వరేమన్నాసరే లోపలికి వెళ్ళి నళినిని పలకరించి వెడదామనుకున్నాడు. నాలుగు ఉపశమన వాక్యాలు చెబుదామనుకున్నాడు. మనిషి నిండుదుఃఖంలో వుంది. కొంతకాలంనించి ఆమె తనకు కనపడడంలేదని తను తన ధర్మాన్ని వదులుకుంటాడా? ఆమెని పరా మర్శించడం మానుకుంటాడా? ఎవరికైనా దుఃఖమే. దుఃఖం నాలుగు సానుభూతివచనాలను కోరుతుంది. ఆ సానుభూతివచనాలని చెప్పకండా వెళ్ళడం తనకు న్యాయంగాని ధర్మంగాని కాదు. పాపం నళిని ఎంత దుఃఖపడుతున్నదో? రాములమ్మగారి మరణంతో నళిని ఒక్క తల్లిని మాత్రమే కోల్పోలేదు. ఇంటికి పెద్దదిక్కుని కూడా కోల్పోయింది. ఉమామహేశ్వరరావుగారు ఉన్నా లేనిసమానమే. వారికి ఈ యింటితో సంబంధం ఏమిటి? అక్కగారు పోయిన దుఃఖంలో వారు మరికొన్ని

సీసాలు ఖాళీచేసి వుండవచ్చు. ఇంకా చేస్తూనే వుండవచ్చు. అంతే. దానితో తమ బాధ్యత తీరిందని అనుకుంటూ వుండవచ్చు. ఏది ఏట్లున్నా ఆ యింటికి ఘోరవిపత్తు వాటిల్లింది పెద్దదిక్కు లేకుండాపోయింది. సంసారభారం పిల్లలపైన పడింది. ఈ కష్టకాలంలో ఆ పిల్లల్ని ఎవ్వరూ ఆదుకునేవాళ్ళు లేరు. బంధువులు కూడా వున్నట్లు కనపడదు. ఉంటే ఈ ఆపత్సమయంలో వచ్చివుండేవారే. తనకుమల్లే వాళ్ళు అనాథలైనారు. చెప్పుకోవడానికి తనకూ ఒకతల్లి వుంది. కాని ఏమిలాభం? చెడునడవడివల్ల ఆమె తనకు దూరమైంది. ఆమె వున్నా లేనిసమానమే. దీనికి ఫలితంగా తను జీవితంలో ఏకాకి అయినాడు. నళినికూడా అంతే. ఉన్న ఒకతల్లిని పోగొట్టుకుంది. మేనమామ వుండికూడా లేనిసమానమే. చెప్పుకోవడానికిమాత్రం వున్నారు. కాని ఏమిలాభం? వారి ప్రపంచం వేరు. వారి లక్షణం వేరు. వారు ఉండికూడా నళిని అనాథ అయింది. జీవితం దిక్కులేనివాళ్ళని ఒకచోట పోగుచేసింది. తను ఒక అనాథ. ఆపత్కాలంలో ఇంకొక అనాథని ఆదుకోవడం తన ధర్మమని అనుకున్నాడు మధు. వెంటనే కిశోర్ గదిలోంచి కదిలాడు ఎదురుగావున్న గదులవేపు బయల్దేరాడు. ఎందుకో గుండె దడదడమని కొట్టుకుంటున్నది. మెట్లదగ్గరి ఖాళీస్థలాన్ని దాటాడు. కిశోర్ గదికి ఎదురుగావున్న గదిలో ప్రవేశించాడు. ఆ గదిలో ఎవ్వరూ కనపడలేదు. అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగాడు. ఎక్కడినించో మాటలు వినపడుతున్నాయి. ఆ ధ్వనిని అనుసరించి వెళ్ళడం మొదలుపెట్టాడు. ముందు గది దాటాడు. దానికి కుడివేపున నళినిగది కనపడింది. ఆ గదిలో నళిని కుసుమ ఆయెషా రెహానా ఇంకా ఎవ్వరో అమ్మాయిలు కనపడ్డారు. అన్ని మొహాలూ ఆనాడు పార్టీలో చూచినవే. కాని ఆనాడు కనపడిన అబ్బాయిలెవ్వరూ గదిలో లేరు. ఆనాడు ఉర్దూ గజళ్ళు పాడిన ఆయెషానీ నృత్యంలో ఆ గజళ్ళని వ్యాఖ్యానించిన రెహానాని మధు

గుర్తించగలిగాడు. తక్కినవాళ్ళని గుర్తించలేకపోయాడు. వాళ్ళందరూ కీర్తిశేషురాలైన రాములమ్మగారి గుణగణాల్ని శ్లాఘిస్తున్నారు. వాళ్ళమధ్య ఒక కుర్చీలో నళిని శోకమూర్తివలె కూర్చొని వుంది. ఆమె ఏమీ మాట్లాడడంలేదు. మౌనంగా ఏడుస్తున్నది. కళ్ళల్లోంచి ఒకటేపనిగా కన్నీరు చెంపలమీదుగా కారుతున్నది. నళిని ఆ కన్నీటినికూడా తుడ్చుకోవడంలేదు.

"ఈమధ్య రాములమ్మగారిని నేను ఎన్నడూ చూడలేదు" అంటున్నది రెహానా.

"ఆమె పూజలేమో? ఆమె ఏమో? ఈమధ్య ఎన్నడూ ఆ దేవతా గృహంనించి కదలడమేలేదు" అని ఒక అమ్మాయి అంటున్నది.

"అనాయాస మరణం-పుణ్యాత్మురాలు" అని ఇంకొక అమ్మాయి వ్యాఖ్యానిస్తున్నది.

"ఉన్నన్ని రోజులు ఈ యింటికోసం రెక్కలు ధారపోసింది." అని అంది ఆయెషా.

"ఆమె లేకపోతే ఈ యిల్లు నిలబడేదేకాదు - ఆర్థికంగా పెద్ద దెబ్బ తినేది" అంది ఇంకొక అమ్మాయి.

"చిన్నప్పటినించీ నళినినీ, కుసుమనీ స్వపర భేదం చూపకండా ఒకతల్లి పిల్లలవలె పెంచి పెద్దవాళ్ళని చేసింది. సంసారం వాళ్ళచేతుల్లో పెట్టి చివరికి తను దాటిపోయింది" అంది మొదటి అమ్మాయి.

ఎందరు మనుషులో రాములమ్మగారిని గూర్చి అన్ని అభిప్రాయాలు, ఎన్ని గొంతుకలో అన్ని సానుభూతి వచనాలు. ఇందరిమధ్య తనేమి మాట్లాడాలో మధుకి తోచలేదు. అందరి అభిప్రాయాలూ అందరి సానుభూతి వచనాలు వింటూ మౌనంగా కూర్చున్నాడు.

ఎందుకో కుసుమ అక్కడినించి వెళ్ళిపోయింది. కుసుమ వెళ్ళిపోయిందే తడవుగా ఒక్కొక్కరే నళిని దగ్గర శలవు తీసుకొని వెళ్ళి

పోతున్నారు. నళిని ఏమీ మాట్లాడడంలేదు. "ఇంక వెడతామని" చెబుతూంటే కళ్ళతో "సరే" నంటున్నది. నళిని సహోయాధ్యాయినులంతా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. గదిలో ఇంక మధు నళినులు మాత్రం మిగిలిపోయారు.

రాములమ్మగారిని గూర్చి మాట్లాడితే నళిని మరీ ఏడుస్తుంది. తను ఆ సంగతి ఎత్తకండావుంటే బాగుంటుందో, ఉండదో, కాని ఉదయం రాములమ్మగారి అంత్యక్రియలు జరిగినప్పటినించీ వచ్చివెళ్ళే స్నేహితుల ఉపశమన వాక్యాలతో పరామర్శలతో విసిగి వేసారి వుంటుంది నళిని. కాగా నళిని ఆ రోజు ఎంగిలి పడిందో లేదో? సాయంత్రం టీ త్రాగిందో లేదో ? నిన్నరాత్రి ఎనిమిది గంటలనించి ఈరోజు ఏడు గంటలవరకూ అన్నాహారాలు లేకండా పరామర్శలమధ్య ఏడుపుతో గడిపిన మనిషి స్థితి ఎల్లావుంటుంది? ఊహించడం కూడా కష్టమే. నళినిని ఒంటరిగా వదలివేయడంకూడా ప్రమాదమే. తల్లిని తలచుకొని ఒకటేపనిగా ఏడుస్తున్నది. రాములమ్మగారి ప్రసక్తి తేకండా ఆమెను ఏవో మాటల్లోకి దించాలి. దానివల్ల ఆమె మనస్సు ఇంకొక వైపుకి మళ్ళుతుంది. ఉండుండి తల్లిసంగతి జ్ఞాపకంవచ్చినా ఫరవాలేదు. అప్పటికీ కొంత మేలే జరుగుతుంది. కొంతసేపైనా తల్లిని మరిచిపోగలుగుతుంది. తన గొంతుకలో విచారం ధ్వనించకూడదు. ఏవో కల్లిబొల్లి కబుర్లు చెప్పాలి. వీలవుతే ఛలోక్తులాడాలి. ఈ సందర్భంలో ఆమెతో హాస్యమాడినా ఫరవాలేదు. ఏదోవిధంగా ఆమెని నవ్వించాలి. దానివల్ల ఆమె హృదయం తేలికపడుతుంది. ఆమె తనని గూర్చి ఏమనుకున్నాసరే. తనకు ఇంగితజ్ఞానం లేదనుకున్నా పోయేదేమీలేదు. తనని పిచ్చివాడనుకున్నా తను లెక్కచేయవలసిన అగత్యం లేదు. హాస్యోక్తులాడో లేక ప్రేమ నటించో ఆమె హృదయాన్ని తేలికపరచాలి. ప్రస్తుతం అదీ తను చేయవలసిన పని. తక్కినవాళ్ళకిమల్లే

తనూ నాలుగు పరామర్శ వాక్యాలుచెప్పి వెళ్ళిపోతే దానివల్ల ప్రయోజన మేమీ వుండదు. దుఃఖంనించి ఆమె మనస్సు మళ్ళించాలంటే కొంత వరకు తను వెర్రి వెంగళాయగా ప్రవర్తించక తప్పదు. కాని ఆ వెర్రి వెంగళాయ వేషాలు వెయ్యడం ఎల్లాగో మధుకి తోచలేదు. ఇద్దరిమధ్య నిశ్శబ్దం భరించరానిదిగా పరిణమిస్తున్నది. తను వెంటనే ఏదో ఒకటి మాట్లాడి ఆ నిశ్శబ్దాన్ని ముక్కలు ముక్కలు క్రింద నరికివేయాలి. ఏమిమాట్లాడాలో తోచక మధు నళినికేసి తదేకదీక్షగా చూశాడు. నళిని ఏమీ మాట్లాడలేదు. కాని తన చూపుల్ని మధు చూపుల్లోంచి విడదీసు కున్నది. తన చూపులు ఎక్కడినించో నళినిని లాక్కొచ్చి ఆమెని ఈ లోకంలో పడేసినట్లు గ్రహించాడు మధు.

"నేను వచ్చినప్పటినించీ మీ కళ్ళల్లోంచి నీళ్ళు కారుతూనే ఉన్నాయి. ఎంతసేపు ఏడ్వగలుగుతారో చూదామని ఓపిగ్గా కూర్చున్నా" నన్నాడు మధు.

మధు మాటలు నళినిని ఆశ్చర్యచకితురాల్ని చేశాయి. "ఏమిటీ యితను ఇలామాట్లాడుతా" డనుకుంది కూడా లోలోపల. కాని పైకి మాత్రం ఏమీ అనలేదు నళిని.

"దుఃఖానికన్నా దుఃఖ ప్రదర్శనం మీలో ఎక్కువగా వుంది" అన్నాడు మధు కాసేపు ఆగి. మధు ఆ వాక్యం ఎందువల్ల అన్నాడో నళినికి అర్థం కాలేదు.

మధు ఆ సంగతి వెంటనే గ్రహించి డొంకతిరుగుడుగా మాట్లా డడం మాని సూటిగా మాట్లాడడం మొదలెట్టాడు.

"మీరు ఆ కన్నీళ్ళు తుడ్చుకుంటారా? లేక నన్నువచ్చి తుడువ మన్నారా?" అని అడిగాడు మధు సూటిగా.

వెంటనే నళిని కొంగుతో కన్నీళ్ళు తుడ్చుకుంది. దానితో మధు హృదయం కాస్త కుదుటపడింది.

"నేను వచ్చినప్పటినించీ చూస్తున్నాను. మీరు ఏడ్వడమేకాని కన్నీళ్ళు అసలు తుడ్చుకోవడమేలేదు. దానివల్ల ఆ పని నేటికి ఎవరికైనా అప్పగించదల్చుకున్నారా అని ఆలోచిస్తున్నా" నన్నాడు మధు కొంచం ఛలోక్తిగా.

నళిని అప్పటికీ నోరు విప్పలేదు. మధు వింతధోరణికి ఆమె మరీ గడ్డకట్టుకుపోయింది. కాగా ఆ వింతధోరణికి మధువట్ల చూపుల ద్వారా అయిష్టతకూడా ప్రకటించింది.

కాని మధు ఆరోజున నళినిని అంతటితో వదిలిపెట్టదలచుకో లేదు. ఆమె పెదవులపైన చిరునవ్వు చూచిగాని, ఆనాడు అతను ఇంటికి వెళ్ళదలుచుకోలేదు.

"చూడండి-నేను ఈ సాయంత్రం టీ త్రాగలేదు. దయచేసి ఒక కప్పు టీ తెప్పించిపెడతారా?" అని అడిగాడు మధు నళినిని, ప్రాధేయ పూర్వకమైన కంఠంతో.

నళిని ఉలకలేదు పలకలేదు ఆ వాక్యాలకి - బెల్లంకొట్టిన రాయికి మల్లే మరీ బిగుసుకుపోయింది. మధు వింతధోరణికి నవ్వాలో ఏడ్వాలో ఆమెకు తోచలేదు. కాని టీ ప్రసక్తి వచ్చేసరికి, ఆమెకీ కాస్త టీ తాగుదా మనిపించింది. ప్రొద్దుటినించీ ఏడ్చీ ఏడ్చీ తల నొస్తున్నది. కాస్త టీ తాగితే తగ్గుతుందేమోననే ఆశ కలిగింది.

ఇంతలోకే ఒక పనిమనిషి గది ముందునించి ఎక్కడికోవెడుతూ కనపడ్డాడు. వాడిని రెండు కప్పుల టీ పట్టుకురమ్మన్నాడు మధు. రెండు కప్పు లనేసరికి నళిని కొంచం దోషిగా ఫీలయింది. తన మనస్సులోని మాటని మధు తెలుసుకోలేదుకదా అని భయపడింది.

"సమయానికి టీ తాగకపోవడంవల్ల కొంచం తలనొప్పిగావుంది. అందువల్ల రెండు కప్పులు తెమ్మన్నా" నని మధు తనచర్యకి సంజాయిషీ చెప్పాడు.

తీరా రెండు కప్పులేవస్తే ఆ రెండు కప్పులు అతనే త్రాగి కూర్చుంటాడేమోనని నళిని అనుమానపడ్డది. కాని పైకి ఏమీ అనలేదు.

"ఎంత దుఃఖంలో వున్నప్పటికీ నేను అన్న పానాదులు మాత్రం మానుకోలేను" అన్నాడు మధు నళినిని తన వాగ్బాణానికి గురిచేస్తూ

నళిని ఆ వాక్యంలోని అంతరార్థం గ్రహించింది.

తన వాగ్ధోరణి తనకే విపరీతంగా తోచింది మధుకి. ఆ ధోరణి తన మనఃప్రవృత్తికి విరుద్ధమైనప్పటికీ అది ఆమె దుఃఖాన్ని కొంత వరకు తొలగించివేయగలిగితే అంతే చాలుననే ఉద్దేశంతో అదేపద్ధతిని కొనసాగించవలిచాడు మధు తన సంభాషణని.

"నిజం చెప్పొద్దూ! సంతోషంలోకన్నా మీరు దుఃఖంలోనే ఎక్కువ అందంగా కనపడతారు" అన్నాడు మధు తన అస్త్రశస్త్రాలకి తిరిగి పదను పెడుతూ.

ఆ వాక్యానికి నళిని గతుక్కుమంది. సిగ్గుతో చెక్కిళ్ళు ఎర్ర బారాయి. మధు సంభాషణలోని ఆంతర్య మేమిటో ఆమెకి అర్థం కాలేదు. నిన్నటి రాత్రినించి శోకంతో నళిని హృదయం బరువుగా వుంది. కాగా ఎంతకీ టైం గడవకండా వుంది. పోనీ మధు హాస్య ధోరణివల్ల కొంత కాలక్షేపమైనా అవుతుందని ఆమె మౌనం వహించింది.

నళిని మౌనం వహిస్తున్నాకొద్దీ ఆమెని ఎల్లాగైనా మాట్లాడించాలనే పట్టుదల హెచ్చింది మధుకి. తను పదనుపెట్టిన అస్త్రాలలోంచి ఒక్కొటొక్కటే ఆమెపైకి వదలడం మొదలుపెట్టాడు అతను.

"మౌనం శోకానికి ఒక లక్షణమని ఎక్కడైనా అలంకారికులు చెప్పారా అని ఆలోచిస్తున్నా" నన్నాడు మధు, ఎవ్వరో తనని "ఏమిటి ఆలోచిస్తున్నావని" అడిగినట్లు.

ఆ వాక్యం నళినికి బాణంలాగా గుచ్చుకున్నది. అయినా ఆమె మాట్లాడలేదు.

ఈ పదునైన అస్త్రంకూడా వృథాగా పోయినందుకు మధు ఎంతో చింతించాడు. కాని నిరుత్సాహం పొందలేదు.

ఇంతలోకే టీ వచ్చింది. రెండు కప్పుల్లో డికాషన్ పోసి, పాలు పోసి, చక్కెర వేశాడు మధు. టీతోపాటు కొన్ని బిస్కట్లు కూడా వచ్చాయి. ఒక బిస్కట్ తీసుకొని కావాలని పల్లెటూరివాడిలాగ దాన్ని టీలో ముంచి తింటున్నాడు మధు. అతని వెర్రివెంగళప్ప వేషానికి కొద్దిగా నవ్వువచ్చింది నళినికి. కాని ఆ నవ్వును బైటికి కనపడకుండా ఆమె పెదవుల్లోనే నొక్కివేసింది. బిస్కట్ ఎంతో రుచిగా వున్నట్లు నటిస్తున్నాడు మధు. ఆ నటనలో మధు, నళిని ముఖకవళికని గమనించ లేదు

"రెండుకప్పుల టీ నేనే తెప్పించుకున్నా, ఒకకప్పు మీకు యిచ్చే దానికి నాకు ఎట్టి అభ్యంతరం లేదు" అన్నాడు మధు, తెప్పించుకున్నంత మాత్రాన ఆ టీ తన సొత్తైనట్లు.

"టీ తాగడమా, మానడమా ?" అనే ఆలోచనలో పడ్డది నళిని. తాగకపోతే తిరిగి తనని సూదుల్లాంటి మాటలతో వేధించుకు తింటా డేమోనని రెండవ కప్పు అందుకుంది ఆమె.

నళినిని టీ తాగించగలిగినందుకు తన ప్రజ్ఞావిశేషాలపైన తనకే విశ్వాసం కుదిరింది మధుకి.

నళిని టీ చప్పరిస్తో అమాంతంగా కళ్ళల్లో నీళ్ళు నింపుకుంది. ఆ సంగతి గమనించి, వెంటనే తన ధోరణిని తిరిగి ప్రారంభించాడుమధు.

"అంత నిండు దుఃఖంలో బిస్కట్లు మీరు ఎల్లాగూ తినలేరు కనక అన్నీ నేనే తినేస్తా" నని త్వరత్వరగా ఒక్కొక్కటి చొప్పున అన్ని బిస్కట్లూ తినెయ్యడం ఆరంభించాడు మధు.

ఆ దృశ్యానికి నళిని కళ్ళల్లోని నీళ్ళు క్రిందికి జారకుండా కళ్ళల్లోనే వుండిపోయినాయి

"హమ్మ ఆకలి! లోకంలో వున్న ఆకలంతా నాకే పెట్టాడు ఆ మాయదారి దేవుడు" అని ఏసుక్కున్నాడు మధు, బిస్కట్లతో నిండిన నోటితో.

"మీ బిస్కట్లు నాకేమీ అక్కరలేదు. నెమ్మదిగా తినండి" అంది నళిని తన గొంతు సవరించుకుంటూ—ఏడ్పూ, మౌనంవల్ల ఆమె గొంతు జీరపోయింది.

"అమ్మయ్యా! మీకూ మాటలు వచ్చే! అప్పటినించి రావనుకుంటున్నా" అని విసిరికొట్టాడు మధు.

"......................"

"నాకు దృష్టిదోషం తగలకుండా వుండి, వాంతులు కాకుండా వుండాలంటే మీరుకూడా ఒక బిస్కట్ తీసుకోవడం మంచిది" అని అన్నాడు మధు, నళినికేసి చూస్తూ.

"......................"

"ఊఁ తింటారా? లేక నన్ను తినిపించమంటారా?" అని త్వరపెట్టాడు మధు, నళిని బిస్కట్ తీసుకోవాలనే ఉద్దేశంతో.

నళిని విధిలేక బిస్కట్ అందుకుంది. కొంచెం కొరికి సాసర్లో పడేసింది. టీ మాత్రం పూర్తిగా తాగింది.

మధు మాటకారి కాదనుకుంది నళిని ఒకప్పుడు. కాని తను పొరపడ్డానని ఆమెకి ఇప్పుడిప్పుడే తెలిసివచ్చింది.

ఫిబ్రవరిమాసం. ఎండలు బాగా కాస్తున్నాయి. సాయంత్రాలు కూడా ఏమీ చల్లగా వుండడంలేదు. ఉదయం పదిగంటలనించీ దాదాపు మధ్యరాత్రి వరకూ ఒకటే ఉక్క— అప్పటికి రాత్రి ఏడున్నర దాటింది. మధు నళినులు వేడివేడి టీ తాగేసరికి వాళ్ళకి బాగా ఉక్కగా వున్నట్లు తోచింది. ఎంత ఫ్యాన్ తిరిగినా లాభంలేదనిపించింది. ఏ టాంక్ బండ్ కో,

ఏ నిర్జన స్థలానికో వెడితే బాగుండు ననిపించింది మధుకి. కాని నళినిని ఒంటరిగా వదలడం ఏమాత్రం మనస్కరించలేదు అతనికి. పోనీ ఆమెనికూడా లాక్కెడితే ? బాగానే వుంటుంది. కాని ఆమె ఒకపట్టాన రావడానికి యిష్టపడుతుందో, లేదో? పోనీ ప్రయత్నించి చూస్తే? అనాడు తను కొన్ని విజయపరంపరల్ని సాధించినమాట నిజమే. నళినితో టీ తాగించాడు. ఆమెతో బిస్కట్ కొరికించాడు. కాగా అంత దుఃఖంలో కూడా ఆమె వదనంలోకి ఛాయామాత్రంగానైనా అప్పుడప్పుడు చిరునవ్వుల్ని తెప్పించాడు. తన వాక్చతురతతో ఆమె హృదయాన్ని కొంతవరకు విచారంనించి తను మళ్ళించినమాటనిజమే. కాని అంతమాత్రాన ఈ విషయంలో కూడా తనకు విజయం లభిస్తుందని ఏమి నమ్మకం ? ఓటమికి కూడా సిద్ధపడి చివరకి ప్రయత్నించి చూడడానికి పూనుకున్నాడు మధు.

"అబ్బ ! చాలా ఉక్కగా వుంది" అన్నాడు మధు, తన వ్యూహానికి నాందిప్రస్తావనగా.

"ఈరోజు ఎందుకో ఉక్క మరీ ఎక్కువగా ఉన్నట్లుంది" అన్నది నళిని, మధు ధోరణికి ముక్తాయింపుగా.

"ఈ గదిలో మరీ ఉక్కగావుంది. అలా కారులో ఎక్కడికైనా వెడుదామా ? మీ శోకానికి ఏలాటి భంగం కలుగకుండా చూచే భారం నాది" అన్నాడు మధు, నళిని కళ్ళల్లోకి సూటిగా చూస్తో.

నళిని గతుక్కుమంది, ఉక్కకి సంబంధించిన సంభాషణ ఈ ధోరణిలో కొనసాగుతుందని ముందుగానే ఊహించకపోవడంవల్ల.

"నా మనస్సు ఏమీ బాగాలేదు - నేను ఈ పూట యింట్లోనుంచి ఎక్కడికీ కదలను" అంది నళిని, తన నిశ్చయాన్ని ప్రకటిస్తూ.

కథ అడ్డం తిరిగింది. దాన్ని తిరిగి ఏ విధంగా సక్రమమైన మార్గాన నడిపించాలో వెంటనే తోచలేదు మధుకి. గుడ్డెద్దు చేలో పడ్డట్టుగా, ఏదో నరుక్కురావడానికి ఉపక్రమించాడు మధు.

"దుఃఖానికి సంబంధించిన నేటి 'కోటా' ఇంకా పూర్తి కాకపోతే ఆ కాస్తా యిప్పుడు పూర్తిచెయ్యండి...ఆ తరువాతనే మనం వెళ్లొచ్చు" నన్నాడు మధు, తను గుడ్డిగా సంధించిన బాణాన్ని గాలిలోనికి వదిలివేస్తూ.

మధు ధోరణి శ్రుతిమించి రాగానపడుతున్నది నళిని దృష్టిలో—కాని ఆమె సభ్యతకి సంబంధించిన చట్టమైన తెరల వెనుక నిలిచి ఏమీ అనలేకపోయింది మధుని.

"నిజం విచారిస్తే, చచ్చింది మూడుకాళ్ళ ముదుసలి. నేడు కాకపోతే, రేపు అయినా చచ్చిపోయేదే. ఈ మాత్రానికి నిన్నటినించీ, అన్నపానాదులు మాని, ఒకటే పనిగా గొప్ప ఆర్భాటంగా ఏడ్చేస్తున్నారు. కుసుమ కిశోర్ల సంగతికూడా మీరు ఈ సందర్భంలో ఏమాత్రం ఆలోచించడం లేదు. వాళ్ళకి ధైర్యం చెప్పడం మాని, మీరే అధైర్యపడితే చివరికి కంచే చేనుమేసేసినట్లు అవుతుంద" ని హెచ్చరిక చేశాడు మధు, నళినిని నిర్మొహమాటంగా, రాములమ్మగారిపట్ల తను ఏకవచన ప్రయోగం చేస్తున్నానని కూడా ఆలోచించకుండా.

"......................"

"మీ స్థానంలో నేను వుంటే అంతగా దుఃఖం వస్తే ఎప్పుదో ఒక గంట రహస్యంగా ఏడ్చేసి, తిరిగి మామూలు మనిషినై, నిత్యకృత్యాల్లో నిమగ్న మయ్యేవాడిని" అని అన్నాడు మధు, ప్రారంభించిన ధోరణిని ఇంకా కొనసాగిస్తూనే.

"......................"

"కష్టాలకి వెరచి బెంబేలు పడిపోతే జీవితం మరీ భయంకరంగా పరిణమిస్తుంది. ధైర్యంగా, నిగ్రహంగా వాటిని ఎదుర్కొంటే జీవితం మనకు దాస్యం చేస్తుంది" అని అన్నాడు మధు చివరిమాటగా.

"నిన్నటినించీ నాకేమీ తోచడంలేదు. పోనీ, నేనేంచెయ్యాలో చెప్పండి" అని అడిగింది నళిని జాలిగా గొల్లుమని ఏడుస్తో.

"మీకు ఏడ్వాలనిపిస్తే మనసారా ఏడ్చేసెయ్యండి. కాని ఆ తరువాత కొంతసేపటివరకూ దాని జోలికి వెళ్ళకండి" అన్నాడు మధు నళిని ప్రశ్నకి జవాబుగా.

"అదే నాకు సాధ్యపడడంలేదు" అంది నళిని తన నిస్సహాయతని వ్యక్తపరుస్తూ.

"ఊరికే ఆలోచిస్తూ కూర్చుంటే తిరిగి అవే ఆలోచనలు వచ్చి దుఃఖాన్ని ఏమాత్రం మరచిపోనివ్వవు. ఏదో వ్యాపకం కల్పించుకుంటే కొంత కాకపోయినా కొంత అయినా ఉపశాంతి కలుగుతుంది" అని జీవితంలో దుఃఖాన్ని మరచిపోవడానికి గల కిటుకుని విడమర్చి చెప్పాడు మధు. నళినికి మధు వాదంలో కొంత సత్యముందని తోచింది.

"అయితే, కార్‌లో కాసేపు ఎక్కడకైనా వెళ్ళివద్దాం లెండి" అని అంది నళిని వెంటనే.

మధు హృదయంలో విజయదుందుభులు మ్రోగాయి.

నళిని నోటినించి ఆ వాక్యం వెలువడిందేతడవుగా అక్కడినించి లేచాడు మధు. ఉన్నది ఉన్నట్లుగా నళిని, మధు వెనకాల బయల్దేరింది. ఇద్దరూ మెట్లు దిగారు. మెట్లు దిగుతుండగా ఆ యింట్లో తను అడుగు పెట్టిన రోజున నళిని తనకు ఎదురువడిన సంగతి జ్ఞాపకమొచ్చింది మధుకి. ఈ రోజున ఆమె తనని అనుసరిస్తున్నది. నేటి ఆమె చర్యకి తన జీవితంలో ప్రాముఖ్యత ఏమైనావుంటుందా అనే ఆలోచన అతనికి మెరుపులాగా వచ్చి అంతలోకే అదృశ్యమైంది. వచ్చిన భావాన్ని వచ్చినట్లే మరచిపోయి నళినితో సహా కారు దెగ్గరికి నడిచాడు మధు. డ్రైవరుతో చెప్పి కార్ తీయించాడు. నళిని కార్ ఎక్కి వెనక సీటులో ఒక పక్కకి ఒదిగి కూర్చున్నది. ఆ చర్యలోని ఇంగితాన్ని గ్రహించి మధు

కూడా వెనకాలే ఎక్కికూర్చున్నాడు. కార్ ఎక్కుతూ "పెట్రోల్ ఉందా?" అని అడిగాడు మధు డ్రైవర్‌ని. ఉందన్నట్లు తలూపాడు డ్రైవర్ "టాంక్‌బండ్‌కి పోనివ్వు" అని చెప్పాడు మధు అతనితో.

కార్ కదిలింది. నారాయణ్‌గూడా చౌరస్తా....హిమాయత్‌నగర్....లిబర్టీ టాకీసు....టాంకుబండ్ చేరుకుంది కార్.

ఈ మధ్య ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

టాంక్‌బండ్ జనంతో క్రిక్కిరిసివుంది. రాత్రి ఎనిమిదిన్నర అయినా, ఆ చల్లగాలిని వదిలి బండ్ మీదినించి ఎవ్వరూ కదలడంలేదు. జనమంటే మధుకి ఎందుకోభయం. "కార్‌తిప్పి, గండిపేటకు పోనివ్వు" అన్నాడు మధు డ్రైవర్‌ని. అతను కార్ గండిపేటదారికి మళ్ళించాడు.

"ఇప్పుడు అంతదూరమెందుకు?" అని అంది నళిని ఏసీ వినపడనట్లు.

"ఒక గంటలో తిరిగివస్తాం - పోనివ్వండి" అన్నాడు మధు జవాబుగా.

కార్ ఎంయ్యేన పరుగెత్తుతున్నది.

నగరం పొలిమెరల్ని దాటిందికూడా ఎవ్వరూ గమనించలేదు.

వెన్నెల మడుగులో బాతులాగా నెమ్మదిగాకదిలిపోతున్నది కార్.

చల్లని గాలి ఆప్తమిత్రుడిలాగా వీపు తట్టుతున్నది.

ఎందుకో ఆ వెన్నెలలో మల్లెపూలు జ్ఞాపకంవచ్చాయి మధుకి.

మార్చి, ఏప్రిల్ మాసాలలో మల్లెపువ్వులుఏస్తాయి. ఇవి ఫిబ్రవరి చివరరోజులు మల్లెపూల కాలం కాదు. అయినా తనకు మల్లెపూలతో సంబంధం ఏమిటి? అవి తన జీవితంలో ఎన్నడో కుసుమించివాడి పోయాయి. ఆగస్టు, సెప్టెంబర్ మాసాలలో గులాబీలు ముమ్మరంగా వుంటాయి. గులాబీల కాలం గడచిపోయింది. మల్లెల కాలం ఇంకా రాలేదు. ఇది సంధి కాలం అనే నిర్ణయానికి వచ్చాడు మధు.

"వెన్నెల ఎంత అందంగా వుంది!" అని అన్నాడు మధు ఏవేవో జ్ఞాపకాలు తరుముకురాగా.

"నా హృదయాని కిది కాళరాత్రి. ప్రపంచానికి వెన్నెలరేయి" అని అంది నళిని రెండింటిలో గల తేడాని గుర్తిస్తూ.

"వెన్నెలసొగసుని చూడాలంటే, వెన్నెలకళ్ళు చాలా అవసరం" అని అన్నాడు మధు ఏమీ ఊబుసుపోక.

"చీకటి కళ్ళకి వెన్నెల సొగసు దుర్భాహ్యంగా వుంటుంది" అంది నళిని తన ప్రస్తుత మనఃస్థితిని విశదీకరిస్తూ.

"కాస్సేపటికి నా కళ్ళని ఎరువుపుచ్చుకోండి వెన్నెల అందాన్ని చూడడానికి" అని మధు ఒక ఛలోక్తి విసిరాడు.

"ఎరువు సొమ్ములతో ఎంతకాలమని మనగలను?" అని తిప్పి కొట్టింది నళిని.

"ఎంతకాలం మనగలిగినా సరే, కాని దొరకిన అవకాశాన్ని మాత్రం జీవితంలో ఎన్నడూ వదులుకోగూడదు" అని ఒక హితోక్తిని విసిరాడు మధు.

"ఇప్పుడు నాకే అవకాశం దొరికిందని?" అని అడిగింది నళిని జాలిగా.

"వెన్నెలని మనసారా అనుభవించే అవకాశం" అని ఒక సూచన చేశాడు మధు.

నళిని జవాబు చెప్పలేదు. ఏదో ఆలోచిస్తూ మౌనం వహించింది.

దారిపొడుగునా ఏమాత్రం జనసంచారంలేదు. డ్రైవర్ కార్‌ని వాయువేగంగా నడిపిస్తున్నాడు.

"అంత తొందరేమిటి? కాస్త నెమ్మదిగా పోనియ్యి" అని నళిని డ్రైవర్‌కి ఆదేశించింది.

క్రమంగా కార్ వేగం తగ్గింది. ముప్పై మైళ్ళ స్పీడులో నడుస్తున్నది.

"చూచారా: ఒక చిన్ని హెచ్చరికవల్ల మంచి స్పీడులో వెళ్ళే అవకాశాన్ని మనం చేతులారా పోడగొట్టుకున్నాం" అన్నాడు మధు, నళిని ఆదేశాన్ని గూర్చి తన అభిప్రాయాన్ని వెల్లడిస్తూ.

"మంచి స్పీడులో వెళ్ళడం కూడా ఒక అవకాశమేనంటారా ?" అని అడిగింది నళిని, మధుని.

"మరికాక ?" అని మధు తన అభిప్రాయాన్ని బలపరిచాడు.

"ఎందువల్ల ?" అని అడిగింది నళిని మధు ఉద్దేశమేమిటో అర్థంకాక.

"ఆ క్షణం మనకు అయాచితంగా మంచి స్పీడులో వెళ్ళే అవకాశాన్ని ఒనగూర్చింది. ఆ ఆనందాన్ని మనం అనాలోచితంగా జార విడుచుకున్నాం" అని వివరించాడు మధు తన ఉద్దేశాన్ని పైకి ఆలోచిస్తున్న ధోరణిలో.

"స్పీడ్ కొందరికి భయకారణమవుతే, మరి కొందరికి ఆనంద దాయకం అవుతుందన్నమాట. ఒకే విషయం రెండు విభిన్న స్వరూపాల్ని దాల్చడానికి గల కారణమేమిటో చెబుతారా ?" అని అడిగింది నళిని చర్చనీయాంశంపైన కాస్త ఆసక్తిని కనపరుస్తో.

"దృష్టి భేదం తప్ప యితరమేమీ కాజాల"దని అభిప్రాయ పడ్డాడు మధు.

"రెండింటిలో ఏ దృష్టి మంచిదంటారు ?" అని అడిగింది నళిని చర్చని కాస్త సాగదీస్తూ.

"ప్రతి సంఘటన వెనకాల కొన్ని వెలుగునీడలు దాగివుంటాయి. నీడల్ని మరుగుపరిచి, వెలుగుల్ని ఎత్తిచూపగల దృష్టి సహజంగా మంచిదని చెప్పవలసివస్తున్నది" అని అన్నాడు మధు జవాబుగా.

"ఆ దృష్టిని అలవరుచుకోడానికి ప్రత్యేక ప్రయత్నమేమైనా చేయవలసి వుంటుందా?" అని అడిగింది నళిని సమస్య అంతు తెలుసు కునే ఉద్దేశంతో

"ప్రత్యేక ప్రయత్నం ఏమీ అక్కర్లేదు, ప్రత్యేక మనస్తత్వాన్ని అలవరుచుకోవడంతప్ప. అన్నీ మనమంచికే జరుగుతాయని అను కోవడం ఈ ప్రత్యేక మనస్తత్వాన్ని అలవర్చుకోవడానికి మొదటిమెట్టు. జరగకూడనిసంఘటన జీవితంలో జరిగినప్పటికీ, అది ఎంత దుఃఖదాయక మైనప్పటికీ, దానివల్లకూడా మనకు ఏదో ప్రచ్ఛన్నమైన మేలు జరిగిందను కోవడం మూలాన ఆదుఃఖం చాలావరకు తగ్గిపోతుంది. పిల్లల బోసి నవ్వులు, వెన్నెలసొగసు, గులాబీ అందం మొదలైన చిన్నచిన్న అంశాల్లో ఆనందాన్ని అన్వేషించి చూడగొనడం ఈ మనస్తత్వాన్ని అలవర్చుకోవ డానికి రెండవమెట్టు. ఈ రెండవమెట్టుని అందుకోవడంలో జీవితంలోని మొనాటనీ చాలావరకుతగ్గి సత్కాలక్షేపం జరుగుతుంది" అని అన్నాడు మధు ఆ సమస్యనిగూర్చి పైకి ఆలోచిస్తూ.

కార్ గండీపేట చేరుకుంది. చెరువుకట్ట మీదినించి వెడుతుండగా కార్ ఏదో వంకరటింకర్లు నడిచింది. ఆ వెంటనే బ్రేక్ వేసినట్లు ఆగి పోయింది. డ్రైవర్ దిగి బానెటుఎత్తి మెషిన్ పరీక్షించాడు. మెషిన్ సరిగ్గానేఉంది. స్కేలువేసి పెట్రోలు చూచాడు. పెట్రోలు ఏమాత్రం లేదు వెనకాల రెండుడబ్బాలూ చూచాడు. ఎందులోనూ పెట్రోలులేదు.

అప్పటికి రాత్రి తొమ్మిది దాటివుంటుంది.

"ఏమైంది ?" అని అడిగింది నళిని డ్రైవర్‌ని కార్ ఎందుకు ఆగిందో కనుక్కుందామనే ధోరణిలో.

డ్రైవర్ ఏమీ సమాధానం చెప్పలేదు.

డ్రైవర్ ఏమీ మాట్లాడక పోవడంతో కార్ ఏదో పాడైందని అనుమానించింది నళిని.

"ఏమైందంటే మాట్లాడవేం" అని గట్టిగా కోపంతో అరిచింది నళిని.

నళిని కోపానికి డ్రైవర్ కంపించిపోయాడు.

"పె...పె...పెట్రోల్" అని తడబడుతూ అన్నాడు డ్రైవర్.

"పెట్రోల్ ఏమైంది? లీకు అయిందా?" అని కసిరింది నళిని.

ఆ కసురుడికి గడగడలాడాడు డ్రైవర్-ఏమీ జవాబు చెప్పలేదు

"ఏం మాట్లాడవేం" అని కళ్ళెర్రచేసింది నళిని.

"పెట్రోల్ లే"దన్నాడు డ్రైవర్.

"బయల్దేరేముందు ఎందుకు చూసుకోలేదు" అని కసిరికొట్టింది నళిని.

"వెనకాల నిండుడబ్బా వుందనుకున్నా"నని అన్నాడు డ్రైవర్ తనుచేసిన నేరాన్ని ఒప్పుకుంటూ.

"నిండుడబ్బా యింట్లో వదిలేసి ఖాళీడబ్బాలు తీసుకొచ్చావన్న మాట" అని విసుక్కుంది నళిని.

డ్రైవర్ తనుచేసిన పొరపాటు ఇదివరకే గ్రహించాడు. అందువల్ల మౌనం వహించాడు.

"ఇప్పుడు ఏం చేస్తావు?" అని కోపంకొద్దీ అడిగింది నళిని ఏమిచేయడమో ఏమీ తోచక.

"ఊళ్ళో సైకిల్ ఎవరిదైనా అడిగి తీసుకొని పట్నంనించి పెట్రోల్ తీసుకొస్తా" నన్నాడు డ్రైవర్ జవాబుగా.

"ఏదో త్వరగా ఏడువు" అని తిరిగి విసుక్కొని తన ఆలోచనల్లోకి తాను వెళ్ళింది, తాంబేలు తిరిగి తన బుర్రలోకి వెళ్ళినట్టు

డబ్బా పెట్రోల్‌డబ్బా పుచ్చుకొని డ్రైవర్ గండీపేట గ్రామంకేసి వెళ్ళాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?" అని అడిగాడు మధు డ్రైవర్ వెళ్ళినతరువాత కొంతసేపటికి.

"ఇక్కడినుంచి మనకు ఎప్పుడు విముక్తి లభిస్తుందా అని ఆలోచిస్తున్నా"నంది నళిని గంభీరంగా.

"మళ్ళీ అదేపొరపాటు చేస్తున్నా" రన్నాడు మధు దొరికిన అవకాశాన్ని జారవిడువకుండా.

"ఏమిటాపొరపాటు ?" అని అడిగింది నళిని చేస్తున్న పొరపాటేమిటో అర్థంకాక.

"సమస్యా పరిష్కారానికి మీఆలోచనలు ఏమైనా పనికివస్తాయా ?" అని ఎదురుప్రశ్న వేశాడు మధు.

"పనికిరావనుకోండి......" అని ఏదో నళిని చెబుతూండగానే, మధ్యలో ఇంకొకప్రశ్న వేశాడు మధు.

"మరి పనికిరానప్పుడు ఇంత ఆలోచించడం దేనికి ?"

నళిని ఆలోచనా పరంపర టక్కున ఆగిపోయింది. కాగా మధు వాదంలో కొంతసత్యం కనపడింది.

"మరిప్పుడేమి చేతామంటారు ?" అని అడిగింది నళిని మధుని.

"ఏమీలేదు. ముందు ట్రావలెర్సు బంగళాకి వెడుదాం. అక్కడ వాచ్‌మన్ ఎవడైనా వుంటాడు. ఒకరూమ్ బుక్‌చేసుకొని టీకావమని చెబుదాం - బిస్కట్లు ఏమైనావుంటే తీసుకుందాం - ఆతరువాత కట్టకేసి వద్దాం - పెట్రోల్ లేకపోవడం ఒకందుకి మంచికే వచ్చింది. హాయిగా కొంతకాలం తోటలోగడిపే అవకాశం దొరికింది. నిద్దరోతున్న చెట్లనీ, మొక్కల్నీ, గట్లనీ, పూలనీ, నీళ్ళని చూస్తో కాలక్షేపంచేతాం. అప్పటికీ డ్రైవర్ రాకపోతే ట్రావలర్సు బంగాళాకివెళ్ళి మిగిలినరాత్రి గడుపుదాం" అని ఆరాత్రి కార్యక్రమాన్ని వివరించాడు మధు.

దానితో యిద్దరూ ట్రావెలర్సు బంగళాకేసి బయల్దేరారు. వెళ్ళి అప్పటికే నిద్రపోతున్న చౌకీదార్‌ని లేపారు. వెంటనే టీ కాచమని చెప్పారు. బిస్కట్లు ఎక్కడైనా దొరుకుతే తీసుకురమ్మన్నారు. రూం బుక్ చేసుకున్నారు.

అరగంట తరువాత టీ తయారైంది. బిస్కట్లు ఏవో దొరికాయి. కాని ఏమీ బాగుండలేదు. ఏవో కొన్నిబిస్కట్లు కొరికి టీ తాగారు.

అప్పటికి తొమ్మిదిన్నర అయింది. ఉభయులూ కట్టకేసి బయల్దేరారు.

చిక్కనిపాలు పొంగకబోసినట్లు వెన్నెల. చీకూచింతల్ని మరిపించివేసే వెన్నెల ఎటుచూసినా పాలవెన్నెల.

నళినీ మధులు నెమ్మదిగా లేక్ గార్డెన్‌లోకి వెళ్ళారు. తోటమాలి మెట్లమీద ఒళ్ళు తెలియకండా నిద్రపోతున్నాడు.

పచ్చికమీద నడుస్తుంటే ముఖమల్ గుడ్డ మీద నడిచినట్లు పాదాల సవ్వడి ఏమాత్రం కావడంలేదు.

రకరకాల పుష్పాలు కమ్మని సౌరభాల్ని వెదజల్లుతున్నాయి.

చెరువులోని నీళ్ళు మధురమైన నేపథ్య సంగీతాన్ని పాడుతున్నాయి.

ప్రకృతికాంత వెన్నెలమేలిముసుగులోంచి కిలకిలనవ్వుతున్నది.

ఉభయులూవెళ్ళి వలయాకారంలోవున్న ఒక పచ్చిక బయలులో కూర్చున్నారు.

ఎందుకో వెంటనే మధు జోళ్ళువదిలేసి నీలి ఆకాశంకేసి చూస్తో వెల్లికలా పడుకున్నాడు.

నళిని తనచెప్పులు ఒకపక్కకి వదిలి మధుకి దగ్గరగాకూర్చుంది.

"ఎంత మనోహరమైన రాత్రి" అని అన్నాడు, మధు ఇంకా ఆకాశంలోకి చూస్తూనే.

నళిని ఏమీ మాట్లాడలేదు. నీళ్ళకేసి ఏదో మౌనంగా చూస్తున్నది.

నళిని ఏమీ మాట్లాడక పోవడంతో, మధు తన మోచెయ్యిని దిండుకింద ఉపయోగిస్తూ ఆమెకేసి తిరిగాడు. నళిని ఏ సుదూరలోకాల్లో ప్రయాణం చేస్తున్నదో మధు తనవేపుకి తిరగడం ఆమె గమనించలేదు

మధు ఎందుకో ఆమెని పరీక్షించి చూశాడు. పిల్లగాలికి ఆమె నొసట్లోని ముంగురులు వెన్నెలతో ఆడుకుంటున్నాయి. చెక్కిళ్ళు వెన్నెలలో తడిసి మరీ నిగనిగలాడుతున్నాయి. పమిటకొంగు తప్పించుకున్న స్తనం వెన్నెలకి మరీ ఉబ్బొంగుతున్నది ఎందుకో మధుకి రొమ్ముల మీదనించి దృష్టి కదలలేదు. వాటిపొంకాన్ని తిలకిస్తూ అక్కడే నిలకడగా ఆగిపోయింది.

నళిని ఏ దూరదేశాలనించో తిరిగివచ్చి కొంగు సరిచేసుకుంది.

"ఈ రాత్రి రాత్రిగానే వుండిపోతే..." అంటూ మధు తనదృష్టిని నళిని రొమ్ములమీదినించి బలవంతంగా మళ్ళించుకున్నాడు.

"ఏదో కవిత్వం చెబుతున్నట్టున్నారే" అంది నళిని అల్లవోకగా.

"కవితాసామగ్రి చుట్టూ వున్నప్పుడు ఏ రసికహృదయం కవిత్వం చెప్పకుండా వుంటుంది" అని సమాధానం చెప్పాడు మధు వికసిస్తున్న హృదయంతో.

"మీచుట్టూ కవితాసామగ్రి వుందా ?" అని అడిగింది నళిని చిలిపిగా.

"కవితాసామగ్రేకాదు, నా ప్రక్కన కవిత్వంకూడా వుంది." అని అన్నాడు మధు బరువుగా.

"మీ పక్కన కవిత్వం ఉందంటారా ?" అని అడిగింది నళిని కవిత్వమేమిటో తెలిసికూడా తెలియనట్లు నటిస్తూ.

"ఊఁ" అని దీర్ఘంగా మూల్గాడు మధు జవాబుగా.

ఆ మూర్ఛలో అనంతావేదనలు గురగురలాడాయి. శత సహస్ర విరహాలు ఏకకాలంలో భగ్గుమన్నాయి.

"ఉమర్ ఖయ్యాం అయిపోతున్నారే" అని అంది నళిని, అతని కవిత్వంలోని మధురిమని జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

మధు హృదయాన్ని ఏదో బాధ ఆవహించింది. ఏదో తియ్యని బాధ. చెప్పనలవికాని బాధ. ఆ బాధకి అతని హృదయం మూగవోయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?" అని అడిగింది నళిని ఏమీతోచక,

"ఏమీలేదు" అని అన్నాడు జవాబుగా.

ఉభయులమధ్యా కాసేపు నిశ్శబ్దం వీరవిహారం చేసింది.

ఇద్దరి గొంతుకలూ మూగవోయినాయి.

వెన్నెల ఉభయులకీ మత్తెక్కిస్తున్నది.

ఏదో ఉద్రేకం - ఏదో చెప్పనలవికాని ఉద్రేకం ఉభయులనీ ఆవేశించింది.

కమ్మని సువాసనలు, శరీరాల్ని వివశం చేస్తున్నాయి.

ఏమీతోచక నళిని పచ్చికమీద ఒత్తిగిలి పడుకుంది. ఎటో శూన్యం లోకి చూస్తున్నది,

మధు శరీరం పచ్చికమీద అమాంతంగా దొర్లించి.

మదిరాతపస్వి, మదిరాక్షికోసం అన్వేషిస్తున్నాడు. మదిరాక్షి వెన్నెల కళ్ళతో మదిరాతపస్వికోసం నిరీక్షిస్తున్నది.

మదిరాతపస్వి వెన్నెలకళ్లల్లోకి తొంగిచూచాడు. మదిరాక్షి కళ్లల్లోని పిలుపుని అందుకున్నాడు.

యౌవనోద్రేకం వెల్లువలై పారింది. రెండు శరీరాల్ని ముంచెత్తి వేసింది.

శరీరం శరీరాన్ని కోరుకుంటున్నది. పెదవులు పెదవులకోసం వెతుక్కుంటున్నాయి.

హృదయాలు ఉప్పొంగాయి. శరీరాలు ఏకమైనాయి. కళ్ళు అర్ధ నిమీలితాలైనాయి. యౌవనోద్రేకం పరవళ్ళు తొక్కింది. ఉప్పెత్తున లేచింది. శరీరాల పరిధుల్ని దాటి ఆత్మల్ని ఏకంచేసింది.

కవికి కవితాకన్య లభించింది.

ఆ క్షణంలో కంఠానికి శృతి దొరికింది.

ప్రపంచంలో ప్రథమకావ్యం అవతరించింది.

ప్రకృతికాంత వెన్నెలల్ని కురిపించింది. కమ్మని సౌరభాల్ని వెదజల్లింది, తన హర్షామోదాలకి సూచనగా—

కొంతసేపటికి రెండు హృదయాలు తెప్పరిల్లాయి.

"ఏమి జరిగిం ?" దని మౌనంగా ప్రశ్నించుకున్నాయి.

"ఏమిజరిగింది ?"

"ఎందుకు జరిగింది ?"

రెండు ప్రశ్నలు - రెండు హృదయాలు - ప్రశ్నల్ని పంచు కుంటాయా ? లేక కలిసి సమాధానమిస్తాయా ? ఏమో.

* * *

## ౭

"ఏం జరిగింది ?"

"వివాహం జరిగింది"

"ఎందుకు జరిగింది ?"

"ప్రేమించుకోవడంవల్ల"

ప్రజలకి సంబంధించినంతవరకు ఆ రెండు ప్రశ్నలకి నళినీ మధుల విషయంలో రెండు సంతృప్తికరమైన సమాధానాలు లభించాయి. దానితో ఆ ప్రేమోదంతాన్ని క్రమంగా విస్మరించారు ప్రజలు. మొదలు

వర్ణాంతర వివాహానికి కొందరు అసమ్మతిని ప్రకటించారు. మరికొందరు తమ అనుకూలతని వెలిబుచ్చారు. కొన్నిరోజులు తర్జనభర్జనలు సాగాయి. కొందరు వర్ణాంతర వివాహానికి ఆశ్చర్యాన్ని ప్రకటించారు, మరికొందరు ఆ విషయాన్ని అతి సహజంగా స్వీకరించారు. తల్లి మరణించిన పక్షం రోజుల్లోనే నళిని వివాహం జరగటం కొందరికి విస్మయాన్ని గొలిపింది. అంతత్వరలో పెళ్ళి కావడానికి కారణం ఇంటికి పెద్దదిక్కంటూ లేక పోవడమేనని మరికొందరికి తోచింది. ప్రజల తర్జనభర్జనలూ, సంభ్ర మాశ్చర్యాలూ క్రమేణా కాలగర్భంలో తలదాచుకున్నాయి.

మధుకి సంబంధించినంతవరకు ఆ రెండు ప్రశ్నలకి సరిఅయిన సమాధానం దొరకలేదు.

"ఏంజరిగింది ?"

రాములమ్మగారు మరణించారు. నళిని ఎంతో విచారంలో వుండింది. పరామర్శించడానికి, మరునటిరోజు సాయంత్రం తను నళిని గదిలోకి వెళ్ళాడు. నళిని దుఃఖాన్ని చూడలేకపోయాడు. ఆమె మనస్సుని మళ్ళించడానికి ఏవో ఛలోక్తులాడాడు. ఏవో హాస్యవచనాలు పలికాడు. అప్పటికీ నళిని హృదయం తేలికపడలేదు. ఒంటరిగా ఆమెను వదిలి వేయడం యిష్టంలేక వాహ్యాళికి వెడుదామని సూచించాడు. ఆమె ఎంతో కష్టంపైన ఒప్పుకుంది. కారులో బయల్దేరారు. గండీపేటకి వెళ్ళారు. పెట్రోల్ అయిపోయింది. నగరానికి పెట్రోల్‌కోసం డ్రైవర్‌ని సైకిల్ యిచ్చి పంపించారు. పెట్రోల్ వచ్చేలోపున లేక్‌గార్డన్సులో కొన్ని గంటలు గడుపాల్సివచ్చింది. అది వెన్నెలరాత్రి. పాలవెన్నెల. పుష్ప సౌరభాలు మత్తెక్కించాయి. తను వివశుడైనాడు, పరిస్థితుల ప్రోత్సా హానికి గురిఅయినాడు. యౌవనోద్రేకం తనను ముంచెత్తింది. ఫలితం? ఎన్నడూ కలలోకూడా అనుకోనికార్యం జరిగిపోయింది.

తను ఎన్నడూ నళినిని ప్రేమించలేదు. కాగా ఉభయులవీ విభిన్న మనస్తత్వాలు. పరిస్థితులు విభిన్న మనస్తత్వాలకి సాన్నిహిత్యాన్ని సమకూర్చాయి. ఆ సాన్నిహిత్యాన్ని తను ఎన్నడూ కోరుకోలేదు. తనకు తెలిసినంతవరకు నళినికూడా కోరుకోలేదు. దైవికంగా ఉభయులకీ సాన్నిహిత్యం ఏర్పడింది.

తను మొదట కుసుమని ప్రేమించాననుకున్నాడు. తదనుగుణంగా కొన్నిరోజులు ప్రియుడిపాత్రని అభినయించాడు. ప్రేమలో ఏదో జీర వచ్చింది. దానితో అభినయం ఆగిపోయింది. అంతటితో ప్రేమ ఎగిరిపోయింది.

హఠాత్తుగా నళినిని ప్రేమించడం ఆరంభించాడు. ఆమెతో సఖ్యత కుదిరింది. జీవితం సుఖంగా గడిచిపోతున్నది.

తను కుసుమని వివాహం చేసుకుందామనుకున్నాడు. అది జరగలేదు. తలవనితలంపుగా నళినిని రిజిస్ట్రీ వివాహం చేసుకున్నాడు. ఆనాడు సాయంత్రం తోటలో పెద్దపార్టీ జరిగింది. ఉభయపక్షాలకి చెందిన స్నేహితులు వచ్చారు. బంధువులు ఎవ్వరూ రాలేదు. గాననృత్యాదులతో పార్టీ ముగిసింది. ఎన్నో ప్రెజెన్ట్లు వచ్చాయి. ఆనాడు ఒక కలలాగా గడిచిపోయింది.

తన వివాహానికి తను ఎంతవరకు బాధ్యుడు? నళిని ఎంతవరకు బాధ్యురాలు ?

ఉభయులూ ఏమాత్రం బాధ్యులుకారు.

పరిస్థితులు ఆవిధంగా తన్నుకువచ్చాయి. తత్ఫలితంగా వెంటనే వివాహం జరిగిపోయింది. ఇందులో తన ప్రమేయం ఏముంది ? ఏమీలేదు.

తను ఒక మహాప్రవాహంలో కొట్టుకుపోతున్నాడు.

పరిస్థితులు ఆ-ప్రవాహాన్ని తీర్చిదిద్దుతున్నాయి.

తను నిమిత్తమాత్రుడు.

తన జీవితం పరిస్థితులకి దాసోహం చేస్తున్నది. తను నిమిత్త మాత్రుడిగా నిలిచి, ఆ లొంగుబాటుని తిలకిస్తున్నాడు. 'సాక్షీభూతం'గా వ్యవహరిస్తున్నాడు. తన జీవితానికీ, తనకూ గల సంబంధం అంతే–

ప్రేమ అంటే ఏమిటి? ఏమో? అదేమిటో తనకు ఇంతవరకూ అర్థం కాలేదు. ముందుకూడా అర్థం అయ్యే సూచనలు కనపడడంలేదు.

యువతీయువకులు సన్నిహితం కావడం, యౌవనోద్రేకంలో ఒండొరులని ప్రేమించామనుకోవడం, తరువాత వివాహమో లేక విడిపోవడమో జరగడం...ఫలితం?...సంవత్సరాల తరబడి ఈ విషవలయంలో చిక్కుకొని గిలగిల తన్నుకోవడం......

ఇదేనా ప్రేమ?

ఇదే ప్రేమవుతే, ఈ వ్యాపకంకోసం మానవాళి ఎంతో కాలాన్ని వృథా చేస్తున్నది.

కాని ఇది ఎంతో ఆకర్షవంతమైన వ్యాపకం.

ఎంతో అందమైన వ్యాపకం.

ఎంతో ఉద్రేకపూరితమైన వ్యాపకం.

దీనివల్ల కాలం ఇట్టే గడిచిపోతుంది.

కాలక్షేపంకోసం జీవితంలో ఏదో వ్యాపకం కల్పించుకోవడం అవసరం.

ప్రతి వ్యక్తీ కాలహరణంకోసం ఏదో వ్యాపకాన్ని కల్పించుకుంటాడు.

పరిస్థితుల ఒత్తిడివల్ల ఆ వ్యాపకం ఏదో ఘనకార్యానికి దారి తీస్తుంది.

అప్పుడు జీవితంలో ఏదో ఘనకార్యాన్ని సాధించా ననుకుంటాడు పిచ్చిమానవుడు.

కాని పరిస్థితులే అనుకూలించకపోతే అతను ఏమి సాధించ గలడని ?

నిజంగా సాధించే దెవరు ? మానవుడా ? అనుకూల పరిస్థితులా? ఏమో ?

లేక అనుకూల పరిస్థితుల ఒత్తిడికి మానవుడు నిమిత్తమాత్రుడుగా నిలిచి ఒక కార్యాన్ని సాధిస్తాడా ? ఏమో ? అంతా అయోమయం.

కలకాలంనించీ కవులు తమ కావ్యాల్లో ప్రేమని ఎంతో అందంగా చిత్రిస్తూవచ్చారు.

ఆ కావ్యకల్పనల్ని చూచి ముగ్ధులై, ప్రేమంటూ ఒకటి వుందని ప్రజలు నమ్ముతూవచ్చారు.

నిజంగా ప్రపంచంలో ప్రేమంటూ ఒకటి వుందా ?

ఇది కవులు కలకాలంనించీ ప్రజల కెక్కిస్తున్న మత్తుమందు కాదుకదా ?

ప్రేమకి సంబంధించినంతవరకు అస్తినాస్తి విచికిత్సలు అనవసర మనిపించాయి మధుకి. ప్రేమవల్ల సత్కాలక్షేపం జరుగుతుంది. ఎదుటి హృదయంలో ప్రేమవల్ల ఒక వ్యక్తినిగూర్చి సదభిప్రాయం ఏర్పడు తుంది. ప్రేమ "మంచి" ని పైకి ఎత్తుతుంది. "చెడు" ని మాపం చేస్తుంది.

ఏ వ్యక్తినిగూర్చి అయినా అతను సాధించిన ఘనకార్యాల్ని మనం విచారించం. అతను "మంచి"వాడా, "కాడా" అని మాత్రం మనం అడుగుతాం. ప్రపంచంలో మంచీ, చెడూ ఈ రెండే గణనీయాలు.

"ప్రేమ" మంచిని ప్రోత్సహించి ప్రజల్ని సన్మార్గావలంబుల్ని చేస్తుంది.

పరిస్థితులు అనుకూలిస్తే ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని ప్రేమిం చడం జరుగుతుంది - లేకపోతే లేదు.

"ఏఁ జరిగింది ?"

లేక్‌గార్డన్స్‌లో పరిస్థితులు అనుకూలించడంవల్ల తను నళినిని ప్రేమించడం జరిగిందేమో ?

లేకపోతే వాంఛించడం జరిగిందేమో ?

"ఎందుకు జరిగింది ?"

రెండవది పిచ్చిప్రశ్నగా తోచింది మధుకి. అది మొదటి పశ్న లోని ఒకభాగం. మొదటి ప్రశ్నకి సమాధానం ఆలోచించినప్పుడే రెండవ ప్రశ్నకి కూడా సమాధానం వచ్చింది. పరిస్థితుల ఒత్తిడివల్ల తలవనితలంపుగా ఒకకార్యం జరిగింది. తత్ఫలితంగా తను నళినిని వివాహం చేసుకోవలసి వచ్చింది.

పైగా కార్యకారిణీ సంబంధాన్నిగూర్చి ఆలోచించడం వేదాంతుల పని. వాళ్ళకే ఆరహస్యం అభేద్యమైనప్పుడు వాళ్ళముందు తనెంతటి వాడని ఆ సమస్యని గూర్చి పర్యాలోచించడానికి ?

పెళ్ళినాడే తను హిమాయత్ నగరంనించి ఉమామహేశ్వరరావు గారి యింటికి మారాడు. ఉదయమే వివాహం జరిగింది. ఆనాడంతా ఎడతెరిపి యివ్వని వేడుకలతో గడిచిపోయింది.

తన వివాహాన్ని గూర్చి కుసుమ అభిప్రాయ మేమిటో ? తను ఆ విషయాన్ని గూర్చి ఎన్నడూ ఆలోచించలేదు. తన విషయమై ఆమెకు సదభిప్రాయం వుండివుండదు.

ఆమె దృష్టిలో తను ఒక మోసగాడు కాదుగదా ?

డబ్బు కాశపడి మాయోపాయాలు పన్ని, నళినిని లోబర్చుకున్న దుష్టుడు కాదుగదా ?

ఏమో ?

తన విషయమై ఆమె అభిప్రాయం అంతే అయివుంటుంది.

దానికి కారణం లేకపోలేదు.

తను మొదట కుసుమని ప్రేమించాడు. కొంతకాలంపాటు ఆమెతో ప్రేమ కలాపాలు నడిపాడు. ఇంతలోకే ఆ ప్రేమ భగ్నమైంది. ఆ తరువాత కొద్దికాలానికే నళినిని వివాహం చేసుకున్నాడు. కుసుమ నళినుల ప్రేమోదంతాల మధ్య కొంత కాలవ్యవధి వుంది. ఆ వ్యవధిలో తన హృదయం శూన్యంగా వుండింది. ప్రేమకి సంబంధించిన ఒక సంఘటన పరిసమాప్తి జెందింది. కొంతకాలంవరకు ఇంకొక సంఘటన ప్రారంభం కాలేదు. రెండవ ప్రేమోదంతం ప్రారంభం కావడంతోనే పరాకాష్ఠ పొందింది. అంత స్వల్ప వ్యవధిలో రెండవ ప్రేమోదంతం పరాకాష్ఠ పొందడానికి గల కారణా లేమిటో కుసుమకు తెలియవు. అందువల్లనే ఆమె తనని తప్పుగా అర్థం చేసుకొనివుంటే వుండవచ్చు.

ఆమె అభిప్రాయానికి ఎంత ఆలోచించినా తను ఏమాత్రం బాధ్యుడు కాడు.

తనని గూర్చి ఇతరులు ఏమనుకుంటున్నారోనని మానవుడు అంతగా భయపడడం దేనికో, మధుకి అర్థం కాలేదు.

తనని గూర్చి కుసుమ అభిప్రాయం ఏమైతేనేం ? దానికి తను అంత ప్రాధాన్యత నివ్వడం దేనికి ?

ఇతరుల అభిప్రాయాలపైన ఆధారపడి తను జీవితాన్ని గడుపు తున్నాడా ? లేదే ? మరెందుకీ తాపత్రయం తనకి ? ఏమో ?

తను దుర్మార్గుడైనప్పటికీ, ఇతరులు తన విషయంలో సదభి ప్రాయం కలిగివుండాలని కోరుకుంటాడు మానవుడు. కాగా సదభిప్రాయం కలిగించడానికి విశ్వప్రయత్నం చేస్తాము. దుర్మార్గుడు సన్మార్గు డనిపించు కోవడానికి ఆరాటపడుతాడు. అదీ ఒక బలహీనత.

తన విషయంలో కుసుమకి గల అభిప్రాయాన్ని గూర్చి ఆలో చించడంలో తనూ అదే బలహీనతకు గురి అవుతున్నాడా ? తను

చెడ్డవాడని కాదు. కాని మంచివా డనిపించుకోవడానికి తనకు ఎందుకంత తాపత్రయమో తనకే అర్థం కాలేదు.

ఒక కాలంలో కుసుమని గూర్చి తనకు మంచి అభిప్రాయం వుండింది. ఇప్పుడు తనకు ఆ అభిప్రాయం వుందో, లేదో కూడా తను చెప్పలేడు. ఎందుకంటే, ఆమెని గూర్చి ప్రస్తుతం తను ఏమీ ఆలోచించడంలేదు కనుక.

కుసుమ ఈమధ్య తనకి దూరదూరంగా మసలుకుంటున్నది. ఎంతో అవసరముస్తేనేకాని తనతో మాట్లాడడంలేదు. మాట్లాడినా ముక్తసరిగా మాట్లాడుతుంది. ఏదో తనని పిలవవలసివస్తే "అన్నయ్యా" అని పిలుస్తుంది. "అన్నయ్యా" అని పిలవడం దేనికో తనకు మొదట అర్థం కాలేదు. వదిన భర్త "అన్నయ్య" అవుతాడని ఆ తరువాత సమన్వయించుకున్నాడు మధు. ఎందుకో ఆ వరుస తనకు నచ్చలేదు. మొన్న మొన్నటివరకు "మీరు", "మీరు" అని ఆమె తనని సంబోధించి, ఇప్పుడు అమాంతంగా ఆమె తనని "అన్నయ్యా" అని పిలవడం, మధుకి వెగటుగా తోచింది. ఇటీవలివరకు తను కుసుమకి ప్రియుడు. ఆమె తన ప్రేయసి. అప్పుడు ఆమె తనని "మీరు", "మీరు" అని సంబోధించింది. ప్రస్తుతం ఆ అనుబంధం ఏమైనట్లు? గాజులు చిట్లిననాటినించి తెగిపోయిందా? పోనీ, తెగిపోయిందే అనుకుందాం. కొద్దిపాటి కాల వ్యవధితో ఇంకొక అనుబంధం ప్రారంభమైందా? పోనీ, ప్రారంభమైందే అనుకుందాం. ఆ వెంటనే పూర్వపు సంబంధాన్ని విస్మరించి, నూతన సంబంధాన్ని అనుసరించి, అదే వ్యక్తిని కొత్తవరుసతో పిలవడం సాధ్యపడుతుందా? సంఘటనలు జరిగినంత వేగంగా హృదయం పరివర్తన పొందుతుందా? అసాధ్యం. తనని కొత్తవరుసతో పిలువడానికి కుసుమ హృదయం ఎలా ఒప్పుకుంది? కొంతకాలంపాటు తనని ఏవరుసతో సంబోధించకండా ఉండినా బాగుండేది. తన హృద

యానికి కొంత శాంతి కలిగేది. కొత్తవరుసతో కుసుమ తన పూర్వస్మృ
జ్ఞాపకాల్ని కెలుకుతున్నది. తనజీవితాన్ని కంటకావృతం చేస్తున్నది.

మధుకి కుసుమ అంటే ద్వేషం ఏకోశానా లేదు. కాని ఆమె ఇటీవలి ప్రవర్తన అతనికి బొత్తిగా నచ్చడంలేదు.

కుసుమ రామచంద్రయ్యని "మామయ్యా" అని పిలవడం, మధు చెవిని పడింది. నళిని అతనిని ఏవరుసతోనూ పిలువదు. "రామచంద్రయ్య గారూ" అని మామూలుగా అంటుంది. కుసుమకి అందరినీ వరుసలు పెట్టి పిలవడం ఒకసరదా అయివుంటుంది.

ఒకనాటి ఉదయం తనూ, నళినీ కలిసి టీ పుచ్చుకుంటున్నారు. అప్పుడు ఈవరసల ప్రసక్తి వచ్చింది.

"కుసుమ మిమ్మల్ని 'అన్నయ్యా' అని పిలవడం నాకేమీ బాగుండ లేదు" అంది నళిని, టీ చప్పరిస్తో.

"ఎందువల్ల ?" అని అడిగాడు మధు, ఏమీ తోచక.

"ఇటీవలివరకూ మిమ్మల్ని ఏవరుసతోనూ పిలిచేదికాదు. కాని మనపెళ్ళినాటినించీ మిమ్మల్ని 'అన్నయ్యా' అని పిలవడం ఆరంభించింది" అంది నళిని, సంగతి సందర్భాలు వివరిస్తో.

"అందులో తప్పేముంది ?" అని అన్నాడు మధు, కుసుమని వెనకవేసుకొస్తూ, అల్లాచేయడం అతనికి ఏమాత్రం ఇష్టం లేకపోయినా.

"తప్పని కాదు. ఆ వరుస కర్కశంగా ఉందేమోనని ?" అంది నళిని, తన అభిప్రాయాన్నివి స్పష్టపరుస్తో.

"అంటే నీ ఉద్దేశం ?" అని అడిగాడు మధు, నళిని ఆలోచనా వైఖరిని పూర్తిగా అర్థంచేసుకుందామనే ఉద్దేశంతో—

"ఏముంది ? కుసుమ మిమ్మల్ని ఆ వరుసతో పిలవడం మనం దోషులమని మాటిమాటికీ ఎత్తిచూపినట్లు ఉంది" అంది నళిని అసలు విషయాన్ని బైటపెడుతో.

"మనం దోషులం కామనే నీ ఉద్దేశమా?" అని అడిగాడు మధు, ఇంకా ఆ విషయాన్ని తరచిచూడడానికి ప్రయత్నిస్తో.

"అవును. కామనే నా ఉద్దేశం. కాని మీరేమనుకుంటున్నారో ?" అని అంది నళిని, మధు అభిప్రాయాన్ని తెలుసుకుందామనే కుతూహలం కొద్దీ.

"మొదటి ప్రయత్నం విఫలం కావడంతోనే, కుసుమకి ఆవిషయం తిరిగి ఆలోచించుకోవడానికైనా వ్యవధి యివ్వక, నేను రెండవ ప్రయత్నానికి పూనుకొని, నిన్ను బుట్టలో వేసుకున్నానని ఆమె అభిప్రాయమవుతే..." అని మధు, నళిని ప్రశ్నకి పైకి ఆలోచిస్తున్న ధోరణిలో అసమగ్రంగా సమాధానం చెప్పాడు.

"తగినంత కాలవ్యవధి లభిస్తే, కుసుమ తన మనస్సు మళ్ళించుకొని, తిరిగి మిమ్మల్ని ప్రేమించగలిగి ఉండేదేమోననా మీ అభిప్రాయం?" అని అడిగింది నళిని మధుని కొంటెగా, కావాలని మధు అభిప్రాయాన్ని తప్పుగా అర్థం చేసుకుంటూ.

"నా అభిప్రాయమది కాదు. కాని అదే ఆమె అభిప్రాయమవుతే, ఆమెదృష్టిలో మనం ఉభయులమూ దోషులమే" అని నిక్కచ్చిగా తేల్చి చెప్పాడు మధు, నళిని ప్రశ్నకి జవాబుగా.

"నేను మన ప్రేమోదంతాన్ని గూర్చి ఏ దాపరికం లేకండా కుసుమతో చెప్పినప్పుడు, ఆమె తన విషయం నాతో ప్రస్తావించవలసిందే" అని అంది నళిని అమాయకంగా.

"అది చాలా సున్నితమైన విషయం. నువ్వు నీప్రేమలో మునిగి తేలుతున్నప్పుడు ఆమె తనప్రసక్తి ఎల్లా తెస్తుంది ?" అని అడిగాడు మధు నళినిని.

"పోనీ, 'పెళ్ళిచేసుకోకండా కొంతకాలం ఆగమని ఆమె నాతో చెప్పిఉండకూడదా ?" అని అడిగింది నళిని, తిరిగి అమాయకంగా.

"దానివల్ల ప్రయోజనం ? మనిద్దరిమధ్య జరగవలసిందేదో జరిగి పోయింది. అప్పుడు కొంతకాలం ఆగమని చెప్పడం, నీ ఆనందానికి అంతరాయం కలిగించడం అవుతుంది" అని అన్నాడు మధు జవాబుగా.

"అదీ నిజమే. కాని ఇప్పుడు ఆమెముందు మన నిర్దోషత్వాన్ని నిరూపించుకోవడానికి మార్గం ?" అని అడిగింది నళిని, కుసుమపై తనకుగల ప్రేమకొద్దీ.

"ఏమీలేదు—ఆమెతో ఏవిషయం మాట్లాడకండా ఉండడమే మనం ప్రస్తుతానికి చేయదగ్గపని. మనం ఏమైనా మాట్లాడడానికి పూను కుంటే, మనం నిజంగా దోషులమనీ, ఆ విషయాన్ని కప్పిపుచ్చడానికి మనం శాయశక్తులా ప్రయత్నిస్తున్నామని ఆమె తప్పకుండా అనుకోవడం జరుగుతుంది. దానివల్ల కీడుతప్ప మేలేమీ జరగదు" అని విస్పష్ట పరిచాడు మధు.

"మన పెళ్ళి అయినప్పటినించీ కుసుమ ఆదోరకంగా ప్రవర్తి స్తున్నది. నాతో ఎంతో చనువుగా ఉండేదల్లా గంభీరంగా ఉంటున్నది. ఎవ్వరితోనూ మాట్లాడదు. పనిచేస్తే గంటలతరబడి పనిచేస్తూనే ఉంటుంది. లేకపోతే ఏపనీ ముట్టుకోదు. చదువుకుంటే తన గదితలుపులు లోపల్నించి వేసుకొని గంటలతరబడి చదువుతూనే కూర్చుంటుంది. లేక పోతే రోజులతరబడి పుస్తకం ముట్టుకోదు. పరీక్షలుకూడా దగ్గర బడుతున్నాయి. కుసుమ ఈ సంవత్సరం ప్యాసు అవుతుందోలేదో అని నాకు భయంగా ఉంది" అని చెప్పింది నళిని, కుసుమ ప్రవర్తననిగూర్చి మధుతో.

"చిత్తచాంచల్యం కలుగలేదు కదా ?" అని అడిగాడు మధు ఆదుర్దాగా.

"ఇంకా కలుగలేదు. కాని త్వరలో కలిగే సూచనలు కనపడు తున్నాయి" అని చెప్పింది నళిని జవాబుగా,

"రోజూ కాలేజీకి వెడుతున్నదా ?" అని అడిగాడు మధు నళినిని.

"వెళ్ళిననాడు వెడుతుంది. లేనినాడు లేదు" అని అంది నళిని సమాధానంగా.

"మతిభ్రమణం కలిగే సూచనలు ఉన్నాయని ఎల్లా చెప్పగలిగావు ?" అని అడిగాడు మధు కొంచంగా అధైర్యపడుతూ.

"పిలుస్తే, తనని కాదన్నట్లు ఎటో చూస్తుంది. రెండుమూడుసార్లు పిలుస్తేనేకాని పలకదు" అని చెప్పింది నళిని జవాబుగా—

"అది పరధ్యానం కావచ్చు. కాని మతిభ్రమణంమాత్రం ఎన్నటికీ కాదు" అని మధు కుసుమ ప్రవర్తననిగూర్చి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

"పరధ్యానం ఎందువల్ల కలుగుతుంది ?" అని అడిగింది నళిని మధు అభిప్రాయంతో సంతృప్తిపడక.

"ఏదో విషయాన్నిగూర్చి దీర్ఘంగా ఆలోచించడంవల్ల" అని టక్కున సమాధానం చెప్పాడు మధు, మాస్టర్ముందు కుర్రవాడి ధోరణిలో.

"మనకు ఎప్పుడోకాని పరధ్యాన్నం కలగదు. కాని ఎల్లప్పుడూ పరధ్యాన్నంగా వుండేవారిని మనం ఏమని అంటాం" అని తిరిగి అడిగింది నళిని మధుని.

"ఎడతెరిపి లేకండా ఒకటేవిషయాన్ని గూర్చి ఆలోచించడంవల్ల ఆ పరధ్యాన్నం వస్తుంది" అని అన్నాడు మధు మళ్ళీ కుర్రవాడి ధోరణిలోనే.

"ఆ ఆలోచించే విషయం కడు బాధాకరమైనదై పరిష్కారానికి లొంగనిదైతే ?" అని అడిగింది నళిని సూటిగా.

"ప్రమాదకరమే" అని ఒప్పుకున్నాడు మధు. నళిని ధోరణిని ఆకళింపు చేసుకొంటో—

"అందువల్ల మనం ముందుగానే జాగ్రత్తపడడం అవసరం" అని హెచ్చరిక చేసింది నళిని.

"ఆ జాగ్రత్తపడడం ఏలాగో నాకు ఏమీ తోచడంలేదు" అని అన్నాడు మధు తన నిస్సహాయతని విశదీకరిస్తో.

"కుసుమపట్ల సానుభూతితో మెలగడమే మనం ప్రస్తుతానికి అవలంబించవలసిన జాగ్రత్త. ఒక్క సానుభూతేకాదు మీరు మొదటి లాగా ఆమెతో చనువుగా ప్రవర్తించినా నాకేమీ అభ్యంతరం వుండదు" అని తన అభిప్రాయాన్ని విస్పష్టపరిచింది నళిని.

"అంటే వీలవుతే మొదటిలాగ అమెతో ప్రేమకలాపాలు కూడా నడపమనా నీ ఉద్దేశం?" అని అడిగాడు మధు చల్లకొచ్చి ముంత దాచడమెందుకని.

"ఊఁ" అని క్లుప్తంగా తన అంగీకారాన్ని తెలియజేసింది నళిని.

"అవి ఏదైనా ప్రమాదానికి దారితీస్తే?" అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు మధు.

"నా ఉద్దేశంలో వ్యవహారం అంతదూరం వెళ్ళనేవెళ్ళదు. కుసుమ తిరిగి మామూలు మనిషైతే అంతదూరం వెళ్ళినా నాకేమీ అభ్యంతరం వుండదు" అని తన గుండెనిబ్బరాన్ని వెలిబుచ్చింది నళిని.

"నీ కాళ్ళమీద నీవే గొడ్డలి కొంటుకుంటున్నావు" అని హెచ్చరిక చేశాడు మధు నళినికి.

"నేను అధోగతిపాలయినా కుసుమని రక్షించుకోగలిగితే నాకు అంతేచాలు" అని కల్లాకపటం లేకుండా పలికింది నళిని యువహృదయం.

"నీ ధైర్యసాహసాలు చూస్తే ఒకొకసారి నాకే ఆశ్చర్యమేస్తుంది" అన్నాడు మధు నళిని త్యాగతత్పరతకి మంత్రముగ్ధుడవుతూ.

"అమ్మా, దొంగా అంతా వుత్తదే—నన్ను ఉబ్బించడానికి అల్లా అంటున్నారు" అని గొల్లుమంది నళిని.

"ఒట్టు" అని అన్నాడు మధు ఆమెకి నమ్మకం కలిగించే ఉద్దేశంతో.

"పైగా ఇదొకటా ?" అని తిరిగి గొల్లుమంది నళిని.

అంతటితో సంభాషణ సరససల్లాపాల్లోకి జారింది.

ఆ సంవత్సరం కుసుమ పరీక్షకి వెళ్ళలేదు. "బొత్తిగా చదువలేదు అందుకోసం వెళ్ళ"నని మొండికేసింది. నళిని చెప్పిచూచినా లాభం లేకపోయింది. కుసుమకి ఈమధ్య పరధ్యాన్నం మరీ ఎక్కువైంది. ఇంటివిషయం కూడా పట్టించుకోవడంలేదు. గంటలతరబడి ఒంటరిగా కూర్చుంటుంది. ఎవ్వరైనా దగ్గరికి వెడితే కసురుకుంటుంది. ఇప్పుడు యింటిపెత్తనంకూడా నళినినెత్తిమీద పడింది. నళినిఅంటే మొదట ఎంతో గౌరవం ఉండింది కుసుమకి. ఆ గౌరవం కాస్తా క్రమంగా తగ్గిపోతున్నది. ఇంట్లో ఏపనీ ముట్టుకోదు. ఏ పుస్తకం చేతబట్టదు. ప్రొద్దస్తమానం తనగదిలో వూరికే గడుపుతుంది. కుసుమ నళినికి ఒక తీరని సమస్యగా పరిణమించింది.

"నాతో చెప్పవూ, నీకేం బాధో ?" అని నళిని ఒకరోజు కుసుమ గదిలోకి వెళ్ళి, ఎంతో ఆప్యాయంగా అడిగింది.

కుసుమకి ఆ ప్రశ్న అర్థమైనట్లు కనపడలేదు. నళినికి జవాబుగా కుసుమ బిత్తరచూపులు చూచింది. అమాంతంగా నళినికి లోపలినించి దుఃఖం పొంగుకొచ్చింది. ఎంత ఆపుకున్నా అది ఏమాత్రం ఆగలేదు.

"చెప్పవూ ? నీకేం బాధో ? నేను నీ వదిననికానూ ?" అని నళిని తన ప్రశ్నని రెట్టించింది, కుసుమమొహంలో తనమొహం పెడుతూ, ఆమెని తన కౌగిలిలో చేర్చుకుంటూ.

"చెప్పు నీకోసం ఏంచేయమన్నా చేస్తాను" అని తిరిగి అడిగింది నళిని. కుసుమ మొహంలోంచి తన మొహం తీయకుండానే.

కుసుమ ఏమీ మాట్లాడలేదు. ఏదో ఇంకోలోకంలో వున్నట్లు కనపడింది నళినికి.

"నీకు మధు కావాలా ? పోనీ మధుని యివ్వమన్నా యిస్తాను" అని నళిని గొల్లున ఏడ్చేసింది.

దానికీ ఏమీ జవాబుచెప్పలేదు కుసుమ. కాని నళిని ఆ వాక్యం పలకకండా, తన అరచెయ్యి ఆమెనూతికి గట్టిగా అడ్డంపెట్టింది. అప్పటికీ ఆ వాక్యం అస్పష్టంగా వినపడింది.

"కావలిస్తే మధుకి డైవోర్సు యిస్తాను. నువ్వు పెళ్ళిచేసుకొని సుఖంగావుంటే నాకదే చాలు" అని పొంగి పొరలివస్తున్న దుఃఖంలో చెప్పలేక చెప్పలేక చెప్పిచూచింది నళిని.

తనచేతిని తిరిగి ఇంకొకసారి నళినినోటికి అడ్డంపెట్టడంతప్ప, కుసుమ ఇంకేమీ చేయలేదు. చివరకి కంటతడిఅయినా పెట్టలేదు.

"నీకు వొంట్లో బాగాలేదా ? చెప్పు డాక్టర్నైనా పిలిపింతాం" అని అడిగింది నళిని తన దుఃఖాన్ని దిగమ్రింగుతో.

దానికీ సమాధానం చెప్పలేదు కుసుమ. ఎక్కడో శూన్యంలోకి చూస్తో మౌనం వహించింది.

నళిని ఏడ్చినంతసేపు ఏడ్చి, తన కళ్ళు తానే తుడ్చుకొని, అక్కడినించి లేచి తనగదిలోకి వెళ్ళింది.

మరుసటిరోజున, మనోవ్యాధికి సంబంధించిన యిద్దరు డాక్టర్లని రప్పించింది నళిని. వాళ్ళు కుసుమని దీర్ఘంగా పరీక్షించి ఏవో మందులు ఇంజెక్షన్లు వ్రాసియిచ్చారు. బ్రేన్‌కి ఏదో షాక్ తగిలిందని చెప్పారు. కుసుమ పరీక్షకి ఏలాటి అభ్యంతరం చెప్పలేదు. నళిని మందులూ, ఇన్‌జెక్షన్‌లు తెప్పించింది. చికిత్స సాగుతున్నది.

ఎండాకాలం శలవలు—

మధు నళినులకి ప్రొద్దు గడవడం కష్టమైంది. ఏ బోంబేకో, ఏ కలకత్తాకో, నాలుగురోజులు వెళ్ళివత్తామనుకుంటే కుసుమని ఆస్థితిలో వదిలివెళ్ళడం వాళ్ళకి ఏమాత్రం మనస్కరించలేదు. అందుకోసం ఎక్కడికి వెళ్ళకండా నగరంలోనే ఎండాకాలం గడవడానికి నిశ్చయించుకున్నారు.

నళినిది బి. ఏ. మొదటిసంవత్సరం. పరీక్షల్లో ఎల్లావ్రాసినా ఆమె ఏలాగో ప్యాసు అయిపోతుందనుకున్నాడు మధు. కాని వచ్చినచిక్కంతా తనకే. తనది ఎం. ఏ. ఫైనల్. పేపర్లు అంతబాగా చేయలేదు. ఫిబ్రవరి చివరవారంనుంచీ అసలు చదువే సరిగ్గా సాగలేదు. ఏవో పోర్షన్లు పూర్తిచేసాడు గబగబా. రివైజు చేయడానికి టైం చిక్కలేదు. ముఖ్యమైన పోర్షన్సు చదువుకొని పరీక్షకు వెళ్ళాడు. అందులో కొన్ని ప్రశ్నలు వచ్చాయి. ప్యాసు కావచ్చుకాని క్లాసు వస్తుందో లేదో అనే అనుమానం కలిగింది మధుకి. ఎం. ఏ. లో క్లాసు రానిపక్షాన ఫేలవడమే మంచిది. తిరిగి ఇంకొక సంవత్సరం చదువుకొని క్లాసు తెచ్చుకోవచ్చు. కాని థర్డుక్లాసు వస్తేమాత్రం జీవితం వృథా అవుతుంది. ఎక్కడా ఉద్యోగం దొరకదు. తిరిగి చదువుకుందామంటే వీలుండదు. రెంటికీచెడ్డ రేవడికథ అవుతుంది తన బ్రతుకు. జరుగనున్నది జరుగకమానదు. ఇప్పుడు విచారించి ఏమిలాభమని ఎప్పటికప్పుడు సర్దిచెప్పుకుంటున్నాడు మధు తన మనస్సుకి, పరీక్షలసంగతి జ్ఞాపకమొచ్చినప్పుడల్లా.

మధుని ప్రస్తుతానికి రెండు సమస్యలు పట్టి పీడిస్తున్నాయి. ఒకటి పరీక్షాఫలితాలు. రెండు కుసుమ మతిభ్రమణం. ఇందులో మొదటిది తాత్కాలికమైంది. పరీక్షాఫలితాలు తెలియడంతోనే ఆ సమస్య ఇటో అటో తేలిపోతుంది. రెండవసమస్య తాత్కాలికంగా కనపడినా, శాశ్వత స్వరూపాన్ని దాల్చే సూచనలు కనపడుతున్నాయి. మొదటి సమస్య విషయంలో తను చేయవలసిందేమీ లేదు. జరగవలసిన కీడూ, మేలూ

ఇదివరకే జరిగిపోయింది. తను ప్రస్తుతానికి నిమిత్తమాత్రుడుగా నిలిచి ఫలితాలకోసం నిరీక్షించవలసిందే. క్లాసువస్తే జీవితం బాగుపడుతుంది. లేకపోతే అధోగతిపాలవుతుంది. రెండవసమస్య పూర్తిగా ఇకముందు తాను చేయవలసిన ప్రయత్నంపైన ఆధారపడివుంది. తన ప్రయత్నం విజయవంతమవుతే కుసుమ బాగుపడి బట్టకడుతుంది. ఆమె తిరిగి మామూలుమనిషి అవుతుంది. రెండవసమస్య తన సహాయాన్ని అర్థిస్తున్నది. నళిని తాను చేయవలసిన ప్రయత్నం ఇదివరకే చేసింది. కాని ఆమెకు ఆ సమస్య ఏమాత్రం లొంగలేదు ఇంక మిగిలింది ఒక్కటే తన ప్రయత్నమే. తను పుట్టిన వేళావిశేషమేమిటో పరిస్థితులకి అనుగుణంగా నడుచుకోవడంతప్ప, తను ఏపనీ సాహసించి చేయలేడు. నళిని ప్రోద్బలం లేకపోతే, తను పలానిపని చేయాలనికూడా తనకు తట్టి వుండేదికాదు. ఫలానిపని చేయక తప్పదని ఆమె తనని ఆదేశించింది ఆ ఆదేశానుసారం తను నడుచుకుంటున్నాడు. ఆపని చేయడానికి తను పూనుకుంటున్నాడు. ఇందులో తన ఘనత ఏముంది? ఏమీలేదు. ప్రేరణశక్తులు తన వెనకాల నిలిచి, ఆ పనికై తనని ప్రోత్సహిస్తున్నాయి. తను నిమిత్తమాత్రుడుగా నిలిచి ఆ ప్రేరణశక్తులకి లోబడుతున్నాడు. అంతే. తను ఆ ప్రయత్నానికి పూనుకోవడానికి పూర్వం కుసుమ రోగ లక్షణాలేమిటో ఒకమాటు ఆలోచించడం అవసరమనుకున్నాడు మధు. తదనుగుణంగా కుసుమ రోగలక్షణాల్ని గూర్చి ఆలోచించడం మొదలు పెట్టాడు. కుసుమ ఎవ్వరితోనూ మాట్లాడదు. ఏపనీ ముట్టుకోదు. అన్న పానీయాలవంటి నిత్యకృత్యాలు తు. చ. తప్పకుండా జరుపుతుంది. మనిషి శుచిగా వుంటుంది. తన నిత్యకృత్యాల విషయంలో ఎవ్వరినీ బాధించదు. మామూలుగా మతిభ్రమణ లక్షణాలేమీ ఆమెలో కనపడవు. దుఃఖంగాని, విచారంగాని ఏ కోశానా కనపడదు. కంటనీరు పెట్టినట్టు ఆమెమొహం

ఎప్పుడూపట్టివ్వదు. గంటలతరబడి మౌనంగా కూర్చుంటుంది. ఏమిఆలో
చిస్తుందో చెప్పడం కష్టం. అసలు ఆలోచిస్తుందో లేదో కూడా తెలియదు.
సాయంత్రం నాలుగుగంటలకి "టీ" త్రాగడం తనకు మామూలు. ఒక
సారి నాలుగుగంటలకి టీ త్రాగినతరువాత, ఆరుగంటలకి తిరిగి టీ
త్రాగడమంటే తనకు యిష్టముండదు. కాని ఉమామహేశ్వరరావుగారి
యింట్లో ట్యూషన్ ఒప్పుకున్న కొద్దిరోజులకి సాయంత్రం ఆరుగంటలకి
కూడా టీ త్రాగడం అలవాటైంది. ఆ రోజుల్లో కుసుమ స్వయంగా టీ
తీసుకొచ్చేది. ఆమె తెచ్చిన టీ త్రాగడం తనకు ఎంతో సరదాగా వుండేది.
గాజులు చిట్లిన మరుసటిరోజునించి ఆమె స్వయంగా టీ తేవడం
మానుకొని పనిమనుషులతో పంపించడం మొదలుపెట్టింది. ఆ రోజుల్లో
తను యిష్టమొస్తే టీ త్రాగేవాడు. లేకపోతే మానుకునేవాడు. టీ పుచ్చు
కోవడం పుచ్చుకోకపోవడం తన యిష్టాయిష్టాలపైన ఆ రోజుల్లో ఆధార
పడి వుండేది. కాని ఎవ్వరిమనస్సుకైనా ఎందుకు నొప్పికలిగించడమని
సాధారణంగా త్రాగుతూనే వుండేవాడు. ఆతరువాత తను నళినిని పెళ్ళి
చేసుకొని ఉమామహేశ్వరరావుగారి యింట్లోనే వుండడం మొదలెట్టాడు.
తను రోజూ సాయంత్రం నాలుగుగంటలకి "టీ" త్రాగుతున్నప్పటికీ,
ప్రతి సాయంత్రం ఆరుగంటలకి తనకు "టీ" పంపిస్తూనేవుంది
కుసుమ. టీతోపాటు యథాపూర్వం బిస్కట్లుకూడా వస్తున్నాయి.
కుసుమ తన మతిభ్రమణకాలంలో కూడా "టీ" సంగతి ఎల్లా మరచి
పోలేకుండా వుందో, మధుకి అర్థంకాలేదు. సాయంత్రం ఆరుగంటలు
కాగానే తన గదిలోంచి వెలుపలికి వచ్చి "మాస్టర్‌గారికి టీ తీసుకెళ్ళ"
మని ఎదురుగా ఏ పనిమనిషి కనపడితే ఆ పనిమనిషితో చెబుతుంది.
ట్రేలో బిస్కట్లు తానే అమర్చుతుంది. ఆ మనిషి టీ పైకి తీసికెళ్ళేదాకా
అక్కడే నిలబడుతుంది. టీ పైకివెళ్ళగానే తన గదిలోకి వెళ్ళిపోతుంది.
తక్కిన అన్నివిషయాల్లో ఎంతో అశ్రద్ధగా వుండి టీ విషయంలో

మాత్రం కుసుమ అంతశ్రద్ధ చూపడమేమిటి? పరీక్షల అనంతరం తను కిశోర్‌కి చదువుచెప్పడం మానివేశాడు. నళిని తనదైనప్పటినించీ ఆ యింట్లో తన ప్రతిపత్తి మారింది. పరీక్షలకి పూర్వం తను కిశోర్‌కి చదువు చెప్పినప్పటికీ మాష్టర్‌గా చెప్పలేదు. కుటుంబసభ్యుడుగా బంధువుగా చెప్పాడు. కాగా పరీక్షలకు పూర్వమే తను ఆ యింటికి మారాడు. కుసుమ ఈ మార్పులన్నిటినీ గమనించడంలేదు. ఒకకాలంలో రోజూ ఎక్కడెనించో వచ్చివెళ్ళే మాష్టర్‌ని మాత్రం తన హృదయంలో నిలుపుకున్నది. అతన్నిధ్యానిస్తున్నది. పూజిస్తున్నది. నళినిపెళ్ళిచేసుకున్న మధుని ఆమె గుర్తించడంలేదు. కుసుమతో సంబంధం తెగిపోయి ఇంకా నళినితో సంబంధం ఏర్పడక, కొన్నిరోజులు సంధికాలంలో జీవితాన్ని గడిపిన మధునికూడా ఆమె అంగీకరించడంలేదు. మాష్టర్‌గా వచ్చివెళ్ళి తన ప్రియుడిగా పిలసిల్లిన మధుని మాత్రమే ఆమె స్వీకరిస్తున్నది. ఆ యింట్లో అడుగు పెట్టిందేతడవుగా, తను కుసుమ ప్రియుడిగా అవతరించాడు. ఇది మధుకి సంబంధించిన ప్రథమదశ. కుసుమతో సంబంధం విడిపోయి, నళినితో సంబంధం ఏర్పడనికాలం, సంధికాలం. ఇది మధుకి సంబంధించినంతవరకు ద్వితీయదశ. నళినితో సంబంధం ఏర్పడి ఇంకా కొనసాగుతున్నకాలం మధు తృతీయదశకు సంబంధించింది. ఈ మూడుదశల్లో కుసుమ ప్రథమదశనిమాత్రమే గుర్తించి మిగిలిన రెండుదశల్ని త్రోసివేస్తున్నది. కుసుమ చిత్తచాంచల్యానికి ఇదీ నిజమైన కారణం. దీర్ఘంగా ఆలోచిస్తే కుసుమ ప్రేమైకజీవి. ప్రేమవినా ఆమె బ్రతకలేదు. మధుతో పరిచయం కలగకపూర్వం ఆమె నళినిని ఆరాధించింది. నళినికి సపర్యలు జరిపింది. నళిని చెప్పుచేతల్లో మెలగింది. ఆతరువాత మధు ఆమె జీవితంలో ప్రవేశించాడు. దానితో తన ఆరాధనని మధుపైకి మళ్ళించింది. మధుని ఆరాధ్యదేవతగా స్వీకరించింది. అతని కనుసన్నల్లో మెలగడం తనవిధి అని భావించింది. ప్రతి సాయంత్రం

అతనికి టీ పంపించడం, ఆ ఆరాధన లక్షణమే. ప్రేమపరిధుల్ని దాటి ఆరాధనవరకు వెళ్ళడం ఆమెనైజం. గాఢానురాగం సహజంగా ఆరాధన స్వరూపాన్ని దాలుస్తుంది. కుసుమ జీవితం ఒక లతవంటిది. ఆ లత ఏ మహావృక్షాన్నో అల్లుకోవడం అవసరం. మధుప్రేమ భగ్నం కావడంతో ఆ లతకి అల్లుకోవడానికి ఇంకొకవృక్షం దొరకలేదు. ఒక ఆరాధ్యదేవత లభించలేదు. తనుప్రేమించి ఆరాధించదగ్గవ్యక్తి, కుసుమకి ఆ కుటుంబంలో ఎవ్వరూ కనపడలేదు. ఆమెకి తండ్రినిగూర్చి సదభిప్రాయం లేదు. ఇక కుటుంబంలో మిగిలింది ఒక్క కిశోర్ మాత్రమే. ప్రేయసిదశలోనే ఆగిపోవడంవల్ల ఆమె మాతృదశని అందుకోలేదు. అందువల్ల కిశోర్‌ని ప్రేమించలేకపోయింది. మధునించి తన మనస్సు మళ్ళించుకొని తిరిగి నళినిపైన కేంద్రీకరింపజేయాలి. ఇట్టి అనిర్ణీతస్థితిలో మధు నళినులమధ్య గాఢతర అనుబంధం ఏర్పడింది. ఇటు మధుని ప్రేమించడానికి వీలులేదు. అటు నళినిని ఆరాధించడానికి అవకాశంలేదు. కుసుమకి ఒక ఆరాధ్యదేవత కనపడకపోవడంతో చిత్తచాంచల్యం కలిగింది. కుసుమని తిరిగి ఒక మనిషిని చేయాలంటే ఆమె జీవితంలో తిరిగి ఒక ఆరాధ్యదేవతని పునఃప్రతిష్ఠ చేయాలి. ఆమె ఉత్తరదశలకి సంబంధించిన మధునికాక పూర్వదశకు చెందిన మధుని ప్రేమిస్తున్నది. ఆ మధునే ఆమె జీవితంలో తిరిగి ప్రతిష్ఠించాలి. పూర్వదశకు చెందిన పరిస్థితుల నన్నిటినీ తిరిగి సమకూర్చాలి. అప్పుడుగాని ఆ చిత్తచాంచల్యం ఆమెని వీడిపోదు.

కుసుమ మతిభ్రమణానికి కారణం ఆలోచించిన తరువాత, ఒక నాటి సాయంత్రం తను మాస్టర్‌గా వటించదలచి, మధు నళినిని ఆయేషా యింటికి పంపించివేశాడు. ఆమె వెళ్ళడంతోనే తను కిశోర్ గదికివచ్చి ఆ గదిని పరిశీలించాడు. గదిలో ఏవో మార్పులు జరిగాయి. బీరువాలు, మంచం, టేబుల్, కుర్చీలు పూర్వం ఉన్నచోట లేవు. వాటికి స్థాన

భ్రష్టత్వం కలిగింది. మధు కిశోర్‌కి ఏవో నాలుగు కబుర్లు చెప్పి, అతన్ని "ఆంటీహామ్" పిక్చర్‌కి కారులో పంపించివేశాడు. కిశోర్ వెళ్ళిపోవడం తోనే మధు ఒక పనిమనిషి సహాయంతో గదిలోని వస్తువుల్ని లోగడ ఉన్నచోట పెట్టించాడు. రంగాలంకరణ సాయంత్రం అయిదు గంటల నలభై అయిదు నిమిషాలకి పూర్తి అయింది. ఆరుగంటలకల్లా రంగ స్థలంపైకి నటకులు రావాలి. వెంటనే తను కాళ్ళూ, చేతులూ, మొహం కడుక్కొని మాస్టర్ దుస్తుల్ని ధరించి, కిశోర్ గదిలోకి వచ్చాడు. వెళ్ళి సాధారణంగా మాస్టర్ కూర్చుండే కుర్చీలో కూర్చున్నాడు. ఒకమాటు గదంతా కలయజూచి, ఏ వస్తువు ఎక్కడ ఉండాలో అక్కడ ఉన్నందుకు సంతృప్తిజెంది గడియారం వంక జూచాడు. ఆరుగంటలకి అయిదు నిమిషాలు తక్కువున్నాయి. సరిగ్గా ఆరుగంటలకి ప్రణయానికి సంబంధించిన మట్టం ప్రారంభం కావాలి. అప్పుడే "మాస్టర్" ప్రియుడిగా రంగస్థలం మీదికి వచ్చాడు. ఇంక మిగిలింది ప్రియురాలి ప్రవేశం మాత్రమే. మధు వెంటనే ఒక పనిమనిషిని పిలిచి "మాస్టర్ వచ్చా"డని కుసుమకి కబురు పంపించాడు. సరిగ్గా ఆరుగంటలకి ఆమెకి ఆ కబురు అందింది. అప్పటికే ఆమె "టీ" సన్నాహంలో ఉంది. ఆ కబురు చేరడంతోనే ఆమె ఒక ట్రేలో విడివిడిగా పాలు, డికాషన్, చక్కెర పాత్రలు అమర్చి, ఒక చిన్న వెండిపళ్ళెంలో కొన్ని బిస్కట్లు పెట్టుకొని ట్రే తీసుకొని నెమ్మదిగా పైకివచ్చింది. పాదాల చప్పుడు కావడంతోనే కుసుమ వస్తున్నట్లు గ్రహించి, మధు మెట్లకేసి చూచాడు. సూర్య బింబానికిమల్లే మెట్లపైన కుసుమ క్రమంగా ఉదయిస్తున్నది. ఆ దృశ్యానికి మధు హృదయం సంతోషాతిశయంతో ఎగిరి గంతువేసింది. కుసుమ ట్రేతో గదిగుమ్మం దాటి గదిలో ప్రవేశిస్తున్నది. మాస్టర్ తలెత్తి సన్నగా చిరునవ్వి ఆమెకి సుస్వాగతం చెప్పాడు. కుసుమ పెదవులు చిన్ని నవ్వుగా విడిపడ్డాయి. ఇద్దరి చూపులు కలిసాయి. బలవంతంగా తన

చూపుల్ని మాస్టర్ చూపుల్లోంచి విడదీసుకొని, కుసుమ తంబాళ్ళి ముందుకు నడిచింది. "ట్రే" టేబుల్‌పైన పెట్టి "మాస్టర్" కి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చొని "టీ" కలపడం మొదలెట్టింది.

"నళిని యింట్లో లేదా ?"

"లేదు".

"ఎక్కడికి వెళ్ళింది ?"

"ఏమో ? తెలియదు".

"ఈరోజు సాయంత్రం ఎక్కడికో వెడుతానన్నావు. వెళ్లలేదేం ?"

"ఏమో ? సాయంత్రాలు ఎక్కడికీ వెళ్ళాలని ఉండదు".

"ఎందువల్ల ?"

కుసుమ టీ కలిపి మాస్టర్‌కి ఒకకప్పు అందించింది. తను ఒక కప్పు తీసుకుంది. మాస్టర్ టీ చప్పరించడం మొదలెట్టాడు.

"బిస్కట్లు తీసుకోండి".

మాస్టర్ ఒక బిస్కెటు తీసుకున్నాడు. బిస్కటు కొరుకుతో టీ చప్పరిస్తో తిరిగి సంభాషణ ప్రారంభించాడు.

"చెప్పవేం ? సాయంత్రాలు ఎక్కడికీ వెళ్ళాలని ఎందుకుండదో ?"

ఆ ప్రశ్నకి కుసుమ బిత్తరచూపులు చూసింది. సంభాషణాక్రమం తప్పడంవల్ల. ఆ ప్రశ్న ఆమెకి అర్థంకాలేదేమో ననుకున్నాడు మాస్టర్‌గా నటిస్తున్న మధు. కుసుమని యిబ్బంది పెడుతున్న ఆప్రశ్నని వెంటనే వదిలివేసి, ఇంకొక ధోరణిలో తిరిగి సంభాషణని ప్రారంభించాడు అతను.

"ఇంట్లో కిశోర్ లేడా ?"

"ఏమో ?"

"ఎక్కడికైనా వెళ్ళివుంటాడేమో ?"

"ఏమో ? తెలియదు."

"ఈ సాయంత్రం నువ్వు ఎక్కడికో వెళుతానన్నావే? వెళ్ళలేదా?"

"వెళ్ళలేదు".

"ఎందువల్ల?"

"సాయంత్రాలు ఎక్కడికీ వెళ్ళాలని ఉండదు".

"కారణం అడగవచ్చునా?"

"అడగండి?"

రైలుపట్టాలు తప్పడం లేదుకదా? ఎందుకో తప్పుతున్నట్లే తోచింది మధుకి.

"పోనీ నేను చెప్పనా?"

"చెప్పండి".

రైలుని సరిఅయిన యినుపదారిలో నడపడానికి చూచాడు మధు. కాని లాభం లేకపోయింది.

"చెప్పెయ్యనా?"

"చెప్పండి".

"ఒక అమ్మాయి, ఒక అబ్బాయికోసం ప్రతిసాయంత్రం నిరీక్షిస్తూ ఉంటుంది".

ఏవో పిచ్చిచూపులు కుసుమ కళ్ళల్లో తొణికిసలాడడం మధు లీలగా గమనించాడు.

"ఆ అబ్బాయి ఎవ్వరో తెలుసునా?"

"తెలియదు".

"పోనీ, ఆ అమ్మాయి ఎవ్వరో తెలుసునా?"

"లేదు".

రైలంటూ ఒకటి ఉంటేకదా తాత్కాలికంగా పట్టాలు తప్పడానికి? అసలు రైలే లేదేమోననే అనుమానం వేసింది మధుకి.

"ఆ అమ్మాయిని నేను చూపనా ?"

"చూపండి".

మధు తన టీ కప్పు టేబుల్‌పైన పెట్టి, అప్యాయంగా కుసుమని సమీపించాడు. ఆమె బెదురుతో వెనక్కి తగ్గడం మొదలెట్టింది. అడుగు ముందుకు వేసి, మధు కుసుమని తన కౌగిలిలో చేర్చుకోవడానికి ప్రయత్నించాడు. "మీ పుణ్యం ఉంటుంది నన్ను చెరచకండి" అని అరుస్తో మరీ వెనక్కి తగ్గింది కుసుమ. "మీ పుణ్యం ఉంటుంది, నన్ను చెరచకండి" అని కుసుమ అరవడంతోనే, మధు నిలుచున్నచోటనే ఆగిపోయాడు. మధు తనని వెన్నాడుతున్నాడని భ్రమించి కుసుమ ఇంకా వెనక్కి తగ్గింది. క్షణంలో మధుకి చిక్కిపోతానని భయపడింది. పిల్లికి మల్లె ముందుకు లంఘించి, ఎదురు తిరిగి మధు చెంపమీద పెళ్ళున కొట్టింది కుసుమ. ఆ దెబ్బకి మధు కళ్ళల్లోంచి అమాంతంగా మిణుగురులు రాలాయి. కళ్ళు చీకట్లు కమ్మాయి. మధు నొప్పికి గట్టిగా కళ్లు మూసుకొని, దెబ్బ తగిలిన చెంపని చేతితో తడుముకుంటుండగా, "నాకింకా పెళ్ళి కాలేదు, నన్ను చెరచకండి" అని అరుస్తూ కుసుమ క్రిందికి పరుగెత్తింది. ఆ వాక్యం వినడంతోనే, మధుకి చెంప నొప్పి ఎగిరిపోయింది. నిలుచున్నపాటున తల కొట్టేసినట్టనిపించింది. శరీరం వశం తప్పింది. కుప్పగా కూలాడు మధు కటికినేలపైన. "నాకింకా పెళ్ళికాలేదు, నన్ను చెరచకండి" అన్నమాటలు అతని చెవుల్లో హోరు లెత్తాయి. అతను రెండు చెవుల్ని తన రెండు చేతులతో గట్టిగా మూసుకున్నాడు తన బలంకొద్దీ—అయినా ఆ హోరు తగ్గలేదు. ఎడతెరిపిలేని హోరు. ఒకటే హోరు.

* * *

ఒకనాటి సాయంత్రం మధు తన గదిలో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. గడచిన రెండురోజులనించీ అతనికి మనస్సు మనస్సులో లేదు. ఉండుండి రెండురోజుల క్రితం కిశోర్ గదిలో జరిగిన సంఘటన జ్ఞాపకమొస్తున్నది. "నాకింకా పెళ్ళికాలేదు. నన్ను చెరచకండి" అన్న కుసుమ అరుపులోని ఆంతర్యమేమిటి? ఆ అరుపుని పనిమనుషులెవ్వరూ వినలేదుగదా? ఆ వాక్యాన్నే పదేపదే పలుకుతూ క్రిందికి కూడా పరుగెత్తింది కుసుమ. ఎవరు విన్నా వినకపోయినా రామచంద్రయ్య వినడం మాత్రం ప్రమాదకరమైన విషయం. కుసుమ రామచంద్రయ్య మేనకోడలు. రామచంద్రయ్య చెల్లెలినే ఉమామహేశ్వరరావుగారు లేవదీసుకొనివచ్చారు. పైగా ఆమె విధవ. చిన్నతనంలోనే ఆమెకు భర్త పోయాడు. ఆమె తన భర్త మొహం చూసికూడా ఎరగదట. కుసుమ ఉమామహేశ్వరరావుగారికే పుట్టిందట. ఈ బంధుత్వాన్ని బట్టే కుసుమ రామచంద్రయ్యని "మామయ్యా"అని పిలుస్తున్నదట. ఈ విషయాలన్నీ తనకు నళిని ద్వారా తెలియవచ్చాయి. ఆ వాక్యాన్ని రామచంద్రయ్య వింటే అతను తప్పక ఆ విషయాన్ని రంగనాయకులకి వ్రాసితీరుతాడు. తను ఒక పిచ్చి అమ్మాయిని బలవంతంగా చెరచడానికి ప్రయత్నించాడనే సంగతి రంగనాయకుల ద్వారా తన తల్లికి తెలుస్తుంది. కాగా ఆ వార్త రామచంద్రపురంఅంతా పాకిపోతుంది. అప్పుడు ఆ గ్రామంలో తను తలెత్తుకొని తిరగగలడా? "తల్లికిదగ్గకొడుకు" అని అందరూ తనని చిన్నచూపు చూస్తారు. ఆ అవమానాన్ని భరించి తను బ్రతకగలడా? తల్లి అవినీతికే ఆ గ్రామంతో తెగతెంపులు చేసుకున్న తను ఈ అపవాదుని కూడా నెత్తిమీద వేసుకొని ఆ గ్రామ ప్రజల్ని ఎల్లా ఎదుర్కోగలడు? తల్లిముందు తలెత్తి తను ఎల్లా మాట్లాడగలడు?

ఈ సంఘటనతో తన తల్లిని ఇంక ఈ జన్మలో చూడడానికి వీలులేదు. దీనితో ఆ అనుబంధం కూడా శాశ్వతంగా తెగిపోయింది. ఇంక తనకు ఒక్క నళిని మాత్రం మిగిలివుంది. ఆమె తనని తప్పుగా అర్థంచేసు కోదు. ఆ భయం తనకి ఎన్నటికీ లేదు. రామచంద్రయ్య ఆ వాక్యం వినివుంటే తప్పక తనని తప్పుగా అర్థంచేసుకొనివుంటాడు. అతని దృష్టిలో తను ఒక దోషి. కాదని నిరూపించుకోవడం ఎల్లా? పోనీ, అతనితో ఒకమాటు మాట్లాడిచూస్తే? తన నిర్దోషిత్వాన్ని నిరూపించు కోవడానికి వీలుంటుందేమో? అతను కుసుమ అరుపులు వినకపోతే ఆ విషయం కావాలని తను ప్రచారంచేసినట్లు అవుతుంది. తను అతనితో మాట్లాడినంతమాత్రాన అతను తన నిర్దోషిత్వాన్ని అంగీక రిస్తాడని ఏమి నమ్మకం? "పెద్రిబాగుల మనిషి అబద్దాలు ఎందుకు చెబుతుంది?" అని అనుకుంటాడు, అంతేకాని తన మాట నమ్మడు. "అందువల్ల అతనితో మాట్లాడి కూడా ప్రయోజనముండదు" అని అను కున్నాడు మధు. కాగా "ఎందరు ఎన్నివిధాల అనుకున్నా సన్నిహితులు మాత్రం తనని తప్పుగా అర్థంచేసుకోకపోతే అదే పదివేలు" అనికూడా అనుకున్నాడు మధు. ఒక నళిని తప్ప మిగిలినవాళ్ళంతా తప్పక తనని తప్పుగా అర్థంచేసుకుంటారు. దానికి ఏమాత్రం సందేహంలేదు. మిగిలిన వాళ్ళల్లో ముఖ్యంగా తన తల్లీ, రంగనాయకులు, రామచంద్రయ్య యిమిడివున్నారు. చివరకి పిచ్చి కుసుమ కూడా తనని తప్పుగానే అర్థం చేసుకున్నది. తత్ఫలితంగా తనని ఒక వంచకుడి క్రింద జమకట్టింది. లేకపోతే ఆ అరవడమేమిటి? "నాకింకా పెళ్ళికాలేదు, నన్ను చెరచ కండి" అని. "నళినిని పెళ్ళిచేసుకోకుండానే తను చెరచా"డని ఆమె ఉద్దేశమై వుంటుంది. లేక్‌గార్డన్సులో జరిగిన సంఘటనని గూర్చి నళిని కుసుమతో మాయమర్మాలులేకండా చెప్పివుంటుంది. తను నళినిని బలవంతంచేసి ఆమెను లొంగదీసుకున్నట్లు ఆమె మనస్సులో ఒక

భావం ఎల్లాగో హత్తుకుపోయివుంటుంది. లేకపోతే నళినివంటి గడుసు మనిషి ఏ మోసం లేకుండా అంత త్వరలో లొంగడం అసాధ్యమని ఒమె నిశ్చితాభిప్రాయమైవుంటుంది. ఏది ఏమైతేనేం కుసుమకి తన విషయంలో ఏమాత్రం సదభిప్రాయం లేదు. పైగా మతిభ్రమణ కూడా కలిగింది. మనిషి బాగై బట్టకడుతుందనే నమ్మకం కూడా మొన్నటితో ఎగిరి పోయింది. చిత్తచాంచల్యానికి కారణం తెలుసుకొని తాను మానసికంగా చికిత్సచేయడానికి పూనుకున్నాడు. ఆ చికిత్స ఎదురుతిరిగింది. దానికి ఫలితంగా ఒక పిచ్చి అమ్మాయిని బలవంతం చేశాడనే అపవాదు తనకు మిగిలింది. మంచి చేయబోతే చెడువచ్చి తన తలకు చుట్టుకుంది. కుసుమ పిచ్చి కుదిరనంతవరకు ఆ అపవాదు తొలగించుకోవడం తన తరం కాదు. అందువల్ల ప్రజల దృష్టిలో తను ఒక పిచ్చిపిల్లని బల వంతం చేసిన వంచకుడు, కిరాతకుడు. పిచ్చి ఎల్లాగూ కుదరదు గనక, కుసుమ దృష్టిలో తను ఒక గడుసరి. అంటే నళినిని మోసంచేసి లొంగ దీసిన ఒక రాక్షసుడు. తన నిష్కళంక చరిత్రలో ఇది ఒక తీరనిమచ్చ. పరిస్థితులు ఎదురుతిరిగి, తన శీలానికి ఒక తీరనిలోటుని సమకూర్చాయి. తన జీవితాంతం వరకూ ఆ మచ్చ శాశ్వతంగా నిలిచిపోతుంది. దానికి ఇక తిరుగులేదు.

"మీకు ఒక సంగతి ఎన్నో రోజులనించి చెప్పాలనుకుంటు న్నాను. కాని ఎప్పటికప్పుడు చెప్పలేకపోతున్నాను." అని అంది నళిని మధుతో ఒకనాటి రాత్రి ఏకాంతంలో.

అప్పటికే శరీరాలు అలసిపోయాయి. మధుకి నిద్ర ముంచు కొస్తున్నది.

"పోనీ, రేపు చెప్పకూడదూ?" అని మధు దీనంగా అన్నాడు నళినితో పక్కకి ఒత్తిగిలిపడుకుంటూ.

"నిద్ర వస్తున్నదా ? అమ్మో దొంగా అంతా వుత్తదే" అని నళిని కిలకిల నవ్వుతో మధు మొహాన్ని తన వేపుకి తిప్పుకుంది.

"అంత అవసరమైన విషయమా ?" అని అడిగాడు మధు పక్కకి పడుకున్న నళినిపైన చెయ్యివేస్తూ.

"అవసరమని కాదు - కాని ముఖ్యమైంది" అని అంది నళిని తన మొహాన్ని మధు మొహంలో చేరుస్తూ.

"నీ పరీక్షాఫలితాలు ఏమైనా వచ్చాయా ?" అని అడిగాడు మధు కొంచం ఆతురతగా.

"కానేకాదు" అంది నళిని గోముగా మధు నొసట్లో పడుతున్న ముంగురుల్ని సవరిస్తో.

"ముఖ్యమైనదేకాక సంతోషకరమైందికూడానా ?"అని అడిగాడు మధు నళిని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

నళిని కళ్ళల్లో ఏదో లజ్జ తొణికిసలాడుతున్నది కాని ఆ కళ్ళల్లో లజ్జ ఎందుకో కనుక్కోలేకపోయాడు మధు.

"మంచి వైద్యు డెవడైనా కనవడి కుసుమ పిచ్చి కుదురుస్తా నన్నాడా ?" అని అడిగాడు మధు నళిని జవాబుకోసం నిరీక్షించకుండానే, అంతకన్న సంతోషకరమైన వార్త అప్పట్లో ఇంకొకటి ఉండజాలదనే ఉద్దేశంతో.

"అయిదు నిమిషాల టైం యిస్తాను. ఆ సంగతి ఏమిటో చెప్పు కోండి చూద్దాం" అని అంది నళిని మధు క్రాపులోకి తన వేళ్ళు పోనిస్తూ.

నళిని చెప్పదలచినవిషయమేమిటో మధు ఊహించలేకపోయాడు. ఎంత ఆలోచించినా అతనికి ఏమీ పాలుపోలేదు.

"పోనీ ఓడిపోయినానని ఒప్పుకోండి" అని సూచించింది నళిని కొంటెగా.

నళిని ముందు ఓటమిని ఒప్పుకోవడానికి మధు మనస్సు యిష్ట పడలేదు. ఏవో సాకులకోసం వెతకడం ఆరంభించింది.

"ఇంకా అయిదు నిమిషాలు కాందే?" అని అన్నాడు మధు, మేకపోతు గాంభీర్యంతో.

"అయిదు నిమిషాలు కాదుగదా, నేను చెప్పకపోతే అయిదు జన్మలకికూడా మీరు తెలుసుకోలేరు" అని ఛాలెంజి చేసింది నళిని, వేళా కోళంగా నవ్వుతో.

భార్యతో పోటీపడి ఓడిపోవడంకూడా ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది. ఆ కిటుకు ఎన్నడో తెలుసుకున్న మధు "పోనీ, ఓడిపోయా ననుకో. ఆ సంగతేమిటో చెప్పు" అని అడిగాడు అతను బతిమిలాడు కుంటున్న ధోరణిలో.

"అనుకో ఏమిటి? ఓడిపోయానని గట్టిగా ఒప్పుకోండి" అంది నళిని సంతోషంతో చప్పట్లు చరుస్తూ.

ఏదో సంతోషదాయకమైన విషయం కాబట్టే అంతగా ఊరిస్తు న్నదని తెలుసుకొని ఆమె విధించిన షరతులకన్నిటికీ లొంగి పోయాడు మధు.

"ఓడిపోయాను - ఇంక చాలునా?" అని అన్నాడు మధు తన రెండుచేతుల్లో నళిని మొహాన్ని తీసుకుంటూ.

"మీరు ఓడిపోయినప్పుడు ఎంతో అందంగా వుంటారండీ" అని అంది నళిని, "కోపమొచ్చినప్పుడు ఎంతో అందంగా వుంటావని" మధు తనని ఎన్నడో అనడం జ్ఞాపకంవచ్చి.

"అల్లాగా?" అంటూ, తన రెండుచేతుల్లోకి ఇదివరకే తీసుకున్న నళిని మొహాన్ని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు మధు. కొద్దిక్షణాలు మౌనంగా గడిచాయి.

"ఓడిపోయానని ఒప్పుకున్న తరువాత కూడా చెప్పవేఁ ?" అని త్వరపెట్టాడు మధు నళినిని, ఆమె చెంపల్ని నిమురుతో.

"ఎల్లా చెప్పాలో తోచడంలేదు" అంది నళిని జవాబుగా.

ఎందుకో ఆమె చెక్కిళ్ళు ఎరుపెక్కిన సంగతి మధు గమనించ లేకపోయాడు ఆ ఏకాంతంలో.

"ఎల్లా చెప్పడ మేమిటి ? మనస్సులోవున్న సంగతి నోటితో చెప్పెయ్యాలి, అంతే" అని ఒక సుళువైన పరిష్కారమార్గాన్ని సూచించాడు మధు, నళినికి.

"ఛీ మీ మొగవాళ్లు ఇంతేనండీ, ఏదీ అర్థం చేసుకోరు" అని అంటూ వల్లమాలిన సిగ్గుతో కళ్ళు మూసుకుంది నళిని.

నళిని కళ్ళు మూసుకోవడంలో గల ఆంతర్య మేమిటో, మధుకి ఏమాత్రం అర్థంకాలేదు.

"ఇంతకీ ఏదైనా చెబితేకదూ అర్థం కావడానికి ?" అన్నాడు మధు అమాయికంగా.

"ఇంకా ఎల్లా చెప్పమంటారు ? నిజంగా మీ మగవాళ్ళవి మట్టి బుర్రలండీ" అంది నళిని, తన తలని మధు వక్షస్థలంలోకి దూరుస్తూ.

"అంటే ?" అని తిరిగి అమాయికంగా నళిని చెవిలో మాట పెట్టి అడిగాడు మధు.

"అంటేలేదు గింటేలేదు. ఇంక మీకు చెప్పడం నాతరం కాదు" అని మధు వక్షస్థలంలోంచే పలికింది నళిని గుసగుస్తో. నళిని చెబుతున్న పొడుపుకథ అర్థంకాక మధుబుర్ర గిర్రున తిరిగింది. ఇంతలోకే నళిని మధుచెయ్యి అందుకొని తనకడుపుమీద పెట్టుకుంది. వెంటనే మధుకి జ్ఞానోదయం కలిగింది.

"అమ్మా దొంగా ! చెప్పావు కావేఁ" అని చప్పున పక్కలోంచి లేచి కూర్చున్నాడు మధు సంతోషాతిశయంతో.

"ఏం చెప్పను? మీరే కనిపెడుతారనుకున్నాను" అంది నళిని, అతని వాళ్ళో తలదాచుకుంటూ.

"ఎన్నో నెల?" అని అడిగాడు మధు ఉండబట్టలేక.

"మూడో నెలదాటి, నాలుగో నెల వచ్చిందని డాక్టర్ ఊసాయంత్రమే చెప్పింది" అంది నళిని, మధుని తనపైకి లాక్కుంటూ.

మధు మృదువుగా నళిని కడుపు నిమిరాడు. ఎందుకో తను ఒక మహోన్నతపర్వతశిఖరాగ్రంపైన కూర్చు- ఉన్నట్లు తోచింది మధుకి. ప్రజలు యిండ్లూ, చెట్లూ చేమలూ, చీమలబారుల్లాగ కనిపిస్తున్నాయి ఆ ఎత్తునించి. వెంటనే మధు నళిని కడుపుపైకివంగి కడుపుపైన ఏమాత్రం బరువుపడకుండా తగుజాగ్రత్తపడుతూ తేలికగా అక్కడ ముద్దుపెట్టుకున్నాడు ఆనందాబ్ధి నోలలాడుతూ.

"ఛీ ఎవరైనా కడుపు ముద్దెట్టుకుంటారా?" అని అడిగింది నళిని కొంటెగా.

"నిన్నుకాదు ముద్దెట్టుకుంటూ, నా కూతుర్ని" అని సగర్వంగా సమాధానం చెప్పాడు మధు, నళిని ప్రశ్నకి.

"కూతు రెందుకు పుడుతుంది? కొడుకే పుడతాడు" అంది నళిని సిగ్గుతో కళ్లు గట్టిగా మూసుకొంటూ.

"కొడుకు కాదు, కూతురే" అని తన మనోభీష్టాన్ని ప్రకటించాడు మధు నిక్కచ్చిగా.

"ఏం పందెంవేస్తారు చెప్పండి?" అంది నళిని, పౌరుషంతో లేచి కూర్చుంటూ.

"ఏ పందెం కట్టమంటే ఆ పందెం కడతాను" అన్నాడు మధు కయ్యానికి కాలు దువ్వుతూ.

"కూతురు పుడితే జీవితాంతంవరకూ మీకు దాస్యం చేస్తాను" అని శపథం చేసింది నళిని.

"కొడుకు పుడితే నీకూ, నీ కొడుక్కీ నేనూ జీవితాంతంవరకూ దాస్యం చేస్తాను" అని ప్రతిజ్ఞచేశాడు మధు, నళిని శపథానికి సమాధానంగా.

"కొడుకు, కొడుకు, కొడుకు" అని గట్టిగా అరిచింది నళిని, తనమాట నెగ్గలేదన్న అక్కసుకొద్దీ.

"కూతురు, కూతురు, కూతురు" అని గట్టిగా అరిచాడు మధు, ఎక్కడ నళినిమాట నెగ్గుతుందో అన్న భయంకొద్దీ.

ఆ అరుపులకి ఉభయులకీ వివేకోదయం కలిగి, ఇద్దరూ గొల్లుమని నవ్వారు ఒక్కసారే.

సరిగ్గా అదే సమయంలో తోటలో కోయిల "కుహూ, కుహూ" అని పంచమస్వరంలో శ్రావ్యంగా పాడింది.

సరిగ్గా అదే సమయంలో తోటలోని విరులు ఫక్కుమని విరియ బూసి, నలుగడల కమ్మని సువాసనల్ని వెదజల్లాయి.

పరీక్షాఫలితాలు వచ్చాయి. మధు ప్యాసు అయినాడు. తలవని తలంపుగా క్లాసుకూడా వచ్చింది. పరీక్షలముందు చదువు బాగా సాగ లేదు. క్లాసు వస్తుందో, లేదో అని మొదటినించీ మధు భయపడుతూనే ఉన్నాడు. సెకండ్‌క్లాసు రావడం, అతనికి కొంత ఆశ్చర్యాన్నికూడా కలిగించింది. కాని ఎందుకో కలగవలసిన ఆనందం కలగడం లేదు. మానవప్రకృతి చాలా విచిత్రమైంది. ఎన్నటికీ సంతృప్తి అనేది ఉండదు. మధు నిన్నటివరకూ క్లాసురావాలని ఎంతో కోరుకున్నాడు. అది తీరా వచ్చేసరికి, దానితో సంతృప్తిచెందడంలేదు. విద్యార్థిదశ పరిసమాప్తి అయిందని సంతోషించడం లేదు. చదువు ఒక గట్టెక్కిందని ఆనం దించడం లేదు. అప్పుడే భవిష్యత్తునిగూర్చి ఆలోచిస్తున్నాడు. క్లాసు వచ్చింది. ఇంక ఎక్కడైనా ఒక ఉద్యోగం చూసుకోవాలి. ప్రభుత్వ కళాశాలల్లో ఉద్యోగం దొరుకుతుందో, లేదో? ఉద్యోగంకోసం ఎంత కష్టపడాల్సి ఉంటుందో? ఇవి కానిరోజులు. ఈ రోజుల్లో యోగ్యతా

యోగ్యతల్ని ఎవరు పరిశీలిస్తారు ? లంచగొండితనం, సిఫారసులు, కులతత్వాలు వికటాట్టహాసం చేస్తున్నాయి. జీవితం కలుషితమైంది. అడుగడుగునా మోసం చెలరేగుతున్నది. ఎక్కడా నీతీ నిజాయితీలు లేవు. ఇట్టి విషమపరిస్థితుల్లో తనకు ఏ కళాశాలలోనైనా లెక్చరార్ ఉద్యోగం దొరుకుతుందా అనే సంశయం కలిగింది మధుకి. ఎందుకో భవిష్యత్తు భయంకరంగా కనపడుతున్నది. మన సాంఘిక వ్యవస్థలో యువజీవితానికి ఎక్కడా రక్షణలేదు. జీవితం ఒక దశని అందుకొని, అక్కడ సంతృప్తి నివ్వడంలేదు. అప్పుడే భవిష్యత్తుని గూర్చి ఆలోచించడం ప్రారంభించింది. కారణం, సర్వత్రా అరక్షణీయ స్థితి వ్యాపించి ఉండడమే. ఈ అరక్షణీయస్థితికి కారకు లెవరు ? తోటి మానవులే. నేటి భారతావనిలో యువకులకి భద్రతలేదు. రక్షణ లేదు. భవిష్యత్తులేదు. యోగ్యతల్నిబట్టి ఉద్యోగాలు లేవు. యోగ్యతల సంగతి దేవు డెరుగు : అసలు ఉద్యోగాలే దొరకడంలేదు. ప్రతి సంవత్సరం లక్షలాది యువకులు పట్టభద్రులవుతున్నారు. ఉన్నత విద్యాపారంగతు లవుతున్నారు. కాని వాళ్ళకి, ఏవిధమైన భవిష్యత్తు కనపడడంలేదు. ఫలితం, యువజనంలో అసంతృప్తి ప్రబలుతున్నది. క్రమశిక్షణ సన్నగిల్లుతున్నది. జీవితంలో ఆశయాలు, ఆదర్శాలు నశిస్తున్నాయి. యువజనం ఆగ్రహావేశపూరిత మవుతున్నది. విచ్చలవిడిగా వ్యవహరిస్తున్నది. యథేచ్ఛగా జీవిస్తున్నది. నీతినియమాలు సన్నగిల్లుతున్నాయి. కట్టుబాట్లు సడలిపోతున్నాయి. సమాజంలో ఒక అరాచకస్థితి ఏర్పడుతున్నది. తత్ఫలితంగా జాతిలో మేధావులు పుట్టడంలేదు. జాతికి శిరోభూషణంగా ఉండే విజ్ఞానశాస్త్రజ్ఞులు ఉద్భవించడం లేదు. సృజనశక్తిగల రచయితలు ప్రభవించడం లేదు. అన్నిరంగాల్లో జీవితం పతనమవుతున్నది. స్వార్థం, లంచగొండితనం, భోగలాలసత, ధనదాహం జాతిపతనానికి ముఖ్య కారణాలు. వీటిని ఏవిధంగా అరికట్టడమనే ఆలోచన మధుకి వెంటనే

కలిగింది. ఎందుకో, అతనికి గాంధీజీ జ్ఞాపకం వచ్చాడు. మహాత్ముడు సత్యసంధతతో, రుజువర్తనతో కాలుష్యాన్ని ఎదుర్కొన్నాడు. "ఆమహా మహుడు రవి అస్తమించని ఒక మహాసామ్రాజ్యాన్నే తన సత్యాహింస లతో తలక్రిందులు చేశాడే! మనమెందుకు ఆ ఆయుధాలతో సంఘాన్ని ఎదుర్కొనగూడదు?" అనే భావం కలిగింది మధుకి. నిజమే. మనం సమాజాన్ని విమర్శించి ఏం లాభం? ఎప్పుడైనా మనం మనజీవితాన్ని విమర్శించుకున్నామా? మన నడవడిని, ఒక అగ్నిపరీక్షకి గురిచేసుకున్నామా? లేదు. మనం మన సమస్యల్ని ఆదృష్టితో ఎందుకు ఆలోచించకూడదు? వ్యక్తిగతంగా మనం కాలుష్యాన్ని ఎందుకు ఎదుర్కొనగూడదు? దీనివల్ల సమాజం బాగుపడుతుందని కాదు. మనకు సంబంధించినంతవరకు మనం బాగుపడడానికి ఒక అవకాశం ఏర్పడుతుంది. సంఘంలో ఏ ఒక్క వ్యక్తి బాగుపడ్డా, సంఘానికి కాస్తో కూస్తో మేలు జరగక మానదు. భవిష్యత్తునిగూర్చి అంతగా భయపడడం దేనికి? మానవజీవితానికి భద్రత, రక్షణా లేవని వాపోవడం దేనికి? జీవితంలో ఎక్కడికక్కడ సంతృప్తిజెందడం నేర్చుకోవాలి. ప్రస్తుతానికి తను పరీక్ష ప్యాసైనాడు. అది సంతోషించదగ్గ విషయం. మరి తను ఎందుకు సంతోషించకూడదు? భవిష్యత్తునిగూర్చి బెంగపెట్టుకొని, ప్రస్తుత సంతోషానికి అంతరాయం కలిగించుకోవడం దేనికి? జీవితం అనుగ్రహించే చిన్నిచిన్ని కటాక్షాలను సంతోషంతో స్వీకరించాలి. ఉద్యోగం పురుషలక్షణం. నిజమే, తను ఉద్యోగంకోసం ప్రయత్నించవలసిందే. దానినెవ్వరూ కాదనరు. కాని దానికోసం యిప్పటినించే బెంగపడడం దేనికి? దొరుకుతుందో లేదో అని యిప్పటినించే భయపడడం దేనికి? శలవలు పూర్తికావడంతోనే తాను ఉద్యోగంకోసం ప్రయత్నించడానికి నిశ్చయించుకున్నాడు మధు. కాని అప్పుడు తను ఏ సిఫారసుకోసమూ ప్రయత్నించడు. ఉద్యోగం కోసం డబ్బు వెదజల్లడు. ఎవ్వరినీ ఆశ్రయించడు. దొరికితే సంతో

షిస్తాడు. లేకపోతే లేదు. ఉద్యోగం దొరకకపోతే తనకి గడపవనికాదు. తనకు కొంత స్వంతఆస్తి వుంది. నళిని ఆస్తికూడా తనకు కొంత కలిసి వస్తుంది. న్యాయంగా నళినికి సంక్రమించే ఆస్తిమాత్రమే తను స్వీకరిస్తాడు. మిగతాఆస్తి తనకు అక్ఖరలేదు. అప్పుడు ఉద్యోగం దొరకక పోయినా, ఎట్టిఅభ్యంతరం వుండదు. ఉన్నదానిలోనే సరిపుచ్చుకుంటాడు. అందని ఆశలకోసం తను అర్రులుచాచడు. ధనదాహంతో తను బాధ పడడు. ఉద్యోగం దొరకనప్పుడుకదూ తను ఈ విషయాలన్నీ ఆలోచించ వలసింది ? మరిప్పుడు ఆలోచించడం దేనికి ? ప్రస్తుతం తను పరీక్ష ప్యాసు అయినాడు. ఇది నిజంగా సంతోషించదగ్గ విషయం. ప్రస్తుతానికి తను సంతోషించాలి. ఆనందించాలి. తన సంతోషాన్ని ఇతరులతో పంచుకోవాలి. అప్పుడుగాని సంతోషం, సంతోషంగా కనపడదు. ఈశుభ వార్తని వెంటనే నళినితో చెప్పాలి. ఆమె బహుశా ఇంకా పేపరు చదివి ఉండదు. ఈ ధోరణిలో ఆలోచించేసరికి మధుకి నిజంగా తను ప్యాసైనందుకు ఎందుకో పట్టరాని ఆనందం కలిగింది. వెంటనే చిన్నపిల్లవాడి లాగా ఆ ఆనందాన్ని పంచుకోవడానికి అతను నళినిగదికి పరుగెత్తాడు.

ఏ కారణంవల్లనైతేనేమి, ఒకవ్యక్తి కొంత బలహీనుడు కావడం జరిగితే ఆ వ్యక్తిచుట్టూ వున్న కొందరు స్వార్థపరులు అదే అదనుగా ఎంచి ఆ వ్యక్తి బలహీనతవల్ల లాభం పొందడానికి ప్రయత్నిస్తారు. కుసుమ అండగా నిలిచి ఇంటిపనులు పొల్లుపోకుండా చూచుకున్నంత కాలం నళిని ఎంతో దక్షతతో ఆస్తిపాస్తులకి సంబంధించిన వ్యవహారాల్ని చక్కదిద్దుతూ వచ్చింది, కాని కుసుమ జబ్బుపడడంతో ఆమెకు కుడిచెయ్యి విరిగినట్టయింది. బయటి వ్యవహారాలతో ఇంటిపనులుకూడా నెత్తిపైన పడ్డాయి. ఏపనీ సరిగ్గా చూసుకోవడానికి టైం దొరకడంలేదు. ఇంటిపనుల విషయంలో కొంతవరకు రామచంద్రయ్యపైన ఆధారపడవలసి వస్తున్నది. అదే అదను ఎంచి అతను రెండుచేతులతో

డబ్బు కొల్లగొడుతున్నాడు. అంతటితో సంతృప్తిజెందక ఉమామహేశ్వర రావుగారు నళినులమధ్య అభిప్రాయభేదాల్ని కల్పిస్తున్నాడు. ఆస్తి పంప కానికై నళినిపైన కోర్టులో వ్యాజ్యం వేయవలసించిగా, ఉమామహేశ్వర రావుగారిని ప్రోత్సహిస్తున్నాడు. రాములమ్మగారు బ్రతికున్నంతకాలం ఆమెమీది గౌరవంకొద్దీ ఆస్తివిషయంలో ఉమామహేశ్వరరావుగారు ఏమీ మాట్లాడలేదు. రోజుకురోజు ఆస్తి పెరుగుతున్నది. ఆదాయం హెచ్చుతున్నది. ఈ విషయాలు రామచంద్రయ్య ఎప్పటికప్పుడూ ఉమా మహేశ్వరరావుగారికి జారవేసి, ఆస్తికి వారసులైవుండికూడా, ముండ భరణం పొందుతూ అగౌరవపుబ్రతుకు ఎంతకాలం బ్రతుకుతారని వారిని ఎత్తిపొడుస్తున్నాడు. పెద్దదిక్కు వున్నంతకాలం ఇది సమయంకాదని ఎన్ని ఎత్తిపొడుపులనైనా భరించి మౌనం వహించారు ఉమామహేశ్వర రావుగారు. కాని రాములమ్మగారి మరణంతో తనకిస్తున్న అయిదువందలు ఏమూలకీ సరిపోవడంలేదని గ్రహించారు. నెలపేరిట ఇంకొక రెండు వందలు ఎక్కువ చేయమని రామచంద్రయ్యద్వారా నళినికి కబురు పంపించారు. లేకపోతే ఆస్తి విభజనకై కోర్టులో వ్యాజ్యం వేస్తామని కూడా బెదిరించారు. తమయింటికి చిచ్చుపెడుతున్నది రామచంద్రయ్య నేనని నళినికి బాగా తెలుసు. వాజ్యాల విషయంలో ఉమామహేశ్వరరావు గారికి నూరిపోస్తున్నదికూడా అతనేనని తెలుసు. ఈ సంగతులు తనకు కనకాంగిద్వారా తెలియవస్తున్నాయి. తమకి నెలపేరిట ఇంకొక రెండు వందలు ఎక్కువడబ్బు కావాలని ఉమామహేశ్వరరావుగారు తనని సూటిగా అడిగివుంటే నళిని యిచ్చివుండేదే. కాని తమకు డబ్బు కావాలని నేరుగా అడగక ఉమామహేశ్వరరావుగారు వ్యాజ్యం వేస్తామని బెదిరించడం రాయబారాలు నడపడం నళినికి ఏమాత్రం నచ్చలేదు. అందువల్ల ఆమె ఆ రాయబారాలనిగాని ఆ బెదిరింపులనిగాని బొత్తిగా లక్ష్యం చేయలేదు. ఉమామహేశ్వరరావుగారికి ప్రస్తుతం నెలపేరట

యిస్తున్న అయిదువందలుకూడా యివ్వడం మానివేశామా అని ఆలో చించింది. కాని ఎందుకువచ్చిన బెడద అని మధు అనడంతో తన ఆలోచనల్ని అంతటితో ఆపివేసింది. రామచంద్రయ్య తమయింటికి చిచ్చుపెట్టడానికి ఎందుకు తలపెట్టాడో నళినికి అర్థంకాలేదు. అతని ఆంతర్యం ఏమిటో నళినికి ఏమాత్రం పాలుపోలేదు. తన తల్లిహయాంలో అన్నిపనులూ అతని చేతిమీదుగా జరుగుతూవుండేవి. అప్పట్లో అతను ఒక మ్యానేజర్‌గా వ్యవహరిస్తూ వుండేవాడు. అతని చేతుల్లో డబ్బు కొల్లగా ఉండేది. అతను బొత్తిగా నీతి, నిజాయితీలేని మనిషి. ప్రతి వ్యవహారంలో ఎంతడబ్బు కొట్టేసేవాడో ఏమాత్రం అంతుదొరక్క పోయేది. తనచేతికి వ్యవహారం వచ్చినతరువాత నళిని డబ్బువిషయంలో అతన్ని పరీక్షించిచూచింది. అతనిలో డబ్బుకక్కుర్తి కనపడింది. కాగా డబ్బు దోచెయ్యడంలో అతనికి ఒక పరిమితిఅంటూ కనబడలేదు. ఎంత డబ్బు చేతికందితే అంతడబ్బు కొట్టెయ్యడానికి అతను ప్రయత్నించడం గోచరించింది. దానితో నళినికి అతనిపైన విశ్వాసం తగ్గింది. అందువల్ల అతన్ని డబ్బుకి దూరంగా వుంచడానికి పూనుకుంది. డబ్బుతో అతనికి ప్రత్యక్షసంబంధం లేకుండా చేయడం శ్రేయస్కరమని తోచింది నళినికి. తదనుగుణంగా అతన్ని యిచ్చిపుచ్చుకోవడాలకి దూరంగా వుంచడం మొదలెట్టింది. సామానుకొట్టుకి కుసుమని పంపించడంతో, రెండువందల సామానుకి నాలుగువందలని లెఖ్ఖలువ్రాయడం ఆగిపోయింది. కొట్టువాడి దగ్గర ఖాతా ఎత్తివేసి ఎప్పటికప్పుడు కుసుమద్వారా డబ్బు పారే యించడంతో రామచంద్రయ్య కొట్టువాడిమధ్యగల లావాదేవీలు నిలిచి పోయాయి. ఇదేవిధంగా ప్రతి వ్యవహారంలోనూ నళిని రామచంద్రయ్య చుట్టూ వుచ్చులు బిగిస్తూవచ్చింది. ఇండ్లబాడుగలు అతనిద్వారా వసూలు చేయించడం మానేసింది. లాయర్‌తోకూడా అతనికి ఏమీ సంబంధం లేకుండా చేసింది. ఇంటికి ఏ వస్తువు కావలసివచ్చినా కుసుమ కారులో

వెళ్ళి కొనుక్కొనిరావడం మూలాన రామచంద్రయ్యకి డబ్బుతోగల సంబంధాలన్నీ తెగతెంపులైనాయి. దానితో మానేజరుగా వ్యవహరిస్తున్న అతను గుమస్తాహోదాకి దిగజారిపోయాడు. పనిమనుషులదగ్గర అతని హోదా తగ్గింది. రాబడి తగ్గడం హోదా తగ్గడం ఈ రెండుకారణాల మూలంగా బహుశా అతను దెబ్బతిన్న పాముకుమల్లే తమపై పగపట్టి కుట్రలుపన్నడం ఆరంభించాడనుకుంది నళిని. కాని అతను తిన్నయింటి వాసాలు లెఖ్ఖించడం నళినికి ఏమాత్రం నచ్చలేదు. ఉద్యోగంలోంచి తొలగించివేతామా అంటే ఆమెకు మనస్సు ఒప్పలేదు. కడుపుమీద కొట్టినట్టు అవుతుంది. ఆపని చేయడం ఆమెకి యిష్టంలేదు. ఉమామహేశ్వరరావుగారితో వ్యాజ్యం వేయించి ఆస్తిపంపకాలు చేయించి వారికి వచ్చేవాటాకి తను మానేజరుగా వుందామని అతను ఈ ఎత్తులు ఎత్తుతున్నాడేమో? అప్పుడు ఒకఆట ఆడవచ్చునని అతని ఉద్దేశమేమో? ఉమామహేశ్వరరావుగారు మాట నిలకడలేని మనిషి. ఈరోజు వ్యాజ్యం వేస్తామని బెదిరించి రేపు ఏ కారణం లేకుండా మానివేయవచ్చు. ఇది ఎందుకొచ్చినబెడద అని అనుకోవచ్చు. తాగుబోతుల లక్షణమే అంత. ఏకోశానా వాళ్ళకి మాటపట్టింపు ఉండదు. ఒకక్షణంలో దుర్బోధలకు లోనై మరుక్షణంలో ఆ బోధలకి అతీతంగా మెలగవచ్చు. తమకుజరిగిన ఏలాటి అపకారాన్ని అయినా వాళ్ళు ఇట్టే మరిచిపోగలరు. దోషిని ఇట్టే క్షమించివేయగలరు. రామచంద్రయ్య ఉమామహేశ్వరరావుగారికి అండగా నిలిచి వారిని నమ్ముకొని కుట్రలు పన్నడం మూర్ఖలక్షణం. ఉమామహేశ్వరరావుగారు ఏనాటికీ వ్యాజ్యం వేయడానికి పూనుకోరు. ఒకవేళ పూనుకున్నా డబ్బు తనపక్షం ఉండడంమూలాన, వ్యాజ్యంలో గెలువలేరు. తన పిచ్చిగాని వ్యాజ్యం వేయడానికికూడా వారిదగ్గర డబ్బు ఎక్కడిదని? రామచంద్రయ్య ధనసహాయం చేస్తాడా? అతనుమాత్రం డబ్బు ఎక్కడినించి తెస్తాడని? అందువల్ల ఉమామహేశ్వరరావుగారు

వ్యాజ్యం వేయడంకల్ల. కుసుమ జబ్బుతో తనకు అంగబలం తగ్గించినీ. దానికితోడు మనోవ్యాకులత సమకూడించని ఎంచి రామచంద్రయ్య ఈ కుట్రలకి పూనుకొని వుంటాడు. తనకు మనశ్శాంతి లేకుండా చేయడానికి ఇదే మంచిసమయమని కూడా అనుకొనివుంటాడు. కుట్రలు పన్నే మనస్తత్వం, ఈ కుట్రలు విజయవంతమవుతాయా అని ఆలోచించదు. పరిస్థితుల్నిబట్టి కావని తెలుసుకోలేదు. విజయావిజయాల ప్రసక్తి లేకుండానే ఆ మనస్తత్వం కుట్రలు పన్నుతూనే వుంటుంది. అపకారాన్ని తలపెట్టుతూనేవుంటుంది. అదీ దానినైజం. రామచంద్రయ్య పన్నుతున్న కుట్రలు కనకాంగి ద్వారా తనకి తెలియవస్తున్నాయి. కనకాంగిది కూడా చాలా విచిత్రమైన మనస్తత్వం. రామచంద్రయ్యకీ, కనకాంగికీ దైహికసంబంధముంది. ఆ సంబంధంద్వారా రామచంద్రయ్య దగ్గర అప్పుడప్పుడు డబ్బు లాగుతున్నది. కాగా ఉమామహేశ్వరరావు గారి దగ్గర కూడా కొంత సంపాదిస్తున్నది. ఇది చాలక స్వామి ద్రోహానికి తలపెట్టి రామచంద్రయ్య పన్నుతున్న కుట్రలు తనకి చారవేసి తన దగ్గర కూడా డబ్బు లాగుతున్నది. డబ్బుకోసం దేహాన్ని సమర్పిస్తుంది. ఆ నైచ్యానికి మనస్సుతో ఏమీ సంబంధం ఉండదు. ఎవడికి దేహాన్ని అర్పిస్తుందో అతడిపైననే డబ్బుకోసం చాడీలు చెబుతుంది. డబ్బుకోసం అడుగడుగునా మోసంచేస్తుంది. ఇంత నీచత్వం దానికి ఎల్లా అలవడింది? బీదరికంవల్లనేనా? ఏమో? కనకాంగి చిత్తప్రవృత్తి చూచి మరీ ఆశ్చర్యమేసింది నళినికి.

కాలచక్రం విసుగ్గా తిరుగుతున్నది. నళినికి తొమ్మిదిమాసాలు నిండాయి. ఏ క్షణాన ప్రసవమవుతుందో తెలియదు. అందువల్ల మధు యింట్లోనించి ఎక్కడికీ కదలడంలేదు. ఇరువైనాలుగు గంటలు భార్యని ఒకకంట కనిపెట్టుకొనివుంటున్నాడు. ఇంట్లో కాన్పు జరపడానికి ఆడదిక్కు లేదు. ఆ విషయం ముందుగానే ఆలోచించి మధు ఒక ప్రసూతి

గృహంలో అడ్వాన్సు చెల్లించి ఒక గది బుక్ చేసాడు. లేడీడాక్టర్ తో నళినిని ఎప్పటికప్పుడు పరీక్ష చేయిస్తున్నాడు. ప్రసవానికి రెండురోజులు ముందుగానే నళినిని ఆ ప్రసూతిగృహంలో ప్రవేశపెట్టడానికి ఏర్పాట్లు జరిపాడు. తొమ్మిదవనెల నిండినప్పటినించీ ఎందుకో మధు హృదయం ఆందోళనకరంగా వుంది. తొలికాన్పు అని మనస్సులో ఏదో భయం. కాని వెంటనే కొడుకో, కూతురో పుడుతుందనే సంతోషం. తన జీవితమే ఇంకా ఒకగట్టుకుచేరలేదు. ఇప్పుడప్పుడే తనకు పిల్లలు ఏమిటని ఒక బెంగ. వివాహమై దాదాపు ఒకసంవత్సరమైవుంటుంది, సంవత్సరం దాటీదాటకముందే తనకు సంతానం కలుగుతున్నది. ఈ కొద్దికాలంలో తను భార్యతో ఏమిసుఖం అనుభవించినట్టు? అప్పుడే తమ సుఖానికి అంతరాయం కలుగుతున్నది. నళిని ప్రేమని తనతోబాటు తన సంతానం కూడా పంచుకుంటుంది. అప్పుడు ఆమె ప్రేమ రెండు పాయలుగా విడిపోతుంది. తనవేపు ప్రసరించే పాయ సన్ననిదై సంతానంవేపు ప్రవహించే పాయ పెద్దదవుతే తనుచూచి సహించగలడా? ఇప్పటికే ఆమెకి తనపైన ఆసక్తితగ్గింది. దృష్టి సంతానంపైకి మళ్ళింది. అప్పుడప్పుడు ఆమె తన కడుపు తడిమి చూచుకోవడం తాను ఎన్నోసార్లు గమనించాడు. తనకి కూడా ఎందుకో ఆమె కడుపు తడిమిచూడాలని అనిపిస్తుంది. కుండలాగా కడుపు పెరిగింది. విశ్రాంతి తీసుకోమంటే వినదు. ఏదో పని చేయడానికి వుద్యుక్తురాలవుతుంది. తను వారిస్తే సన్నగా చిరునవ్వు నవ్వి "మీ కొడుక్కి ఏమీ ఫరవాలే"దని సమాధానం చెబుతుంది. ఆమె అయాసంగా నడుస్తుంటే తనపాపకోసం ఆమె అంత కష్టపడుతున్నదనిపించి ఆమెపై జాలికలుగుతుంది. ఒక్కొకసారి ఇంత త్వరగా నళిని గర్భం దాల్చకపోతే బాగుండేదేమో ననిపిస్తుంది మధుకి. కాని ఆ వెంటనే తను త్వరలో తండ్రి కాబోతున్నందుకు ఎందుకో గర్వంగా వుంటుంది. తనపట్ల ఆమె ప్రేమ తగ్గిపోతున్నందుకు మధుకి

ఎందుకో కోపమొస్తుంది. తన సుఖం క్షీణిస్తున్నందుకు ఎందుకో ఆగ్రహం కలుగుతుంది. ఈ మార్పులన్నింటికీ ఆమె ఎంతవరకు కారణభూతురాలు అని ఆలోచించేసరికి, ఆ ఆగ్రహం ఇట్టే మటుమాయ మవుతుంది. తను పిల్లవాడిలాగా ప్రవర్తిస్తున్నందుకు తనకే సిగ్గువేస్తుంది. సంతానంవల్ల దైహికసుఖం కొంతవరకు తగ్గినా మానసికానందం యినుమడింపవచ్చునేమోననే ఆశ కలుగుతుంది. ఆ ఆశ ఒక విధమైన సంతృప్తినీ హాయినీ సమకూరుస్తుంది. నళినికి కలుగనున్న సంతానం పైన ఈర్ష్య తగ్గుతుంది. ఎక్కడినించో ప్రేమ పుట్టుకొస్తుంది.

ఒకనాటి సాయంత్రం నళినికి దొంగనొప్పులు వచ్చాయి. వెంటనే మధు నళినిని కారులో ప్రసూతిగృహానికి తీసుకెళ్ళాడు. వెంట కనకాంగి కూడా వుంది. నళినిని లేడీడాక్టర్ పరీక్షించి ఫాల్సుపేన్సు అనిచెప్పింది. నళిని రెండురోజులవరకు ప్రసవించే సూచనలు లేవని కూడా చెప్పింది. నళినిని తిరిగి యింటికి తీసుకురావడమా లేక అక్కడనే వుంచడమా అన్న సమస్య వచ్చింది. నళిని కనకాంగితోపాటు ప్రసూతిగృహంలో వుండ డానికి ఏమాత్రం యిష్టపడలేదు. తిరిగి యింటికివస్తానని మంకుపట్టు పట్టింది. తీరా యింటికి తీసుకువస్తే తిరిగి ఫాల్సు పేన్సు వస్తే ఏమి చేయడమా అనే ఆలోచన వచ్చింది మధుకి. ఈ రాకడపోకడలవల్ల నళిని అలసిపోవచ్చు. ప్రసూతిగృహంలోనే వుంచడం శ్రేయస్కరమని తోచింది. కాగా యింట్లో పెద్దదిక్కు లేదు. డాక్టర్ని అడిగితే ఉంచడమే మంచిదని సలహా యిచ్చింది. ఆ విషయం నళినికి నచ్చజెప్పడానికి, తలప్రాణం తోకకు వచ్చింది. చివరకి కోప్పడితేగాని ప్రసూతిగృహంలో వుండడానికి ఒప్పుకోలేదు. ఆమెకి ఏదో భయం. తననికూడా అక్కడ వుండమని ప్రాధేయపడింది. కాని తాను రాత్రిళ్ళు ప్రసూతిగృహంలో వుండడానికి వీలులేదు. ఎందుకో నళిని తనని వదిలివుండటానికి యిష్ట పడడంలేదు. తనకికూడా ఆమెని అక్కడ వుంచుదామని లేదు. కాని

ఏమిచేస్తాడు ? ఆమెని అక్కడ వదిలివేయక తప్పిందికాదు. తాను తీరా తిరిగివచ్చేప్పుడు నళిని కంటనీరు పెట్టింది. తను చూచీచూడనట్లు నటించి గుండె రాయిచేసుకొని యింటికి వచ్చేశాడు.

మరునటి రెండురోజులవరకూ ఏలాటినొప్పులు రాలేదు. డాక్టర్‌ని అడిగితే ఈరోజురాత్రో లేక రేపు ఉదయమో ప్రసవిస్తుందని చెప్పింది. రెండవరోజు సాయంత్రందాకా మధు ప్రసూతిగృహంలోనే గడిపాడు. రాత్రికి ఏ ఎనిమిదిగంటలకో యింటికి తిరిగివచ్చాడు. బహుశా ఈరాత్రికి ప్రసవం కాదేమోనని అనుకున్నాడు. కాని ఎందుకో ఆరాత్రి తనకు నిద్రపట్టలేదు. ప్రక్కమీద దొర్లుతూ గడిపాడు. నళినికి ఎల్లావుందోనని ఒకచెంపని బెంగ, సుఖప్రసవమై తను తండ్రి అయినానేమోనని ఇంకొక చెంపని సంతోషం. గడచిన రెండురాత్రులు తనకు హాయిగా నిద్రపట్టింది. కాని ఎందుకో ఆరాత్రి నిద్రపట్టడంలేదు. ఆనాడు తన జీవితంలో ఏదో విశేషం జరుగనున్నది. అందుకేనా తనకు నిద్ర పట్టకపోవడం ? అంతే అయివుంటుంది. నిద్రరాకపోవడంతో ఇటీవలనే తను కొనుక్కొచ్చిన పుస్తకం "బేబీ కేర్" తీసాడు. ఏ ప్రకరణం చదవడం ? ఏమీ తోచలేదు. మొదటినించీ చివరవరకు పుస్తకం చదవడానికి నిశ్చయించుకున్నాడు. ఎందుకో చదువు సాగలేదు. పుస్తకంలోని పంక్తులు ఎక్కడికో ప్రయాణం చేస్తున్నాయి. వాటితోపాటు తన మనస్సు పరుగెత్తుతున్నది. ఆ ప్రయాణం ప్రసూతిగృహానికి కాదుగద ? ఏమో ?

ప్రసూతిగృహం...గేటుదాటి నళిని గదిలోకి వెళ్ళింది మనస్సు... గదిలో నళిని లేదు... ఆపరేషన్ థియేటర్‌కి తీసుకెళ్ళలేదుగదా ?... ఏమో ?...థియేటర్ ముందు మనస్సు ఏమీ తోచక పచార్లుచేస్తున్నది... థియేటర్ ముందు ఎవ్వరూ కనపడలేదు... లోపలినించి ఎవ్వరూ వెలుపలికి రావడంలేదు...సుఖప్రసవమేనా?...థియేటర్‌లో ఏదో అలజడి... ఆ వెంటనే శిశువు ఏడుపు...మనస్సుఎగిరి గంతువేసిందిసంతోషంతో...

ఇంక ఏ క్షణానో తనకు కబురు వస్తుంది... మగ శిశువో, లేక ఆడ శిశువో... ఆడపిల్లే అయివుంటుంది... సందేహంలేదు... ఇంక నళిని ఒప్పందం ప్రకారం, జీవితాంతం వరకూ ఆమె తనకు సేవచేస్తుంది... కొంతసేపటికి ప్రసూతిగృహం గదిలో నళిని ప్రశాంతంగా నిద్రపోతున్నది...అడుగులో అడుగు వేసుకుంటూ మనస్సు గదిలోకి వెళ్ళింది... మనస్సు రెండుగా చీలి రెండుదారులు పట్టింది...ఒక తునక ఉయ్యాలని సమీపించి తన హృదయంనించి చీలిన భాగాన్ని గర్వంతో చూసుకుంటున్నది...ఇంకొక తునక నళినిని సమీపించి విజయగర్వంతో పరామర్శిస్తున్నది...నళిని నెమ్మదిగా కళ్ళుతెరిచి తన ఓటమిని చూపులద్వారా వ్యక్తపరిచింది... నళినిని సమీపించిన తునక విజయదర్పంతో ఎగిరి గంతులేసింది......

మరునటి రోజున ఉదయం ఎనిమిది గంటలకి కాని తనకు మెలకువరాలేదు. కాలకృత్యాలు తీర్చుకోవడానికి పడకగదినించి వెలుపలికి వెడుతుండగా ఒక పనిమనిషి వచ్చి "నళిని ప్రసవించిందనీ, మొగపిల్లవాడు పుట్టాడని" చెప్పాడు. ఆ వార్త వినడంతోనే మధుకి పట్టరాని సంతోషంకలిగింది. వెంటనే గదిలోకివెళ్ళి ఒక పదిరూపాయల నోటు తీసుకువచ్చి, పనిమనిషికి యిచ్చాడు. పనిమనిషి తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు. పనిమనుషుల నందరినీ పంపించమని వాడితో చెప్పి, లోపలికి వెళ్ళి, తిరిగి పర్సుతీశాడు. తలకి అయిదురూపాయల చొప్పున పనిమనుషు లందరికీ డబ్బు బహూకరించాడు. పనిమనుషులకి డబ్బు పంచిపెడుతుంటే, ఎందుకో ఎంతో సంతోషం కలిగింది. "నళిని నెగ్గింది. తను ఓడిపోయా" ననుకున్నాడు మధు లీలగా. వెంటనే కాలకృత్యాలు తీర్చుకొని, చివరికి టీ కూడా పుచ్చుకోకండా ప్రసూతి గృహం దారిపట్టాడు మధు కారులో. కారుకన్నా ముందు మనస్సు పరుగెత్తింది. వెళ్ళి తల్లినీ, పిల్లవాడిని కళ్ళారా చూచుకునేవరకూ, మనస్సు సంతృప్తి

జెందలేదు. "ఎవరు ఓడారు? ఎవరు గెలిచారు?" అనే ప్రసక్తి ఆ తరువాత రానేలేదు. నళిని పిల్లవాడికి పాలిస్తున్నది. తను గదిలోకి వెళ్ళడంతోనే పిల్లవాడిని మరీ దగ్గరగా కడుపులోకి తీసుకొని, మధు వంక చూసి, సిగ్గుతో తలవాల్చుకుంది. మధుహృదయం, ఆ దృశ్యానికి ఆకాశం ఎత్తున ఉప్పొంగింది.

★ ★ ★



ఎవరో దూరపుబంధువు సహాయంతో, ఆయెషా రెహానాలు, ఫిల్ములలో చేరడానికి బొంబేకి వెళ్ళారని నళినిద్వారా తెలిసింది మధుకి. ఆ బంధువుకి ఫిల్ముపరిశ్రమలో మంచి పలుకుబడి ఉందట. ఆ బంధువు విలాసం సంపాదించి అతనితో ఆయెషా రెహానాలు కొంతకాలంపాటు ఉత్తరప్రత్యుత్తరాలు నడిపారట. అతను ఎంతోకాలంపాటు అనేక ఫిల్ములలో డైరెక్టర్‌గా పనిచేసి, బాగా డబ్బు సంపాదించి, ప్రస్తుతం ఒక స్వంత కంపెనీ స్థాపించి, ఫిల్ములు తీయడానికి పూనుకుంటున్నాడట. తారల ధరలు పెరిగి, వాళ్ళని మంచలించడానికి వీలులేని పరిస్థితుల్లో ఉత్సాహవంతులైన కళాకారులని వెతకి తన మొదటి చిత్రం "దూర్ దేశ్‌కీ కహానీ, మేరే జబానీ" వాళ్ళతో తీయడానికి సంకల్పించి హైద్రాబాద్‌కి వచ్చాడట. హైద్రాబాద్‌లో కొల్లలుగా ఉత్సాహవంతులైన అందమైన కళాకారులు ఉన్నారు. హైద్రాబాద్‌లోని రిట్జుహోటల్‌లో దిగి, వాళ్ళనందరినీ అతను కలుసుకున్నాడట. ఆ సందర్భంలో ఆయెషా రెహానాలు అతన్ని చూశారట. అతను వాళ్ళిద్దరినీ సెలెక్టుచేసుకోవడమే కాకుండా, రెహానాకి హీరోయిన్‌రోలు యివ్వడానికి కూడా వాగ్దానం చేశాడట. ఆయెషాకి సపోర్టింగ్‌రోలు వస్తుందట. కాగా ఆమెకి రెండు

మూడు ఫిల్ములలో తన పలుకుబడిని ఉపయోగించి, బ్యాక్‌గ్రౌండ్ సాంగ్సు పాడడానికి ఏర్పాటుచేస్తానని చెప్పాడట. ఈ వాగ్దానాల ఫలితంగా వాళ్ళిద్దరూ చదువుమానేసి బొంబేకి ఇళ్ళల్లో చెప్పకుండా బయల్దేరి వెళ్లారు. తలిదండ్రులు వాళ్ళకోసం హైద్రాబాద్ నాలుగుమూలలా గాలించారు. తమ యింటికివచ్చి నళినినికూడా అడిగారు. నళిని వాళ్ళెక్కడున్నదీ తనకు తెలిసినప్పటికీ, ఆయెషా, రెహానాల ఆచోకీ ఏమాత్రం యివ్వ లేదు. బొంబేకికూడా మనిషిని పంపిస్తే, ఆ మనిషి బొంబేలో వాళ్ళెక్క డున్నదీ కనుక్కోలేకపోయాడట. వెళ్ళినట్టే తిరిగి వచ్చేశాడట. వెళ్ళే టప్పుడు నళినికి వాళ్ళు కనపడలేదుగాని వెళ్ళినవెంటనే తాము ప్రస్తుతం ఎక్కడున్నదీ, ఏమి చేస్తున్నదీ మొదలైన విషయాలన్నీ తెలియజేస్తూ ఉత్తరం వ్రాశారు. తమతమ యిళ్ళల్లో తమసంగతి ఏమాత్రం తెలియ నివ్వవద్దని హెచ్చరిక చేశారు. వాళ్లు వెళ్ళి అప్పుడే మూడుమాసాలు అయింది. ఈకొద్దికాలంలోనే వాళ్లు కాంట్రాక్టులపైన సంతకాలు చేసి నట్టూ, ఫిల్ములలో ఆక్టుచేయడం కూడా ప్రారంభించినట్టు వ్రాశారు తమని ఒకమాటు బొంబేకి రమ్మనికూడా ఆహ్వానించారు.

జీవితం చాలా విచిత్రమైంది. తను ఏగట్టుకూ చేరుకోలేదు. ఉద్యోగంకోసం ప్రయత్నించాడు కాని ఏమీ లాభం లేకపోయింది. దరఖాస్తులమీద దరఖాస్తులు పంపాడు. ఇంటర్‌వ్యూ పిలుపులువచ్చాయి. ఇంటర్‌వ్యూలకి వెళ్లాడు. సెలెక్టు అయినట్టుగాని, కానట్టుగాని ఏ కాలేజీ నించి ఉత్తరం రాలేదు. మధు ఒక్క లెక్చరార్ ఉద్యోగాలకి మాత్రమే దరఖాస్తులు పెట్టాడు. ఇంక ఏ ప్రభుత్వశాఖలలోగాని ఉద్యోగానికి ప్రయత్నం చేయలేదు. ఉపాధ్యాయవృత్తి మాత్రమే తనకు నచ్చింది. తను ఇంక ఏ యితర వృత్తుల్లో ప్రవేశించదలచుకోలేదు. "మీకు ఉద్యోగం ఎందు" కంటుంది నళిని. కాని ఏ ఉద్యోగం లేకండా కాలక్షేపం చేయడం తనకు యిష్టంలేదు. డబ్బువిషయంలో తనకి ఏ చిక్కూలేదు. కాని

ప్రతినయాపైసాకోసం ప్రస్తుతం తను నళినిని యాచించవలసి వస్తున్నది. నళినికీ, తనకీ ఏలాటి భేదాలులేవు. డబ్బు బీరువా సొరగులో పడేసి ఉంటుంది. తన కిష్టమొచ్చినంత డబ్బు తీసుకోవచ్చు. తను డబ్బు తీసుకుంటే చాలు. నళిని సంతోషిస్తుంది. ఎందుకో తనకి నళినిని అడగకండా డబ్బు తీసుకోవడమంటే ఏ మాత్రం మనస్కరించదు. కాగా అడగాలని బుద్ధిపుట్టదు. అత్యావసరమైతే తప్ప, తను నళినిని డబ్బు అడగడంలేదు. తన అవసరాలన్నీ గుర్తించి, ఆమెనే అడగకండా డబ్బు తనకోసం ఖర్చుచేస్తున్నది. తనకు కావల్సిన సిగరెట్లు నెలపేరిట తెప్పిస్తున్నది. అవసరమైన గుడ్డలు కుట్టిస్తున్నది. తనకోసం గుడ్డలు కూడా ఆమే సెలక్టుచేస్తున్నది. తనకు డబ్బుతో ఏమాత్రం అవసరం లేకండా చేస్తున్నది. ఇదీ ఒకందుకు మేలే ననుకున్నాడు మధు. తన తల్లి తనకు వివాహమైనప్పటినించీ ఏమాత్రం డబ్బు పంపించడం లేదు. అబ్రాహ్మణ యువతిని పెళ్ళిచేసుకున్నందుకు ఆమెకి కోపంవచ్చినట్లు ఉంది. తను విధవై ఇంకొకరితో సంబంధం పెట్టుకోవచ్చు. తను నీతిని అతిక్రమించవచ్చు. ఆ నీతిని అతిక్రమించి చరించడం, తనశ్రేయస్సుని కోరేనని ఆమె వాదించవచ్చు. కాగా ఆమె చేసినపనికి ఆమెకి ఏలాటి పశ్చాత్తాపమున్నట్లు కనపడదు. తను అబ్రాహ్మణ యువతిని పెళ్ళి చేసుకున్నందుకు, తనని దోషిగా ఎంచుతున్నది. మానవులు తమ దుష్ట ప్రవర్తనని ఒక కొలతబద్దతో కొలచి, ఇతరుల ప్రవర్తనని ఇంకొక కొలతబద్దతో ఎందుకు కొలుస్తారో తెలియదు. తనని దోషిగా ఎంచ డానికి తనేమి తప్పుచేశాడని? ఆమె ధర్మశాస్త్రప్రకారం తను నళినిని పెళ్ళిచేసుకోవడం తప్పే కావచ్చు. తను జీవితంలో ఎన్నుకున్న ధర్మ శాస్త్రం నళినిని వివాహమాడడం తప్పని చెప్పడంలేదు. నడవడి వ్యక్తి గతమైంది. ఏ యితరులకి హానికలగకండా, తన యిష్టప్రకారం నడుచు కోవడంవల్ల తప్పేమీలేదు. దీనిని అన్నిమతాలూ అంగీకరిస్తున్నాయి.

తనతల్లి చదువుకోలేదు. ఆమెకి విలువలు మారుతున్న సంగతి తెలియదు. పూర్వాచారాన్నిబట్టి కొన్నిపనులు చెడ్డవనీ, కొన్ని మంచివనీ అను కుంటుంది. తనతల్లి "చెడ్డవి" అనుకున్న పనుల్ని స్వయంగా తన కొడుకే చేస్తే ఆమె చూచి సహించలేకపోతున్నది. తనవిషయంలో మాత్రం ఆమె పూర్వాచారాన్ని పాటించడంలేదు. దానికి భిన్నంగా ప్రవర్తిస్తున్నది. ఇంతకీ తనుచేసిన తప్పేమిటి? ఆమెచేసిన తప్పులో సహస్రాంశమైనా కాదు కాగా నళినిని వివాహం చేసుకోవడం తను తప్పుగా భావించడంలేదు. ఇంతమాత్రానికే ఆమె తనకి డబ్బు పంపించ కండా ఉండడం న్యాయమేనా? తనకీ, ఆమెకీ ఏమీ సంబంధంలేనట్లు ప్రవర్తిస్తున్నది. ఇదీ ఒకదృష్టితో మంచిదే. తనే ఆయింటితో ఏలాటి సంబంధం పెట్టుకోకండా ఉండాలని ముందుగానే నిశ్చయించుకున్నాడు. తనప్రయత్నం లేకండానే ఆ నిశ్చయం అమలులోకి వచ్చింది. ఇదీ తన మంచికోసమే జరిగించనుకున్నాడు మధు.

కుమారుడు కలిగినప్పటినించీ పూర్తిగా చదువుమానేసింది నళిని. ఎనిమిదవ మాసం వచ్చేవరకూ కాలేజీకి వెళ్ళింది. కొడుకు పుట్టడంతోనే ఇంక చదువనని నిశ్చయించుకుంది. కొడుక్కి "వినయకుమార్" అని పేరుపెట్టుకుంది. కూతురు పుడుతుందని తను పందెం కట్టాడు. కొడుకు పుడతాడని నళిని వాదించింది. చివరికి నళినికే విజయం చేకూరింది. తనూ, నళినీ చేసుకున్న ఒప్పందం ప్రకారం ఆమెకీ, వినయకుమార్‌కీ తను జీవితాంతం దాస్యం చేయాల్సిందే. అందువల్ల తను ఏమాటకీ తనకి యిష్టం లేకపోయినప్పటికీ, ఆమెని ఎదురించడం లేదు. ఆమె చెప్పినట్లల్లా వింటున్నాడు. "మీకు ఉద్యోగం ఎందు" కంటే కూడా తను మాట్లాడడం లేదు. ఈ దాస్యంలో కూడా తనకి ఒకవిధమైన ఆనందం కలుగుతున్నది. తను అనుకున్న ఏ ఒక్క సంగతీ జీవితంలో జరగడంలేదు. తను మొదట కుసుమని పెళ్ళిచేసుకుందామనుకున్నాడు.

అది జరగలేదు. నళినిని వివాహం చేసుకోవాల్సి వచ్చింది. తనకి
కూతురు పుట్టాలనుకున్నాడు. కొడుకు పుట్టాడు. ఉద్యోగం చేయాలను
కున్నాడు. ఉద్యోగం దొరకలేదు. ఉమామహేశ్వరరావుగారి యింట్లో
ట్యూషన్‌కి కుదిరినప్పుడు స్వతంత్రజీవనం చేయాలనుకున్నాడు. ఆఉద్దే
శంతోనే ట్యూషన్ చేయడానికి ఒప్పుకున్నాడు. స్వతంత్రజీవనం కుదర
లేదు. పరతంత్రజీవనం లభించింది. జీవితావసరాలకి నళినిపైన ఆధార
పడాల్సి వచ్చింది. తనకు కావల్సిన డబ్బు యింటినించి రావడం లేదు
తనకి అవసరమైనడబ్బు నళిని యిస్తున్నది. ఆయెషా,రెహానాల జీవితాలతో
తనజీవితాన్ని పోల్చి చూచుకుంటే తనబ్రతుకు ఎంతో హీనంగా
కనపడుతున్నది. వాళ్లు సర్వస్వతంత్రంగా జీవితాలు గడుపుతున్నారు.
జీవితంలో తము నిలుపుకున్న ధ్యేయాన్ని సాధిస్తున్నారు. తనకు
స్వతంత్రజీవితం లభించలేదు. జీవితంలో అనుకున్న ఆశయం రోజుకు
రోజు దూరమవుతున్నది. తను లెక్చరార్‌వృత్తి అవలంబించ దలచాడు.
ఆ ఉద్యోగం దొరకడం లేదు. కొందరు తమ జీవితాశయాన్ని ఇట్టే
సాధిస్తారు. మరికొందరు తమ ధ్యేయానికి కడు దూరమవుతారు. కొందరికి
జీవితంలో అదృష్టం కలిసివస్తుంది. మరికొందరికి దురదృష్టం అడ్డు
వస్తుంది. కొందరి జీవితాలు సఫలమవుతాయి. మరికొందరి జీవితాలు
విఫలమవుతాయి. ఇది వారివారి పూర్వపుణ్య విశేషమా ? ఏమో ?

తనకు జీవితంలో ఏకొరతా లేదు. తనను ప్రేమించి తనకోసం
ఏ త్యాగమైనా చేయడానికి సంసిద్ధపడే భార్య వుంది. డబ్బువుంది. భోగం
వుంది. అయినా తనకు జీవితంలో సంతృప్తిలేదు. శాంతిలేదు. జీవితం
ఉన్నదానితో సంతృప్తి చెందదు. లేనిదానికోసం అర్రులు చాచుతుంది.
ఎవ్వరినీ సుఖంగా బ్రతకనివ్వదు. అందరినీ వేధించుకుతింటుంది. బాధ
పెడుతుంది. యమయాతనపాలు చేస్తుంది. పోనీ వున్నదానితో సంతృప్తి
పడితే ? సంతృప్తిపడడం మనచేతులో వుందిగనకనా, అంత తేలికగా

సమస్య పరిష్కారం కావడానికి ? మనం ఒకటి అనుకుంటాం. ఇంకొ కటి జరుగుతుంది. అనుకున్నది జరగకపోవడంతో విచారం కలుగు తుంది. దుఃఖం కలుగుతుంది. ఎందుకో జీవితం ఒక భోగందానికిమల్లే కనపడింది మధుకి. దాన్ని మనం ప్రేమిస్తాం—మన సర్వస్వాన్ని అర్పిస్తాం—ఎంతత్యాగం కోరితే అంతత్యాగం చేస్తాం—అది మనని ప్రేమించదు, మోసగిస్తుంది. ప్రేమనినటించి మనని ఒకఆట ఆడిస్తుంది. మన సర్వస్వాన్ని అంటే యౌవనాన్నీ, వాంఛల్ని, వాంఛితాల్ని, ఉత్సా హాన్నీ, ఉద్రేకాన్నీ పణంగా కోరుతుంది. ఆ తరువాత మనని త్రోసి వేస్తుంది. అప్పుడు మనం అన్నీఉడిగి ఎందుకూ కొరగాకండా పోతాం. జీవితం దూరంగా నిలిచి మనం విఫలం పొందినందుకు వెయ్యి నాలు కలతో వెక్కిరిస్తుంది. మన దైన్యాన్నిచూచి వికటాట్టహాసం చేస్తుంది. సిగ్గుతో మనం తలదించేసుకుంటాం—పాతాళంలోకి క్రుంగిపోతాం, నామ రూపాలు లేకండా, కీర్తిప్రతిష్ఠలు లేకండా—

"జీవితం", "జీవితం" అని జీవితాంతంవరకూ కొట్టుకుంటాం. జీవితంలో ఏముందని ఎన్నడూ విచారించం. జీవితం మనని మోస గిస్తుంది. అది మనదారికి రాదు. తనదారిని తాను వెళ్ళుతుంది. చివరకి "ఇదేనా జీవితం ?" అని మనం పశ్చాత్తాపపడుతాం.

కొందరు జీవితంలో డబ్బుని ప్రేమిస్తారు. మరికొందరు స్త్రీని కామిస్తారు. ఇంకా కొందరు కీర్తిప్రతిష్ఠల్ని వాంఛిస్తారు. ఎవ్వరికీ ఏమీ దొరకదు. అందరూ రిక్తహస్తాలతో జీవనయాత్ర చాలిస్తారు. డబ్బుని ప్రేమించినవాళ్ళకి స్త్రీ లభిస్తుంది. స్త్రీని కామించినవారికి కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. కీర్తిప్రతిష్ఠలు వాంఛించినవారికి డబ్బు దొరుకుతుంది. కొందరికి ఏమీ దొరకదు. మూడింటికీ దూరమవుతారు. ఫలితం-అశాంతి, యమయాతన. ఇదీ వైచిత్రి.

జీవితంలో ఏదీ వాంఛించగూడదు. ఏదీ కోరుకోగూడదు. జడ పదార్థంలాగా బ్రతకాలి—అప్పుడు జీవితంలో జీవం లోపిస్తుంది. మృత కళేబరాలలాగా బ్రతుకుని ఈడ్వవలసి వస్తుంది. కొన్ని జీవితాలు విజయ వంత మైనట్లు కనపడుతాయి. నిజం విచారిస్తే కావు. ఎవరి జీవితమైతే సఫలమైందని అనుకుంటున్నామో, వాళ్ళనే వెళ్ళి అడగండి, వాళ్ళేమి సమాధానం చెబుతారో ?

చివరకి "జీవితం అంటే ఏమిటి ?" అని తననితాను ప్రశ్నించు కున్నాడు మధు.

"అర్థరహితమైందే జీవితం" అని అంతర్వాణి సమాధానం చెప్పింది మధుకి.

కాలం మందకొడిగా నడుస్తున్నది. రోజుల్ని, మాసాల్ని విసుగ్గా చుట్టేస్తున్నది.

కుసుమజబ్బు నయంకాలేదు. డాక్టర్లు పెదవివిరిచేశారు. ఎక్స్ పర్టుని భారతదేశమంతా గాలించి పిలిపించడం జరిగింది. కాని ఏమీ లాభం లేకపోయింది. కుసుమ జబ్బుకూడా చాలా విచిత్రమైంది. ఎవ్వరినీ రక్కదు, గోడలు గీకదు, పిచ్చివాగుడు వాగదు. మౌనంగా తనగదిలో కూర్చుంటుంది. ఏమి ఆలోచిస్తుందో తెలియదు. అసలు ఆలోచిస్తుందో, లేదోకూడా తెలుసుకోవడం కష్టం. పరధ్యాన్నంగా ఉంటుంది. పిలిస్తే పలకదు. పిచ్చిచూపులు చూస్తుంది. కళ్ళల్లో ఏలాటికాంతి వుండదు. ఒకొకసారి గాజుబుడ్లలాగా కంటిగుడ్లు కనపడుతాయి. ఆ కళ్ళల్లో ఏదో భయం, ఏదో తత్తరపాటు ద్యోతకమవుతుంది. కుసుమ కాస్త చప్పుడైనా భరించలేదు. ఏదో వులికిపడుతుంది. గదితలుపులు బిగించుకుంటుంది. గంటలతరబడి బంధింపబడిన తలుపుల వెనకాల కాలక్షేపం చేస్తుంది. లోపల ఏమిచేస్తుందో ఎవ్వరికీ తెలియదు. వెలుపల ఏమిజరుగుతుందో ఆమెకీ తెలియదు. రెండు విభిన్నప్రపంచాలు. ఒకదానికి, ఇంకొకటి

క్రమంగా దూరమవుతున్నది. రెండు ప్రపంచాలు క్రమంగా విడిపో తున్నాయి. ఏదో సన్నని దారం, ఆ రెండు ప్రపంచాల్ని బంధిస్తున్నది. ఆ దారం ఎన్నడో తెగిపోతుంది. అప్పుడు ఆ రెండు ప్రపంచాలు శాశ్వ తంగా దూరమవుతాయి. ఒకదానితో, ఇంకొకదానికి ఏలాటిసంబంధం వుండదు. ప్రస్తుతం రెండులోకాలమధ్య బ్రతుకుతున్న కుసుమ, అప్పుడు శాశ్వతంగా మానవలోకంతో సంబంధాలు తెగతెంపులు చేసుకొని పిచ్చిలోకంలోకి వెళ్ళిపోతుంది. మానవలోకంలో వుంటూ, మానవ లోకంలోకి తిరిగిరాదు. అదీ ఆమె జీవితం. అదీ ఆమె అంతం. కుసుమకి పద్దెనిమిది సంవత్సరాలు దాటాయి. పందొమ్మిదవ సంవత్సరం నడు స్తున్నది. ఈ పద్దెనిమిది సంవత్సరాల్లో ఏమి సుఖం అనుభవించింది? కుసుమించకపూర్వమే వాడిపోతున్నది. ఏదో భయంకరమైన ఎండదెబ్బ తగిలింది జీవితంలో. దాన్నే "మాగ్లిమోనియా" అంటున్నారు డాక్టర్లు. ఏపేరు పెడితేనేమి? జీవితపు ఇనుపపాదాలక్రింద నలిగిపోతున్నది. కొన్నిరోజుల్లో నలిగి నలిగి పిండిపిండి అవుతుంది. ఈ దారుణ పరి స్థితులకి కారకులెవరు? నళినీ, తనూనూ- తాము కారకులెందుకవుతారు? తాము నిమిత్తమాత్రులు. కుసుమా తనమధ్యా నడచిన ప్రేమ అమాం తంగా జీరపోయింది. దానికి తాను ఏమాత్రం కారకుడు కాడు. నళిని అంతకన్నా కాదు. కుసుమప్రేమ జీరపోయిన తరువాత కొంతకాలానికి తను తలవనితలంపుగా నళినిని పెళ్ళిచేసుకోవాల్సి వచ్చింది. ఇందులో దోషి ఎవరు? తాను ఏమాత్రం కాడు. నళిని అంతకన్నా కాదు. మరి దోషి ఎవరు? విధి. నిజమే విధిని దోషిగా నిలిపి దూషించాల్సిందే. ఇంకెవ్వరినీ దూషించడానికి వీలులేదు.

ఎన్నడూలేనిది ఈమధ్య కుసుమ గంటలతరబడి అద్దంముందు గడుపుతున్నదట. ఎందుకో? తన అందాన్ని చూచుకొని తానే మురిసి పోతున్నదా? తన అందానికి కాలదోషం పట్టిందని విచారిస్తున్నదా?

లేక అదీ ఒక పిచ్చా? ఏమో? ఎందుకో తనకి ఆవార్త విన్నప్పటినించీ మనస్సులో మనస్సు వుండడంలేదు. ఏది ఎట్లున్నా ఇది ఆమెజబ్బుకి సంబంధించిన ఒక కొత్తఅంశం. ఈ నూతనాంశం ఏ దుష్టఫలితాలకి దారితీస్తుందో తెలియదు.

రామచంద్రయ్యకి ఎందుకో తనపైన గుర్రుగావుంది. కారణం ఏమిటో తెలియదు. ఇంటి వ్యవహారాల్లో తను నళినికి చేదోడుగా వుండడమే తన దోషమా? అయితే కావొచ్చు రామచంద్రయ్య ఆటలు డబ్బు విషయంలో ఏమాత్రం సాగడంలేదు. తనకి, అతని ఆటలు కొనసాగించాలని వుంటుంది. కాని నళిని ఒప్పుకోదు. ఆమెకి ఎదురాడడం తను ఎప్పుడో మానుకున్నాడు తన చేతులమీదుగానే సంసారం నడిపివుంటే, రామచంద్రయ్య ఎంతడబ్బు కొట్టేసినా తను మెదలకుండా వూరుకునేవాడే కారణం, తగలేయడానికికూడా తగినడబ్బు వుండడం మూలాన. రామచంద్రయ్య పెంపుడుకుక్కకిమల్లే ఎముకలకోసం గురగురలాడుతున్నాడు. ఎముకలు ఏమాత్రం దొరకడంలేదు. గురగురలాడుతూ యింటివాళ్ళపైననే తిరగబడుతున్నాడు. నళినిని ఏమీఅనలేడు. ఆ కోపమంతా తనపైన చూపించుకుంటున్నాడు. తనని ఆ యింటివాడిగా పరిగణించడంలేదు. తను ఎక్కడినించో కొట్టుకొచ్చి ఆ యింట్లో పడ్డట్టు రామచంద్రయ్య తనని చూస్తున్నాడు. నిజమే, తనకి ఆ యింటి పైన ఏలాటిహక్కూ లేదు. తనకు ఆ యింటితోవున్న బంధమంతా నళిని ద్వారానే. ఆసంగతి తనకి బాగాతెలుసు. అయినా ఆ విషయం తనకి అప్పుడప్పుడు జ్ఞాపకంవచ్చేట్లు రామచంద్రయ్య మాట్లాడడం దేనికి? అది అతని నీచత్వం. అంతకుతప్ప మరేమీకాదు. పెంపుడుకుక్కకి కాటువేయడం తెలియదు. గురగురలాడడం మాత్రం తెలుసు. తన హృదయాన్ని ఆ గురగురలతో అప్పుడప్పుడు బాధపెట్టడం తప్ప, అంతకిమించి రామచంద్రయ్య ఏమీ చేయలేడు. తనకిమల్లేనే అతనూ

అశక్తుడు, నిరాధారుడు, నిరాశ్రయుడు. తనకుమల్లేనే ఉన్న ఆశ్రయాన్ని చేతులారా పోగొట్టుకోలేడు. కొత్త ఆశ్రయాన్ని వెతుక్కోలేడు. ఎందుకో అతన్నిగూర్చి ఆలోచించడం వృథాప్రయాస అనిపించింది మధుకి. ఉమామహేశ్వరరావుగారుకూడా అప్పుడప్పుడు తనపైన ధుమ ధుమ లాడుతున్నారట. అసలు వారికోపం నళినిపైన తమకి వలసిన డబ్బు యివ్వడంలేదని. ఆ కోపం ఆమెకి సంబంధించినవారిపైనకూడా ఉమామహేశ్వరరావుగారు చూపుతున్నారు. వ్యాజ్యం వెయ్యడానికి చేతిలో డబ్బులేదు. డబ్బుకోసం రామచంద్రయ్యని నమ్ముకొని, కొంతకాలం గడిపారు. అతనిదగ్గరినించి వ్యాజ్యానికి అవసరమైన డబ్బు రాకపోవ డంతో, అతనిపైనకూడా కోపంవచ్చింది. మనిషి లంపటుడు. అసమర్థుడు. నెలపేరిట వస్తున్నడబ్బు దుర్వ్యసనాలకే సరిపోవడంలేదు. అట్టిపరిస్థితుల్లో వ్యాజ్యానికి డబ్బు ఎక్కడినించి వస్తుందని? చేసేదేమీ లేక అందరినీ కోప్పడుతున్నారు. అందరినీ శపిస్తున్నారు. ఆ అందరిలో తను ఒకడు. పెద్దమనిషి తనని కోప్పడి తనపైన ధుమధుమలాడితే తనేమీ చేయడానికి వీలులేదు. కాగా తనేమీ చేయలేడుకూడా. వారికిమల్లే తనూ అశక్తుడు. అంతకోపమొస్తే వారికిమల్లే తనూ ఒంటరిగా ఉన్నప్పుడు, తనలోతాను గొణుక్కోవాల్సిందే. ఎందుకో అవని చేయడం తనకు యిష్ట ముండదు. జీవితాన్ని యథాతథంగా అంగీకరించడానికి తను అలవాటు పడుతున్నాడు. అంతే. ఉమామహేశ్వరరావుగారికి రామచంద్రయ్యపైన ఆగ్రహం కలగడంకూడా ఒకందుకు మంచిదే. ఇంక ముందు రామ చంద్రయ్య వారికి ఎలాటి ద్రోహాలు చెయ్యడు. కొంత గొడవ తగ్గు తుంది. ఏమీ చెయ్యలేక తనని సూదుల్లాంటి మాటలతో రామచంద్రయ్య హింసిస్తాడు. ఏ పిల్లిమీదనో, ఏ ఎలకమీదనో పెట్టి తనని దూషిస్తాడు. ఆ మాటలు తనని కాదనుకుంటే అంతటితో పీడా విరగడై పోతుంది. ఎందుకో రామచంద్రయ్య తనని పరోక్షంగా ఆడేమాటలన్నీ నళినికి

చెప్పాలని వుండదు. నళినికి చెబితే రామచంద్రయ్య ఆట కట్టుబడుతుంది. కాగా నళినికి కోపం వచ్చి అతన్ని ఉద్యోగంనించి తొలగించినా తొల గించవచ్చు. ఎందుకో ఆపని చేయించడం తనకి యిష్టంలేదు. అందు కోసమే తను మౌనం వహిస్తున్నాడు. ఓపిక పడుతున్నాడు. ఎవరి పాపాన వాళ్ళు పోతారని ఆమాటల్ని సహించి ఊరుకుంటున్నాడు. దీని కంత టికీ తన అశక్తతే కారణం. అందులో ఏమాత్రం సందేహం లేదు. తన జీవితం మొదటినించీ అశక్తతతో నిండివుంది. ఇప్పుడు సవరించ దలుచుకుంటేమాత్రం సాధ్యపడుతుందా ?

జీవితంలో కనకాంగికి ఏ అనుబంధంలేదు ఒక్క డబ్బుతోతప్ప. దానికి "నా" అనేవాళ్ళు ఎవ్వరూ లేరు. ఉమామహేశ్వరరావుగారి యింట్లో పుట్టింది. ఆ యింట్లోనే పెరిగి పెద్దదయింది. తల్లి ఏనాడో చనిపోయింది. డబ్బు అంటే దానికి అంతప్రీతి ఎందుకో తెలియదు. డబ్బు గడించడమే తెలుసుకాని వ్యయపరచడం తెలియదు. డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకుంటుంది. చాడీలు చెబుతుంది. అబద్ధా లాడుతుంది. పిల్లిగంతులు వేయమంటే వేస్తుంది. ఆ పిల్లిగంతులు వేయడం తనకి అగౌరవమనికానీ, హాస్యాస్పదమైన విషయమని కాని ఆలోచించదు. డబ్బుకోసం పెంపుడు కుక్కకిమల్లే చుట్టూ తిరుగుతుంది. తన్నినా పడి సహిస్తుంది. కాని కుక్కకున్న విశ్వాసం కనకాంగికి లేదు. ఎదురు తిరిగి గుర్రు మనదు. డబ్బు రాలదని తోస్తే చుట్టూ తిరగడం మానే స్తుంది. డబ్బులేనివాళ్ళతో సంబంధం పెట్టుకోదు. వాళ్ళ దరిదాపులకి కూడా వెళ్ళదు. డబ్బువున్నవాళ్ళని ఆశ్రయిస్తుంది. వాళ్ళ అడుగులకి మడుగు లెత్తుతుంది. రాములమ్మగారు జీవించి వున్నంతకాలం వారి కను సన్నల్లో మెలిగింది. ప్రస్తుతం నళినిని ఆశ్రయించి ఆమె చెప్పుచేతల్లో మెలగుతున్నది. ఉమామహేశ్వరరావుగారి మీదా, రామచంద్రయ్యమీదా, నళినికి చాడీలు చెబుతుంది. వాళ్ళు పన్నుతున్న కుట్రల్ని రహస్యంగా

నళినికి చేరవేస్తుంది. నళిని సంగతికూడా వాళ్ళకి చేరవేస్తుందో, లేదో తెలియదు. దైహికంగా ఉమామహేశ్వరరావుగారూ రామచంద్రయ్యలతో కనకాంగికి సంబంధముంది. ఆ అనుబంధంతో వాళ్ళదగ్గర డబ్బు లాగుతుంది. నళిని దగ్గరకూడా డబ్బు కొట్టేస్తుంది. కాని దొంగతనం చెయ్యదు. ఇతరులు దొంగతనం చేయడం చూచి సహించలేదు. నీతి నియమాలు పాటించకుండా డబ్బు సంపాదిస్తుంది, ఆ డబ్బు కూడబెట్టదు. కూడబెడితే ఎవరిపాలవుతుందో ఏమోనని భయం. కాస్త డబ్బు చేతి కందగానే ఏదో సొమ్ము చేయిస్తుంది. ఏదో నగ కొంటుంది. ఆ సొమ్ములూ, నగలూ పెట్టెలో పెట్టుకొని మురవదు. పుత్తడిబొమ్మలాగా సొమ్ములూ, నగలూ పెట్టుకుని తిరుగుతుంది. ఎందుకో కనకాంగికి సొమ్ములూ నగలమీద ఎక్కడలేని మమకారం.

కిశోర్‌కుమార్ యింటికి ఎప్పుడు వస్తాడో, యింటినుంచి ఎప్పుడు వెడుతాడో తెలియదు. క్షణంసేపు యింట్లో వుండడు. స్కూలుకి వెడితే వెడుతాడు. లేకపోతే లేదు ఉదయంనించీ సాయంత్రందాకా ఏవో ఆటలు. సాయంత్రాలు సినిమాలు. తాడులేని బొంగరంలాగా తిరుగుతున్నాడు. నళిని అంటే భయం. ఆమెని తప్పించుకొని తిరుగుతాడు. ఆమె మాటకి ఎదురాడడు. కుసుమ అంటే ప్రేమ. లోగడ ఆమె దగ్గర అతని ఆటలన్నీ సాగేవి.. ఆమెతో గారాబంగా వుండేవాడు. కుసుమ పిచ్చిదైనప్పటినించీ ఆ గారాబం ఎగిరిపోయింది, ఆమెతోగల అనుబంధం తెగిపోయింది. ఇప్పుడు ఆమె దగ్గరికి బొత్తిగా వెళ్ళడంలేదు. వెళ్ళినా, కుసుమ కిశోర్‌ని పలకరించదు తను కిశోర్‌కి మాస్టర్. ఇప్పటికీ కిశోర్ తనని ఆదేదృష్టితో చూస్తున్నాడు. తన దగ్గర ఆతనికి చనువు లేదు. ఫలాని వస్తువు తనకి కావాలని ఎవ్వరితోనూ చెప్పడు. తనకి ఇంత డబ్బు కావాలని కనకాంగిద్వారా నళినికి కబురు చేస్తాడు. నళిని అవసరమయిన డబ్బు యిస్తుంది. ఆ డబ్బుతో కిశోర్ తనకు

యిష్టమైన వస్తువు కొనుక్కుంటాడు. ఇంటికీ, కుటుంబసభ్యులకీ రోజుకు రోజు దూరమవుతున్నాడు. తన ఈడువాళ్ళతో ఎక్కువగా తిరుగు తున్నాడు. పోయినపరీక్షలో ఎల్లాగో నెగ్గుకొచ్చాడు. మళ్ళీ ట్యూషన్ పెట్టకపోతే ఈ సంవత్సరం ప్యాసుకావడం కష్టం. అప్పుడే పరీక్షలు దగ్గరబడుతున్నాయి. ఒకటిరెండు నెల్లు అయినా ట్యూషన్ పెట్టకపోతే లాభం ఉండదు. ఆ విషయం నళినితో మాట్లాడి కిశోర్‌కి మాస్టర్ని కుదిరించాల్నని అనుకున్నాడు మధు. భార్యాభర్తల్లో ఎవ్వరో ఒక్కరు కిశోర్‌తో చనువుగా వుండడం అవసరమనుకున్నాడుకూడా. నళిని చనువుగా వుండడం కుదరదు. ఎందుకో ఆమె అంటే కిశోర్‌కి ఒక విధమయిన భయం. ఇక మిగిలింది తను. తనే ఇక కిశోర్‌తో చనువుగా ప్రేమగా వుండాలి. లేకపోతే కిశోర్‌కి ఆ యింటితో పూర్తిగా సంబంధం తెగి పోతుంది. దారంతెగిన గాలిపటంలాగా ఎక్కడికో ఎగిరిపోతాడు. ఇంకొక నాలుగు అయిదు సంవత్సరాల్లో యౌవనంకూడా అంకురిస్తుంది. అది ప్రమాదభరితమయిన ఈడు. ఆ ఈడులో యువకుల్ని క్రమశిక్షణ క్రింద వుంచడం అవసరమనుకున్నాడు మధు.

నళిని తిరిగి గర్భం దాల్చింది. లేడీడాక్టర్‌కి చూపిస్తే "మూడు నెల్లు" అని చెప్పింది

ఎందుకో నళినికి ఒక ఇల్లు కట్టాలని మనస్సులో వసించి. "మనకు ఇన్ని యిళ్లు ఉన్నాయి. ఇంకొక యిల్లు కట్టడ మెందు"కని మధు నళినికి నచ్చచెప్పడానికి చూచాడు. కాని లాభం లేకపోయింది. "ఇందులో ఏ యిల్లూ మనం కట్టలేదు. పాతయిళ్లుకొని, కాస్త మరమ్మతు చేయించి బాడుగలకి యిచ్చినవే అన్నీనీ. మనం ప్రస్తుతం వుంటున్న యిల్లుకూడా మనం కట్టించింది కాదు" అని వాదించింది నళిని మధుతో.

"ఈ యింటికి వున్న లోపమేమిటి; ఇంకొక యిల్లు కట్టించు కోవడానికి ?" అనికూడా అడిగిచూచాడు మధు.

"ఈ యిల్లు మనకు అచ్చిరాలేదు. మా అమ్మా, అత్తయ్యా ఈ యింట్లోనే చనిపోయారు. కాగా కుసుమ తల్లికూడా ఇక్కడే చనిపోయింది. ఈ యింట్లో ఎవ్వరికీ మనశ్శాంతి వుండడంలేదు. ఎప్పుడూ ఏదో ఒక హృదయవిదారకమైన సంఘటన జరుగుతున్నది. ముఖ్యంగా కుసుమకి పిచ్చెత్తినప్పటినించీ నాకీయింట్లో వుండడం ఏమాత్రం మనస్కరించడం లేదు" అని నళిని తన వాదనని బలపర్చుకుంది.

మధు నళిని వాదనని ఎదుర్కోలేకపోయాడు. పైగా ఆ యింట్లో కుసుమకి పిచ్చెత్తినప్పటినించీ బొత్తిగా మనశ్శాంతి వుండడం లేదని నళిని బల్లగుద్ది చెబుతుంటే తను కాదని ఎల్లా ఎదిరించగలడు ? తనకు మూఢవిశ్వాసాలమీద నమ్మకం వుందనికాదు. అంతమాటకొస్తే, నళినికి కూడా నమ్మకం లేదు. కాని ఎందుకో ఆ భావం ఆమె మనస్సులో పడ్డది. ఆభావాన్ని చెరిపి వేయడానికి తాను ఎంతో ప్రయత్నించాడు. దానికి నళిని ఒక్కటే సమాధానం చెప్పింది- "మనకు కావల్సినంత డబ్బు వుంది. ఇల్లు కట్టడంతో కొంతకాలం గడిచి పోతుంది. ఎప్పుడూ యింట్లో కూచుని కుసుమ జబ్బునిగూర్చి ఆలోచించడం కంటే ఒక మంచి వ్యాపకం మనకి లభిస్తుంది." అని ఆమె ఏకైక సమాధానం. ఆ సమాధానానికి మధు నిరుత్తరుడైనాడు పైగా ఆ యిల్లు తన పేరిట కట్టిస్తానని నళిని మంకుపట్టుపట్టింది. "నాపేరట ఏపని ప్రారంభించినా జరగదు. కుసుమపేరట కొనదల్చుకున్న యింటికి నాపేరు పెట్టేసరికి ఆ యిల్లు కొనడం పడలేదు పైగా ఆభావం కలగడంతోనే కుసుమ పిచ్చెత్తి కూర్చుంది. అందువల్ల నాపేరట ఏపనీ చేయవ"ద్దని నళినికి నచ్చచెప్పడానికి మధుకి తలప్రాణం తోకకు వచ్చింది. "కుసుమకు పిచ్చెత్తడానికీ ఆ యిల్లు మీ పేరట కొనడానికీ గల సంబంధం ఏమిటి ?" అని నళిని మొదట తనతో వాదనకు పూనుకుంది. "మనిద్దరిమధ్య ఏలాటి భేదం లేదు. అల్లాంటప్పుడు నాపేరట యిల్లు కట్టించకపోతేనేం

మనిద్దరిలో ఎవరి పేరట కట్టిస్తేనేం? ఎందుకో నాపేరట కట్టిస్తే ఏదో అకృత్యం జరుగుతుందని తోస్తున్నది. ఏలాటి అమంగళం జరగకండా వుండాలంటే. యిల్లు నీ పేరటే కట్టడం మంచి"దని విస్పష్ట పరిచాడు మధు. ఉభయులూ ఆధునిక యువతీయువకులు. ఉభయులకీ ఏలాటి మూఢ విశ్వాసాలపైన నమ్మకంలేదు. కాని ఎందుకో నళిని తను కట్టదల్చుకున్న యింటికి మధు పేరు పెట్టలేదు. చివరకి వినయబాబు పేరట యిల్లు కట్టడానికి నిశ్చయించింది. కలకాలంనించీ కొన్ని మూఢ విశ్వాసాలు, నమ్మకాలూ మనలో జీర్ణించిపోయాయి. మెదడు వాటిని ఒప్పుకోదు. ఇవి మూఢవిశ్వాసాలని అవి త్రోసివేస్తుంది. కాని ఎందుకో హృదయం, అవి మూఢవిశ్వాసాలని తెలిసికూడా వాటికి దాసోహం అంటుంది. మన భావాలు ఒక వంద సంవత్సరాలు ముందు ఉంటాయి. మన ఆచరణలు రెండువందల సంవత్సరాలు మనని వెనక్కి లాగుతాయి. భావాలకీ, ఆచరణలకీ ఎక్కడా లంగరందదు. మూఢవిశ్వాసాలని ఎదిరిస్తే ఏమి ముప్పు వాటిల్లుతుందోనని, మన హృదయం అడుగడుగునా మనని భయపెడుతుంది. ఆ భయానికి తట్టుకోలేక మూఢవిశ్వాసాలని తృణీకరించలేక ఎందుకైనా మంచిదని వాటికి దాసోహమంటాం. ఇదీ మానవనైజం. ఎవరో ఒకరు తెగించి వాటిని అధిగమిస్తేనే గాని సమాజం ముందుకు నడవదు. మన కెందుకొచ్చింది మనం తప్పించుకు తిరుగుదామని ఎవళ్ళకి వాళ్ళే అనుకుంటే, సమాజం ఉన్నచోటనే ఉండిపోతుంది. ప్రగతి అనేది ఉండదు. మధుకి ఈ విషయాలన్నీ తట్టకపోలేదు. కాని ఎందుకో సాహసించి ఏ విషయంలోనూ అతను ముందడుగు వేయలేకపోతున్నాడు. కారణం అతను చిన్ననాటినించీ ఎంతో ప్రేమగా పెంచుకున్న ఇన్‌ఫీరియారిటీకాంప్లెక్సు వల్లనే. అతని తల్లి చెడునడపడి. అతన్ని జీవితంలో తలెత్తుకోలేకుండా చేసింది. అవమానం ఒంటరితనాన్ని నేర్పింది. అతన్ని సంఘానికి దూరం

చేసింది. ఆచరణరహితమైన ఆలోచనలతో బ్రతకడం నేర్పింది. తత్ఫలితంగా అతని జీవితమే ఒక గొప్ప ఆలోచనగా మారింది. అది క్రియారహితమైన ఆలోచన. కాగా వ్యర్థమైన ఆలోచన. ఎడతెరిపిలేని ఒకటే ఆలోచనవల్ల అతను జీవితంలో అసమర్థుడైనాడు. అశక్తుడైనాడు. నిస్సహాయుడైనాడు. నళిని మొదటినించీ ధైర్యశాలి. కాని ఆమె జీవితంలో కొన్ని జరగకూడని సంఘటనలు జరిగాయి. యౌవన ప్రాదుర్భావంలో కొన్ని విపత్తులు విరుచుకుపడ్డాయి. తల్లి మరణించింది. నళిని బెంబేలుపడిపోయింది. కుసుమకి పిచ్చెక్కింది. నళిని ఆ దుస్సంఘటనకి తట్టుకోలేకపోయింది. ఫలితం జీవితమంటే ఆమెకి ఒకవిధమైన భయం ఏర్పడింది. భయంతో ఆమెని సహజ బలహీనతలు ఆవరించాయి. తాము ప్రస్తుతం ఉంటున్న యిల్లు మంచిదికాదని ఒక భావం ఏర్పడింది. దానితో ఒక కొత్త యిల్లు కట్టడానికి సంకల్పించింది. ఆ యింటికి మధు పేరు పెడుదామనుకుంది. కాని తనపేరట ఏపని చేయడానికి సంకల్పించినా, ఏదో అవాంతరం జరుగుతుందని మధు వాదించడంతో మానవ సహజమైన బలహీనతలో దానికి ఆ పేరు పెట్టడం మానుకుంది. చివరకి వినయబాబు పేరట యిల్లు కట్టడానికి నిశ్చయించింది. ఫలితం, జీవితంలో మొదటిసారిగా మూఢవిశ్వాసాలకి గురి అయింది. ఇది తన బలహీనతకి ఒక చిహ్నమని ఆమెకి బాగా తెలుసు. కాని సాహసిస్తే ఏమి జరుగుతుందోనని భయం. మొదటనే దెబ్బతిన్న హృదయం మరీ అనుమానాస్పదంగా పరిణమించింది. అనుమానం పెనుభూతం వంటిది. అది మనిషిని సాహసించి ఏపనీ చేయనివ్వదు. ఫలితం, భార్యాభర్తల మనస్తత్వాలు భీరుత్వపురంగు పులుముకున్నాయి. ఉభయులూ జీవితంలో అసమర్థులైనారు

నళిని ఆదర్శ సహకారసమితిలో సభ్యురాలై సెక్రెటేరియట్‌కి ఎదురుగా నౌబత్‌పహాడ్ పక్కన వినయబాబు పేరట రెండువేల గజాల

ప్లాటు కొన్నది. హైదరాబాద్ పురపాలకసంఘానికి యింటి ప్లాను మంజూరీకి పంపించింది. ఇంటికి కావల్సిన ఇనుముకోసం దరఖాస్తు పెట్టింది. ఫ్రంటు ఎలివేషన్ చూస్తే యిల్లు ఇంద్రభవనంగా కనపడింది మధుకి. అంత చక్కటి యింట్లో తాము నివసించడం ఎందుకో అనుమానాస్పదంగా తోచింది మధుకి. ఎన్నడూ అనుభవించని సుఖం ఏదో లభించనున్నదంటే ఎందుకో మధు హృదయం శంకిస్తుంది అనుమానపడుతుంది.

వికారినామ సంవత్సర కార్తీక శుద్ధ పంచమీ గురువారం ఉదయం తొమ్మిది గంటలకి బ్రాహ్మడు శంకుస్థాపనకి ముహూర్తం ఏర్పాటు చేశాడు. నళిని కార్తీక శుద్ధ చవితీ బుధవారంనాడే శంకుస్థాపనకి అవసరమైన నవధాన్యాలు, ముత్యం, పగడం, బంగారం, రవికెకణుసు, పూలు, కొబ్బరికాయ, తమలపాకులు, పోకలు మొదలైన వస్తువులన్నీ తెప్పించి వేసింది. పంచమీ గురువారం ఉదయం ఎనిమిదిన్నరకల్లా మధు నళినులు, వినయబాబు యుక్తంగా ప్లాటుకి చేరుకున్నారు రామచంద్రయ్య సామానులన్నీ పట్టించుకొని, బ్రాహ్మడియుక్తంగా ఆ వెంటనే ప్లాటుకు వచ్చాడు. సరిగ్గా తొమ్మిదిగంటలకి గణపతిపూజతో శంకుస్థాపనోత్సవం ప్రారంభమైంది. వాయువ్యమూలకి మోకాటి లోతున ఒక గుంట త్రవ్వి బ్రాహ్మడు ఏవో మంత్రాలు చదువుతుండగా వినయబాబుతో తెచ్చిన నవధాన్యాలు, ముత్యం, పగడం, బంగారం, రవికెకణుసు గుంటలో వేయించారు. వినయబాబు వేయలేకపోతే ఆ వస్తువులన్నీ అతని చేతికి తాకించి తలిదండ్రులు అతనిపక్షాన పూజచేసి గుంటలో వేశారు. మధు కొబ్బరికాయ కొట్టాడు. పుట్నాలు, బెల్లం, నారికేళం, నైవేద్యం పెట్టి అందరికీ పంచిపెట్టారు. దాదాపు పదిగంటలకి పూజ పూర్తి అయింది. మేస్త్రీ రాళ్ళూ, సున్నంతో ఆ గుంట నింపాడు. ఆరోజే పనివాళ్ళు పునాదులు తీయడం ప్రారంభించారు. రెండు వారాలలో ఇంటికి పునాదులు

తీయడం పూర్తి అవుతుందనీ, దాదాపు మూడునెలల్లో ఇంటికి కప్పు పడుతుందని మేస్త్రీ నళినికి చెప్పాడు. తాను ప్రసవించేసరికి ఇంటికప్పు పడుతుందని నళినిఎంతో సంతోషించింది. ఇంకో మూడునెల్లు ఓపిక పడితే మొదటిఅంతస్థు పూర్తి అవుతుంది. అప్పుడు గృహప్రవేశం చేయవచ్చు. ఒక ఆరు మాసాల్లో బర్కత్‌పురం యింటినించి కొత్త యింటికి మారవచ్చునని అంచనావేసి, అమితానందభరితురాలైంది నళిని. ఎందుకో ఆమెకి ఆ రోజున ప్లాటునించి కదలడానికి బుద్ధిపుట్టలేదు. పనివాళ్లు పునాదులు త్రవ్వుతుంటే ఎంతసేపని చూస్తూ కూర్చుంటుందని ? కొంతసేపు చూస్తూ కూర్చునేసరికే విసుగుపుట్టింది. ఆ రోజున ఆమె లేతగులాబీరంగు పట్టుచీర ధరించింది. ఎర్రటి ముఖమల్ జాకెటు వేసుకుంది. ఎడారిలో రోజాపుష్పం వికసించినట్లు కనపడింది నళిని ఆ మైదానంలో. ఆమె ఉత్సాహం, ఆనందాతిశయం కొంత మధుకికూడా సోకింది. ఎందుకో ఆరోజు అతనికికూడా పర్వదినంగా కనపడింది. నళిని తన ఆనందాన్ని పట్టలేక, నౌబత్‌పహాడ్ పైకి వెళ్ళి మధ్యాహ్న భోజనం ఆ గుట్టపైనే చేతామని సూచించింది. మధు ఆమె కోరికని కాదనలేకపోయాడు. వెంటనే రామచంద్రయ్యని పంపించి, క్యారియర్‌లో రెండు భోజనాలు తీసురమ్మన్నాడు. రామచంద్రయ్య కార్‌లో వెళ్ళి క్యారియర్, రెండు వెండికంచాలు తీసుకొనివచ్చాడు. రామచంద్రయ్య తిరిగి రావడంతోనే నళినీ మధులు గుట్ట ఎక్కడం ప్రారంభించారు. కనకాంగి వినయబాబుని ఎత్తుకున్నది. రామచంద్రయ్య క్యారియర్, కంచాలు, మరచెంబు, వాటర్ బ్యాగులతో ఆవెనక బయల్దేరాడు. ముందు మధు, తరువాత నళినీ, ఆతరువాత వినయబాబుతో కనకాంగీ, సామానులతో రామచంద్రయ్య గుట్ట ఎక్కడం మొదలెట్టారు. నళిని గుట్ట ఎక్కలేక మధ్యమధ్య ఆగి ఆయాసంగా ముందుకు సాగుతున్నది. మధు నళినికోసం ఆగి, ఆమెకు తనచెయ్యి అందిస్తున్నాడు. ఆ చెయ్యిని

ఊతగాగొని నళిని క్రమంగా పైకి సాగింది. నళినికి అయిదునెలల గర్భ మని ఎవ్వరికీ ధ్యాసలేదు. ఇంక కొన్ని రోజులవుతే ఆరునెల్లు నిండు తాయి. ఆయిదునెల్లే గనుక ఫరవాలేదని నళిని అనుకుంది. మిగతావారికి ఆ సంగతి తట్టనేలేదు. ఇరువై నిమిషాలకి నళిని, మధులు గుట్టమీదికి ఎక్కారు.

గుట్టమీద వలయాకారంలో గోపురంవలె మనిషికి కొంచెం ఎత్తుగా ఒక చిన్న కట్టడం వుంది. ఆ కట్టడంమీదికి ఎక్కి భార్యాభర్తలు నలువేపులా పరుచుకొని వున్న సికింద్రాబాద్, హైదరాబాద్ జంట నగరాలని కలయజూచారు. జంటనగరాలు ఎంతో ముచ్చటగా ఆపైనించి కనపడుతున్నాయి. చార్‌మీనార్, ఫలక్‌నుమా, మక్కామస్జిద్, యూనివ ర్సిటీ భవనాలు, ఆగుట్టమీదినించి విస్పష్టంగా దృగ్గోచర మవుతున్నాయి. "అదిగో హైకోర్టు" అంటే, "అదుగో ఫలక్‌నుమా ప్యాలెసు" అని భార్యాభర్త లిరువురూ, ఒకరికొకరు ఆ భవనాల్ని పిల్లలకిమల్లే ఎంతో ఉత్సాహంగా చూపించుకున్నారు. ఆ ఎత్తుపైన నిలబడి నలువేపులా పరచుకొనివున్న నగరాల్ని చూస్తుంటే, "నాకు ప్రేమించే భర్త ఉన్నాడు. చక్కని కుమారుడు ఉన్నాడు. తరగని ఐశ్వర్య ముంది. జీవితంలో నాకు ఏమి కొరత ఉంది?" అనే భావం ఎందుకో నళిని బుర్రలో తళుక్కున మెరిసింది. గర్వంతో ఆమె పెదవులు వికసించాయి.

"ఏమిటి చిరునవ్వుతున్నావు?" అని అడిగాడు మధు, ఆ చిరు నవ్వుకి కారణం తెలుసుకుందామనే కుతూహలంకొద్దీ.

"ఆఁ ఏమీలేదు" అని చిరునవ్వుతోనే తప్పించుకోవడానికి చూచింది నళిని.

"ఏమీ లేకండా చిరునవ్వు వస్తుందా?" అని ప్రశ్నించాడు మధు నళినిని ప్రేమగా.

"ఈ కొండపైనించి క్రిందికి చూస్తుంటే ఎందుకో నాకు జీవిత శిఖరాగ్రంపైన ఉన్నట్లు తోచింది" అంది నళిని జవాబుగా.

"ఎందువల్ల?" అని అడిగాడు మధు ఉండబట్టలేక.

"జీవితంలో నాకు ఏం కొరత ఉందని, శిఖరాగ్రంపైన ఉండక పోవడానికి?" అని అడిగింది నళిని, మధు ప్రశ్నకి ఎదురు ప్రశ్న వేస్తూ.

"జీవితంలో నీకు ఏకొరతా లేదా?" అని అడిగాడు మధు, నళిని సంతృప్తికి ఆశ్చర్యపోతో.

"నాకు తెలిసినంతవరకు నాకు ఏకొరతా లేదు. నన్ను ప్రేమించి ఆరాధించే భర్త ఉన్నాడు. ముద్దుగొలిపే కుమారుడు ఉన్నాడు. సిరి సంపదలు ఉన్నాయి. సుఖసౌఖ్యాలు ఉన్నాయి. ఇంక కోరుకోదగ్గది జీవితంలో ఏముందని?" అని నళిని ఎదురుప్రశ్న వేసింది.

ఎందుకో స్త్రీహృదయం సంతృప్తితో పలుకుతున్నట్లు తోచింది మధుకి. నళిని నిజంగా అల్పసంతోషి అనుకున్నాడు మధు. నళిని గర్వ కారణంగా చెప్పుకుంటున్న కటాక్షాలన్నిటినీ జీవితం తనకికూడా ప్రసాదించింది. కాని ఎందుకో తనుమాత్రం ఈ కటాక్షాలతో సంతృప్తి జెందడంలేదు. తనహృదయం ఎందుకో ఆందోళన పడుతున్నది. గతాన్ని మరచిపోలేకపోతున్నది. వర్తమానంలో జీవించి, ఉన్నదానితో సంతృప్తి జెందలేకపోతున్నది.

"నీ భర్త నిన్ను ప్రేమించి, ఆరాధిస్తున్నాడనేనా నీ నమ్మకం?" అని అడిగాడు మధు, నళినిని కాస్త ఉడికింతామనే ఉద్దేశంతో.

"ఆ సంగతి మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోవాల్సిన అవసరంలేదు. నా హృదయాన్ని అడగండి, నిజం మీకే తెలుస్తుంది" అని నళిని టకీమని సమాధానం చెప్పింది.

"అల్లాగా!" అని మాటవరుసకి అన్నాడు మధు నళిని కనపరచిన విశ్వాసానికి లోలోపల గర్విస్తో.

"ఇంక జీవితంలో నాకేమీ అక్కరలేదు. కాగా నేను ఈక్షణాన మరణించినా, నాకేమీ అభ్యంతరం ఉండదు" అని అంది నళిని ఎక్కడో శూన్యంలోకి చూస్తో.

మధు ఆర్ద్రోక్తిలో తన కుడిచెయ్యి నళిని నోటికి అడ్డంగా పెట్టాడు. ఎందుకో అతని హృదయం చివుక్కుమంది. వినయబాబు ఆ దేక్షణంలో ఎందుకో గొల్లున ఏడ్చాడు. నళిని బాబుని కనకాంగిచేతుల్లోంచి తీసుకుంది. తల్లి చంకలోకి రావడంతోనే బాబు మత్తుమందు చల్లినట్లు ఏడుపు మానేశాడు. మధు మనస్సు మనస్సులో లేదు. ఏదైనా అపశకునం జరిగదుకదా అని అతని హృదయం శంకించింది. కాని అతను పైకి ఏమీ మాట్లాడలేదు

కనకాంగి, మధు నళినులకి వెండికంచాల్లో వడ్డించింది. ఏవో కబుర్లు చెప్పుకుంటూ భార్యాభర్తలు భోజనాలు చేశారు. ఎందుకో మధుకి అన్నం సహించలేదు. తినకపోతే నళిని ఏమనుకుంటుందోనని భయం వేసింది. ముద్దముద్దకీ నీళ్ళు పట్టిస్తూ, కలుపుకున్న అన్నం ఏవో నెపంపైన నళిని కంచంలో కొంతవేస్తూ భోజనం ముగించాడు. నళిని ఎంతో ఉత్సాహంగా ఉంది. జీవితంలో ఏదో ఘనకార్యం సాధించినట్లు ఆనందిస్తున్నది. ఆ ఉత్సాహంలో, ఆ ఆనందంలో మామూలుకన్నా రెండుముద్దలు ఎక్కువగానే తిన్నది. తాంబూలం నములుతూ, ఉభయులూ కాసేపు గోపురంవలెవున్న కట్టడంలో నీడపట్టున భుక్తాయాసం తీర్చుకున్నారు. ఇంతలోకే కనకాంగి ఎంగిళ్ళు ఎత్తి, కంచాలూ, క్యారియర్ కడిగింది.

క్షణక్షణానికి ఎండ తీక్షణమవుతున్నది. కాగా వేడిగాడ్పులు వీస్తున్నాయి.

"ఇంక వెడుదామా ?" అని అడిగాడు మధు నళినిని, పిల్లవాడు ఎండతాపానికి తట్టుకోలేకపోవడం గమనించి.

నళిని మధు ప్రశ్నకి సమాధానంగా గుట్టదిగడం ప్రారంభించింది.

మధు లేచి నళినిని అనుసరించాడు.

మధు వెనకాల కనకాంగి వినయబాబుతో, రామచంద్రయ్య సామానులతో బయల్దేరారు. గుట్ట ఎక్కడంకన్నా. దిగడం చాలా సులభమని తోచింది మధుకి గుట్ట దిగుతున్నప్పుడు. నళిని ఏ ఆలంబన అవసరం లేకండా చకాచకా గుట్టదిగుతున్నది. "నెమ్మదిగా, నెమ్మదిగా" అంటూనే మధు ఆమెని అనుసరించాడు. ఉభయులూ గుట్టదిగి కార్ దగ్గరికి వెళ్ళి కార్‌లో కూర్చున్నారు. నళిని, కనకాంగి దగ్గరినించి పిల్లవాడిని అందుకోవడమే తడవుగా "రంయ్యి"న కార్ ముందుకు సాగింది. టాంకుబండ్ మలుపూ...లిబర్టీ టాకీసు మలుపూ...దాటి హిమాయత్‌నగర్ మీదుగా బర్కత్‌పురం దారిపట్టింది.

* * *

## ౧౦

జీవితం ఒక కట్టుబాటులో నడిచినంతవరకే, ఏ ఉపద్రవం లేకండా సాగిపోతుంది. క్రమశిక్షణ తప్పితే పట్టాలు తప్పిన రైలుబండికి మల్లే కుప్పగా కూలిపోతుంది. పడిపోయిన రైలుబండిని చూస్తే, దాని పూర్వస్వరూప మేమిటో ఎంత రూపకల్పన చేసుకుందామన్నా వీలు పడదు. ఎక్కడ చూచినా కర్రముక్కలు, వంగిపోయిన యినుపసీకులు కనపడుతాయి. ఆ ముక్కలూ, ఆ సీకుల్నిబట్టి రైలుబండిరూపంలో అది ఎంత వేగంగా నడిచేదో మనకు ఏమాత్రం బోధపడదు. జరిగిన ప్రమాదానికి ఎన్నికారణాలు వెతికినా చెక్కుచెదరని స్థితిలో, ఆ రైలు బండిని తిరిగి మనం చూడలేము. ఆ ముక్కల్ని ఆ సీకుల్ని కూర్చి తిరిగి ఆ రైలుబండిని నిర్మించలేము. ఉమామహేశ్వరరావుగారికి ఏ యౌవ

నారంభంలోనో తాగుడు అలవాటు అయింది. భార్య, ఉంపుడుకత్తె మరణాలతో అది మితిమీరింది. దుఃఖోపశమనానికి ఉమామహేశ్వర రావుగారు సర్వకాల సర్వావస్థలలో తాగడం ప్రారంభించారు. కొంత కాలానికి అది జీవితంలో ఒకప్రధాన వ్యాపకంగా మారింది. చివరికి ఒక వ్యసనంగా పరిణమించింది. ఈ వ్యసనం మొదట బియర్‌తో ప్రారంభమై బ్రాండీ, విస్కీ, రమ్ పరిధుల్ని కూడా దాటింది. ఒకదానికన్నా ఇంకొకటి ఘాటు ఎక్కువ. అంతస్థులవారీగా ఆల్కోహాల్ నిష్పత్తి ఎక్కువ. మత్తెక్కించే గుణం ఎక్కువ. ఒక పరిమితిలో ఉంటే బియర్ మత్తెక్కిస్తుంది. వలసినంత లంతుంది. కాని పరిమితి దాటిన కొంత కాలానికి అది మత్తెక్కించడం మానుకుంటుంది. అప్పుడు బియర్‌తో పని జరగదు. ఏ బ్రాండీ కోసమో మనస్సు అర్రులు చాస్తుంది. ఆ తరు వాత విస్కీ, రమ్. ఇల్లా అంతస్తులవారిగా ముందుకు సాగినకొద్దీ ఏ పానీయంకూడా మత్తెక్కించలేని స్థితి ఏర్పడుతుంది. ఏ పానీయం కూడా తన్నజాలని స్థితివస్తుంది. అప్పుడు మనిషి కాపుసారాకి ఎగబడతాడు. ఈ కాపుసారాల్లోకూడా ఎన్నోరకాలు. ఒకదానికన్నా ఇంకొకటి గట్టిగా పనిచేస్తుంది. ఉమామహేశ్వరరావుగారు పానీయాలకి సంబంధించిన అన్ని అంతస్థులని దాటి, నాటుసరకులోకి దిగారు. దానికితోడు నల్లమందు కూడా అలవాటు చేసుకున్నారు. ఒకదాన్ని మించిన అలవాటు ఇంకొకటి. కొందరు ఇవి ఏవీ పనిచేయకపోతే నిషాకోసం రోజూ చిన్నపాముతో కాటు వేయించుకుంటారట. ఉమామహేశ్వరరావుగారు ఈ ఉచ్ఛస్థితిని అందుకోకపోవడం హర్షించదగ్గ విషయమే. నల్లమందూ, నాటుసారాలు కలిసి, వారి శరీరాన్ని గుల్లచేశాయి. లంగ్ క్యాన్సర్, బ్లడ్ ప్రెషర్, ఇంకా ఏవో జబ్బులు వారిని కృంగదీశాయి. ఇవి ఎంతకాలంనించి వారిని పట్టి బాధిస్తున్నాయో ఎవ్వరికీ తెలియదు. ఒకరోజు రాత్రి రెండు గంటలకి పనిమనిషి వచ్చి "ధొరవారికి ఎల్లాగో ఉంది. వెంటనే రమ్మన"

మని నళినితో చెప్పేవరకూ, వారి శరీరస్థితి అంతప్రమాదకరమైన స్థితిలో ఉందని నళినికిగాని, మధుకిగాని తెలియదు. వెంటనే భార్యాభర్తలు ఎదురింటికి పరుగెత్తారు. డాక్టర్ కోసం రామచంద్రయ్యని పరుగెత్తించాడు. నళినీ, మధులు వెళ్ళి చూసేసరికీ ఉమామహేశ్వరరావుగారు గుడ్లు తేలేస్తున్నారు. అంత ప్రమాదకరమైన స్థితి వచ్చేవరకూ, ఎవ్వరూ తనకు కబురు చేయనందుకు నళిని పనిమనుషులమీద ధుమధుమలాడింది. "దొరవారు కబురు చేయవద్దన్నప్పుడు, ఎల్లా కబురుచేయడ" మని పనిమనుషులు నళినితో మొరపెట్టుకున్నారు. గడచిన రెండుమూడు రోజులనించీ వచ్చిపొయ్యే ప్రాణాలతో గిలగిల తన్నుకుంటున్నారట. ఈ మధ్య వచ్చిన మనస్పర్థల మూలకంగా, నళినికిగాని, మధుకుగాని, తమ శరీరస్థితిని గూర్చి ఏమీ తెలియజేయవద్దని పనిమనుషులకి గట్టిగా తాకీదు చేశారట. రామచంద్రయ్య మాటవరుసకైనా, ఉమామహేశ్వర రావుగారు అవసానదశలో వున్నారని చెప్పలేదు. నళినిని చూడీచూడడం తోనే "వచ్చావా తల్లీ, రావేమోననుకున్నాను" అన్నారు ఉమామహేశ్వర రావుగారు "రోగం ఇంతగా ముదిరేవరకూ, ఎందుకుచెప్పి పంపించలే" దని ప్రేమగా అడిగింది నళిని. "ఏ మొహం పెట్టుకొని చెప్పి పంపించమంటావు?" అని అడిగారు ఉమామహేశ్వరరావుగారు దీనంగా. మధు ఎన్నడూ వారితో మాట్లాడలేదు. వారిని చూడడంకూడా, ఇది రెండవసారో, మూడవసారో. ఉమామహేశ్వరరావుగారు మధుతో మాట్లాడకుండానే, కూర్చోమ్మని కళ్ళతో సంజ్ఞచేశారు. ఆ సంజ్ఞకి హృదయం కలచివేసినట్లైంది మధుకి. చప్పున కళ్ళల్లో నీళ్ళునిండాయి. నళిని దుఃఖాన్ని ఆపుకోలేకపోతున్నది. వెకివెక్కి ఏడుస్తూనే వారితో మాట్లాడుతున్నది. ఉమామహేశ్వరరావుగారికి మధ్యమధ్య ఏదో ఆయాసం తెరవస్తున్నది. ఆ తెర వచ్చినప్పుడు గుడ్లు తేలేస్తున్నారు. ఆయాసం తొలగడంతోనే, మామూలుగా మాట్లాడుతున్నారు. స్పృహ ఏమాత్రం

తప్పలేదు. ఆ ఆయాసమేమిటో ఎవ్వరికీ అర్థంకావడంలేదు. అంత ఆయాసంలోకూడా స్పృహతప్పకపోవడం కొంత మేలేననుకున్నాడు మధు. లేకపోతే ఆ నాలుగుమాటలైనా మాట్లాడివుండేవారుకారు. డాక్టర్ వచ్చాడు. దీర్ఘంగా పరీక్షించాడు. ఏదో ఇన్‌జెక్షన్ ఇచ్చాడు. మధుని పక్కకి తీసుకెళ్ళి పెదవి విరిచాడు. మధు తిరిగి గదిలోకి వెళ్ళడంతోనే నళిని డాక్టర్ చెప్పినవిషయం ఎల్లాగో గ్రహించి గొల్లుమన్నది బహుశా తన ముఖకవళికలబట్టి గ్రహించిందేమోననుకున్నాడు. తను అనుమానించి నట్లే లంగ్ క్యాన్సర్ అని చెప్పాడు డాక్టర్ మధుకి. రక్తపుపోటు అని కూడా చెప్పాడు. పరిస్థితి ప్రమాదకరంగా వుందన్నాడు ఏ క్షణంలోనో ప్రాణం పోవచ్చునని చెప్పాడు. ఏమిచెయ్యడం ? ప్రాణాల్ని ఎల్లా నిలబెట్టడం ? క్యాన్సర్ స్పెషలిస్టుని ఎవ్వరినైనా పిలిపిస్తే ? అతను వచ్చేలోపుగా, ప్రాణం పోయితీరుతుందని డాక్టర్ నిక్కచ్చిగా చెప్పాడు. అయినా ప్రయత్నంచేసి చూడమని మధు డాక్టర్‌తో అన్నాడు. డాక్టర్ క్యాన్సర్ స్పెషలిస్టుకి ఎవ్వరికో టెలిఫోన్ చెయ్యడానికి క్రిందికివెళ్ళాడు. మధు ఉమామహేశ్వరరావుగారి పడకగదిలోకి వచ్చాడు. ఇంతలోకే నళిని గొల్లుమనడం జరిగింది. "కుసుమఏదీ ?" అని అడిగారు ఉమా మహేశ్వరరావుగారు. వెంటనే కుసుమకోసం, కిశోర్‌కోసం కబురు పంపించాడు మధు. నళిని కూర్చున్నచోటునించి కదలలేదు. ఏకధారగా ఏడుస్తున్నది. ఆసంగతి గమనించి ఉమామహేశ్వరరావుగారు "ఇంకా ఏడ్చి ఏమిలాభం తల్లీ" అని అంటున్నారు. కుసుమ రాలేదు. కిశోర్ వచ్చి నళిని ఏడుస్తూవుండడం చూచి అతనూ గొల్లుమన్నాడు. "కుసుమ ఏదీ ?" అని మధు పనిమనిషిని అడిగాడు. "నిద్రలోంచి లేపితే, పక్క మీద లేచికూర్చుంది. దొరవారి జబ్బుసంగతి చెప్పి, మిమ్మల్ని తీసుకు రమ్మంటున్నారంటే ఎంతకూ కదలదు. ఏవో పిచ్చిచూపులుచూస్తున్నది." అని సమాధానం చెప్పాడు పనిమనిషి. అప్పుడు తెలిసింది మధుకి,

కుసుమది ఎంత ప్రమాదభరితమైన పిచ్చో. కూతురిని, తండ్రినించి శాశ్వతంగా వేరుచేసింది ఆ పిచ్చి. తండ్రి అవసానకాలంలో వున్నాడనే విషయాన్ని కుసుమకి అర్థం కానివ్వకుండా చేసింది ఆ పిచ్చి. "విధి ఎంత బలీయమైందీ?" అని అనుకున్నాడు మధు లోలోపల. ఉమామహేశ్వరరావుగారు మరణిస్తున్నందుకు అంతగా దుఃఖపడలేదు మధు. కాని ఆ అవసానవేళలో, కుసుమ వారిని ఆఖరుచూపుగానైనా వచ్చి చూడనందుకు, మధు హృదయం తరుక్కుపోయింది. "కుసుమరాలేదా?" అని అడిగి, నళిని కుసుమని తీసుకురావడానికి ఉమామహేశ్వరరావుగారి పక్కమీదినించి లేవడానికి ఉద్యుక్తురాలైంది, కాని ఆ విషయాన్ని గ్రహించి ఉమామహేశ్వరరావుగారు "లాభంలేదు వెళ్ళవ"ద్దని చేతితో సంజ్ఞచేశారు. ఆ సంజ్ఞకి నళిని ఏడుస్తూ, కూర్చున్నచోటనే కూర్చుండిపోయింది. దీపం ఆరిపోయేముందు, ఒకమాటు భగ్గున వెలుగుతుంది. అదేమోస్తరు ఉమామహేశ్వరరావుగారు చనిపోయేముందు, అన్ని ఆయాసాలూ మరిచి, మధుని చేతితో దగ్గరకి రమ్మని పిలిచారు. మధు దగ్గరికెళ్ళడంతోనే, "చిన్నచిన్న పిల్లల్ని వదిలివెడుతున్నాను. పోతూ పోతూ వాళ్ళని నీకు అప్పగిస్తున్నాను. వాళ్ళని పోషించుకునేభారం నీది" అని చెప్పి చివరసారిగా కళ్ళుమూశారు. దీపం శాశ్వతంగా కొండ ఎక్కింది. కనకాంగి ఉమామహేశ్వరరావుగారి కళ్ళూ, నోరూ మూయడం గమనించి అందరూ ఒకేసారి గొల్లుమన్నారు. కనకాంగి, నలుగురు మనుషుల సహాయంతో ఉమామహేశ్వరరావుగారిని మంచంమీదినించి క్రిందికిదింపి పైకప్పుయుక్తంగా బోసినేలమీద పడుకోబెట్టింది. మొహం నిండా కప్పుకప్పింది. ఏడుపులమధ్య క్యాన్సర్ స్పెషలిస్టు వచ్చి, వచ్చిన దారినే తిరిగివెళ్ళాడు. "ఆస్తి పంపకంకోసం నాతో పోట్లాడుతూనైనా ఇంకా నాలుగురోజులు బ్రతికివుండలేకపోయావా మామయ్యా" అని నళిని వెక్కివెక్కి ఏడ్చింది. కిశోర్ "నాన్నా! నాన్నా!" అంటూ

ఏకధారగా ఏడుస్తున్నాడు. "ఇంకెక్కడినాన్న బాబూ. 'నాన్న' అని పిలిచే అదృష్టం నీకు లేకండా చేసిపోయారు" అని కనకాంగి కిశోర్‌ని ఓదారుస్తున్నది, ఒకచెంపని తాను సంతతధారగా ఏడుస్తో—శవం తలవేపు ప్రమిదెల్లో దీపంపెట్టాడు ఒక పనిమనిషి. వాకిట్లో పిడకలతంపి పేర్చి ముట్టించాడు ఇంకొక పనిమనిషి.

అనాటిరాత్రి యావత్ప్రపంచం మైమరచి సుఖంగా నిద్రపో తున్నది. నళినివంటి ఏ నిర్భాగ్యులో తమ ఆప్తబంధువుల్ని కోల్పోయి మానవాళినించి వెలేసినట్లు ఏడుస్తున్నారు, అక్కడక్కడ ఈ విశాల విశ్వంలో.

మరునాడు ఉమామహేశ్వరరావుగారి అంత్యక్రియలు జరిగేసరికి సాయంత్రం నాలుగుగంటలు దాటింది.

అనాడు కుసుమ తన గదిలోంచి బయటికి రాలేదు. ఎదురింటి ముందర ఏమి జరుగుతున్నదో తొంగిఅయినా చూడలేదు. మామూలుగా కాలకృత్యాలు తీర్చుకుంది. అంత్యక్రియల తరువాత మామూలుగా అన్నం తిన్నది. ఒక్క కుసుమకితప్ప ఆనాడు ఎవ్వరికీ అన్నం సయించ లేదు ఆ యింట్లో.

ఎన్ని హృదయవిదారకమైన సంఘటనలు జరిగినా, కుసుమకిమల్లే తనకూఏమీ తెలియనట్లు కాలచక్రం తిరుగుతున్నది. ఉమామహే శ్వరరావుగారు దివంగతులైన సంగతిని పొట్టలోపెట్టుకొని జీర్ణించుకొని, దానిని రోజులుగా త్రెంచివ్రేస్తున్నది.

నౌబత్‌పహాడు ఎక్కినప్పటినుంచీ నళినికి రక్తస్రావం అవు తున్నది. నళిని ఎవ్వరితోనూ ఆసంగతి చెప్పలేదు. అశ్రద్ధచేసింది. కాని ఉమామహేశ్వరరావుగారు దివంగతులైననాటినుంచీ, రక్తస్రావం మరీ ఎక్కువైంది. అనాడు నళినికి తిండీతిప్పలూ లేవు. అనాడేకాదు, అయిదారు రోజులవరకూ తిండి సయించలేదు. ఏవో కనకాంగి చెప్పిన

చిటకావైద్యాలు చేసిచూసింది. కాని తగ్గలేదు. ఇంక మధుకి చెప్పక తప్పిందికాదు. ఉమామహేశ్వరరావుగారు మరణించిననాటినించే రక్తస్రావం అవుతున్నదని మధుతో చెప్పింది. మధు గాభరాపడ్డాడు. వెంటనే డాక్టర్‌దగ్గరికి తీసుకెళ్ళాడు. గర్భవిచ్ఛిత్తి జరుగుతుందేమోనని భయపడ్డాడు. లేడీడాక్టర్ నళినిని పరీక్షించింది. ఏవో పిల్సూ, ఇన్‌జెక్షన్‌లు వ్రాసియిచ్చింది. మందు వేసుకునేవిధానం చెప్పింది. రోజుతప్పిరోజు ఇన్‌జక్షన్‌లకి రమ్మన్నది. ఉపచారం సాగుతున్నది. నళిని ఒకనాడు విడిచి ఇంకొకరోజున ఇన్‌జక్షన్‌లకి వెడుతున్నది. పనేమీ ముట్టుకోవద్దని, లేడీడాక్టర్ నళినికి హెచ్చరిక చేసింది.

కొన్నిరోజులకి రక్తస్రావం తగ్గింది. మధు హృదయం తేలికపడ్డది.

నౌబత్‌పహాడ్ దగ్గర తీసుకున్న ప్లాటులో ఇంటిపునాదులు పూర్తి అయినాయి. గోడలు లేస్తున్నాయి. పునాదులు పూర్తికావడంతోనే మేస్త్రీ మూడువేలరూపాయలు తీసుకున్నాడు.

రోజుకి ఒకమాటు ఏ సాయంత్రమో, ఏ ఉదయమో నళిని ప్లాటుకు వెళ్ళివస్తున్నది. ఏనాటికానాడు ప్రగతిని పరిశీలిస్తున్నది. మేస్త్రీని కలుసుకున్నప్పుడల్లా, "ఇల్లు త్వరగా ముగించ"మని నళిని అతన్ని తొందరపెడుతున్నది. పునాదులు పూర్తిఅయినరోజున ఆమె సంతోషానికి మేరలేదు. పనివాళ్ళందరికీ ఆరోజు తలఒక్కింటికి ఒకరూపాయి చొప్పున ఎక్కువకూలీ యివ్వవలసిందిగా మేస్త్రీకి తాకీదు చేసింది. కూలీడబ్బులు పోను మిగతాడబ్బు తనపేరట పద్దు వ్రాసుకోవలసిందిగా మేస్త్రీకి చెప్పింది. ఆ యింటిపట్ల నళిని అంత ఉత్సాహమెందుకు చూపుతున్నదో మధుకి ఏమాత్రం అర్థంకాలేదు.

బిక్కుబిక్కుమని యింట్లో కూర్చోవడానికిబదులు నళినికి ఈ వ్యాపకం లభించడం బాగానేవుందనుకున్నాడు మధు.

రోజులు గడిచిపోతున్నాయి. రోజులు గడచినాకొద్దీ మహా వృక్షంలాగా ఇల్లు భూమిలోంచి పైకి మొలచుకువస్తున్నది గోడల రూపంలో పైకి విస్తరిస్తున్నది.

గోడలు లేస్తున్నాకొద్దీ, నళిని ఆశలు చిగురిస్తున్నాయి.

గృహప్రవేశం జరిపి, బసమార్చడానికి ఇంక అట్టేకాలం పట్ట దని, గోడలు పెరుగుతున్నాకొద్దీ నళిని ఉవ్విళ్ళూరుతున్నది.

ఆగినట్టే ఆగి, తిరిగి కొన్ని రోజులకి నళినికి రక్తస్రావం ప్రారంభమైంది. ఈసారి తప్పక ఆబార్షన్ జరుగుతుందేమోనని మధుకి భయం వేసింది. తిరిగి నళినిని లేడీడాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళాడు. తిరిగి మందులూ, ఇన్‌జెక్షనులూ ప్రారంభమైనాయి.

ఈమాటుకైనా తనకు కూతురు పుడుతుందేమోనని మధుకి ఆశగా వుంది. కాని అప్పుడప్పుడు రక్తస్రావంవంటి అవాంతరాలు వచ్చి అతని ఆశని నిరాశగా మారుస్తున్నాయి.

నళినికి కడుపు పోదుగద ? ఏమో ? పోకండా సురక్షితంగా వుండాలని దేవుడంటే ఒకవిధంగా నమ్మకం లేని మధు, ఒక రోజున ముప్పైమూడు కోట్ల దేవతలకి మ్రొక్కుకున్నాడు. మ్రొక్కుకున్న తరువాత దేవుడున్నాడా లేడా అనే సంశయం వచ్చింది మధుకి. తను ఆ విషయం ఎన్నడూ దీర్ఘంగా ఆలోచించలేదు "ఉంటే వున్నాడు, లేకపోతే లేడు" అన్న ధోరణిలో మధు ఇంతవరకూ వ్యవహరించాడు. తను ఎన్నడూ దేవుడిని ప్రార్థించలేదు. కాగా ప్రార్థింతామన్న కోరిక కూడా కలగలేదు. ఒకవేళ వుంటే, తన జీవితంతో అతనికేమీ నిమిత్తం లేదనుకున్నాడు. తనకూ అతనితో నిమిత్తం లేకండా ఈనాటివరకూ గడించింది. కాని ఎందుకో ఆరోజున మధుకి మ్రొక్కుకుందా-మనిపించింది. తనకి తెలియకండానే ముప్పైమూడు కోట్ల దేవతలకి మ్రొక్కుకున్నాడు మధు.

నళినికి రక్తస్రావం ఆగినట్లే ఆగి తిరిగి ప్రారంభ మవుతున్నది. వెలుగునీడల బ్రతుకుని జ్ఞప్తికి తెప్పిస్తూ ఆ జబ్బు నళినితో దోబూచు లాడుతున్నది. నళినికి రోజుకిరోజూ శరీరంలో రక్తం తగ్గుతున్నది. మనిషి తెల్లగా పాలిపోతున్నది. రక్తం క్షీణిస్తున్న సంగతి మధు గమనించలేదు. ఇంట్లో కనకాంగికి గాని, రామచంద్రయ్యకి గాని, పని మనుషులకు గాని ఆ సంగతి తోచలేదు.

ఇంటి గోడలు పూర్తి అయినాయి. ఒకటిరెండు రోజులలో కప్పు వేయాలి.

"కప్పు ఎన్నడు వేయమంటారు?" అని అడిగాడు మేస్త్రీ, ఒకటి రెండు రోజుల్లో కప్పు వేయాల్సి వుందనగా.

"రేపు మంగళవారం. రేపు వద్దు. గురువారం మంచిరోజు, ఆనాడు వెయ్యండి" అని చెప్పింది నళిని, మేస్త్రీకి జవాబుగా.

మంగళవారంనాడు నళిని లేడీడాక్టర్ దగ్గరికి వెళ్ళింది. లేడీడాక్టర్ నళినిని జాగ్రత్తగా పరీక్షించి, "శరీరంలో బొత్తిగా రక్తంలేదు. వెంటనే మీరు ఆసుపత్రిలో అడ్మిట్ కావా" లని చెప్పింది నళినితో.

"ఒకటిరెండు రోజులు ఆలస్యమైనా ఫరవాలేదా?" అని అడిగింది నళిని, లేడీడాక్టర్‌ని ఆతురతగా.

"ఎంత త్వరగా చేరితే అంత మంచి" దని అంది లేడీడాక్టర్ జవాబుగా.

"గురువారంనాడు యింటికి కప్పువేస్తారు. శుక్రవారం ఆసుపత్రికి వెళ్ళడం మంచిదికాదు. పోనీ శనివారం అడ్మిటు అవుతే..." అని నళిని లేడీడాక్టర్ వంకచూస్తూ బయటికి ఆలోచించింది.

"ఒకటిరెండు రోజుల్లో జరిగే ప్రమాదమేమీ లేదు. కాని శనివారమైనా తప్పకండా ఆసుపత్రిలో చేరడం అవసరం" మని లేడీడాక్టర్ నళినికి హెచ్చరిక చేసింది.

నళినిని శనివారంనాడు ఆసుపత్రిలో చేర్చడానికి మధు అన్ని ఏర్పాట్లూ చేశాడు.

బుధవారం గడిచింది.

గురువారంనాడు యింటికప్పు వేసే ముహూర్తానికి నళినీ మధులు కార్‌లో ప్లాటు దగ్గరికి వెళ్ళారు. కార్ చూడడంతోనే మేస్త్రీ పనికి మనుషుల్ని సిద్ధంచేశాడు. ఆనాడు ఇంజనీయర్ కూడా సమయానికి ప్లాటు దగ్గరికి వచ్చాడు. కార్ ఆగిందే తడవుగా నళిని త్వరత్వరగా సగం కట్టిన యింటిదగ్గరికి నడచివెళ్ళింది. మధు నళినిని అనుసరించాడు. భార్యాభర్తలు చేరుకోవడంతోనే మేస్త్రీ కప్పుపని ప్రారంభించాడు.

ఆ దృశ్యాన్ని చూచి నళిని కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లినాయి.

ఆ రోజు తిరిగి తల ఒక్కొంటికి, ఒకొక రూపాయి చొప్పున కూలీలకి ఎక్కువ డబ్బు యిప్పించింది నళిని.

శుక్రవారం నళిని ప్లాటుకు వెళ్ళలేదు.

శనివారం ఉదయం పదిగంటలకల్లా భోజనంచేసింది నళిని. అప్పటికే తను తీసుకువెళ్ళవలసిన వస్తువు లన్నిటినీ కనకాంగి సర్ది పెట్టింది. తాంబూలం వేసుకోవడమే తడవుగా భార్యాభర్తలు వెళ్ళి కారులో కూర్చున్నారు. మరుక్షణంలో పనిమనుషులు, తీసుకువెళ్ళవలసిన వస్తువుల్ని కారులో పెట్టారు. కనకాంగి ముందుసీటులో డ్రైవర్ పక్కన కూర్చుంది. భార్యాభర్తలు వెనకాల కూర్చున్నారు.

కార్ కదిలింది.

"విక్టోరియా జనానా హాస్పిటల్‌కి పోనివ్వు" అన్నాడు మధు, వెనకనించి డ్రైవర్‌తో.

"లేదు. ముందు ప్లాటుకి వెళ్ళనివ్వు" మంది నళిని, మధు మాట వినిపించుకోకుండా.

"ఇప్పుడు ప్లాటు కెందుకూ?" అని విసుక్కున్నాడు మధు, నళిని మొహంకేసి చూస్తో.

"ఒక్క నిముషం. అంతే అక్కడ ఎక్కువ ఆలస్యం చెయ్యను. ఆతరువాత ఆసుపత్రికి వెడుదాం" అంది నళిని, ఎంతో ఆప్యాయంగా.

కార్ బర్కత్‌పురంనించి సెక్రెటేరియేట్ దారిపట్టింది.

కార్ ప్లాటుదగ్గర ఆగింది.

ఇంటికి కప్పు పడుతున్నది.

నళిని కార్‌లోంచి దిగలేదు. ఇంటికేసి దీర్ఘంగా చూస్తోకార్ లోనే కూర్చుంది. మేస్త్రీ కార్‌దగ్గరికి వచ్చాడు.

"ఇల్లు ఎన్ని రోజుల్లో పూర్తి అవుతుంది?" అని అడిగింది నళిని మేస్త్రీని.

"రెండు నెలల్లో పూర్తికావచ్చు" నన్నాడు మేస్త్రీ జవాబుగా.

నళినికి ఏడవనెల. తనకి అప్పటికి తొమ్మిది నెల్లు నిండుతాయి. గృహప్రవేశం చేసుకోడానికి వెంటనే వీలుండదు. ప్రసవం అయిన తరువాత గృహప్రవేశం ఏర్పాటు చేసుకోవా ల్ననుకున్నది మనస్సులో.

"ఎంత త్వరగా వీలవుతే అంత త్వరగా యిల్లు కట్టేసెయ్యి" అని చెప్పింది నళిని మేస్త్రీతో.

మొదట ఇంటికప్పు పడడంతోనే గృహప్రవేశం చేతామనుకుంది నళిని. కాని తనకి వచ్చిన జబ్బుఫలితంగా గృహప్రవేశం వాయిదా వేయవలసివచ్చింది.

"రేపటినించీ పనిమనుషుల్ని ఎక్కువచేసి సాధ్యమైనంత త్వరలో కట్టడానికి ప్రయత్నిస్తా" నన్నాడు మేస్త్రీ జవాబుగా.

"హాస్పిటల్‌కి పోనివ్వు" మని ఆతరువాత నళిని డ్రైవర్‌తో చెప్పింది.

కార్ ఆసుపత్రికి చేరుకోవడంతోనే, మధు లోపలికి వెళ్ళి లేడీ డాక్టర్ వ్రాసియిచ్చిన చీటీ చూపించాడు.

ఏవో ఫారమ్‌లు నింపుకొని వాళ్ళు నళినిని ఆసుపత్రిలో అడ్మిట్ చేశారు.

మధు లోపలికి వెళ్ళడానికి వీలులేదు. నళినినీ, కనకాంగినీ లోపలికి పంపి, ప్రత్యేకమైన రూమ్‌కి అడ్వాన్సు చెల్లించి, అరగంట తరువాత ఇంటికి వెళ్ళాడు.

వినయబాబుకి ఏడాది దాటింది. బాబుకోసం ప్రత్యేకంగా ఒక దాయిని కుదిరించి, బాబుని దాని పోషణలో వుంచడం రెండురోజుల క్రితమే జరిగింది.

బాబుకి పాలివ్వడానికి ఒకమనిషి ఎంతోకాలంనించి వుంటున్నది.

ఆ మనిషి మూడు పూటలూ బాబుకి పాలిచ్చి పోతున్నది.

మధు సాయంత్రం నాలుగు గంటలకు బాబుని ఆసుపత్రికి తీసు కెళ్ళాడు. బాబుతోపాటు దాయీదికూడా ఆసుపత్రికి వచ్చింది.

సాయంత్రం నాలుగునించి ఆరుగంటలదాకా మధు నళినితో గడిపాడు.

ఆనాడు ఉదయం పదకొండు గంటలనించి సాయంత్రం నాలుగు గంటల వరకూ ఏ డాక్టర్‌వచ్చి నళినిని చూడలేదు.

ఆనాడు విశ్రాంతి తీసుకోవడంవల్ల నళినికి ఎక్కువ రక్తస్రావం కాలేదు. మధ్యాహ్నం కొద్దిగా నిద్రకూడా పట్టిందట.

ఆనాటి రాత్రి పదకొండు గంటల తరువాత నళినికి, ఎవ్వరో లేడీడాక్టర్ వచ్చి ఏదో ఇన్‌జక్షన్ యిచ్చిందట. ఇన్‌జక్షన్ యిచ్చిన రెండు గంటలవరకూ నళిని కులాసాగానే వుందట. కాని ఆ తరువాత ఒకటే ఎగపోతట. రాత్రి నళినికి నిద్ర పట్టలేదట.

మరుసటి ఉదయం తొమ్మిదిగంటలకి మధు ఆసుపత్రికి వెళ్ళే సరికీ, ఈ సంగతులన్నీ తెలియవచ్చాయి. వెంటనే ఆ వార్డుకి ఇన్‌చార్జ్‌గా వున్న డాక్టర్‌ని కలిసి, నళినిని చూచి వెళ్ళవలసిందిగా చెప్పాడు. డాక్టర్ వచ్చి నళినిని పరీక్షించి, అది ఫాల్సు ప్రెగ్నెన్సీ అని అన్నారు. మధుకి ఆ మాట వినడంతోనే నవనాడులూ క్రుంగిపోయాయి. "మరేమిటి గతి?" అని డాక్టర్‌ని అడిగాడు. "ఏమీ లేదు, ఆపరేషన్ చేయవల్సివుంటుం" దని డాక్టర్ చెప్పాడు. "ఏమీ భయం లేదుకదా?" అని డాక్టర్‌ని అడిగాడు మధు. "ఏమీ భయంలే"దని అతను హామీ యిచ్చిన తరువాత ఆపరేషన్ చేయించడానికి ఒప్పుకున్నాడు.

మధు ఆ సాయంత్రం వెళ్ళేసరికీ, ఇంకా ఆపరేషన్ జరగలేదు. ఏదో ముత్యాలగర్భమని తెలిసింది. రాత్రికి ఆపరేషన్ చేస్తారని డ్యూటీలో వున్న డాక్టర్ చెప్పింది. నళిని బాగా ఆయాసపడుతున్నది. శ్వాస ఆయాసంగా ఆడుతున్నది. ఒకటే ఎగపోత. తనని చూచి ఏదో మాట్లాడటానికి ప్రయత్నించింది నళిని, వద్దని వారించాడు మధు. సాయంత్రం ఆరు గంటలకి నళినిని వదిలి ఇంటికి వెళ్ళక తప్పిందికాదు మధుకి. ఆనాటి రాత్రి ఆ స్పెషల్ రూమ్‌లో వుండిపోతానంటే ఎవ్వరూ వినలేదు. గత్యంతరంలేక ఆరింటికి వెళ్ళిపోయాడు మధు.

మధుకి ఆనాటిరాత్రి అన్నం సహించలేదు. ఏదో ఎంగిలిపడి లేచాడు. ఎంతోకాలం తన గదిలో పచారుచేస్తూ గడిపాడు. ధ్యాస అంతా నళిని పైన వుంది. పట్టి చెత్త పడకగదిలో పచారు చేస్తున్నది. ఇంకా ఆపరేషన్ చేశారో లేదో? చేస్తే నళినికి ఎల్లా వుందో? ఎగపోత తక్కువైందో లేదో? తక్కువవుతే, నళినికి నిద్రపట్టిందో లేదో? కాలంతోపాటు, ఈ ప్రశ్నలు మధు మెదడులో తిరుగుతున్నాయి. కాలం ఆగదు ప్రశ్నాపరంపరలు ఆగవు. మెదడు వేడెక్కిపోతున్నది. ఏమీ తోచక మధు పక్కమీద వాలాడు. శరీరం విశ్రాంతి తీసుకుంటున్నది.

కాని మెదడుకి ఏమాత్రం విశ్రాంతిలేదు. పక్కమీద పడుకొనికూడా అది విశ్రాంతి తీసుకోలేకపోతున్నది. ఒకటేపనిగా ఆలోచిస్తున్నది.

నళినికి ఏమైనా ప్రమాదం సంభవిస్తే ? అల్లా జరగకూడదు. జరగడానికి వీలులేదు.

విధి బలీయమైంది. ఏమీ చెప్పడానికి వీలులేదు.

ఆ క్షణంలో విధినైనాసరే ఎదిరించడానికి నిశ్చయించుకున్నాడు మధు.

తను అశక్తుడు, అసమర్థుడు. విధిని ఎల్లా ఎదిరిస్తాడు ?

ఏమో ? అంతా అయోమయం.

బహుశా రాత్రి ఒంటిగంట దాటివుంటుంది.

కన్ను పొడుచుకున్నా కునుకు రావడంలేదు.

పడకగదిలో చీకటి. మధు గదిలో దీపం వేసుకోలేదు.

నలువేపుల్నించీ దట్టమైన చీకట్లు, బారులుతీరి పడకగదిలోకి పరుగెత్తుకొస్తున్నాయి.

ఆ చీకట్లు తనచుట్టూ వలయంగా పేరుకుంటున్నాయి.

చీకటి గోడలు వలయాకారంలో ఎత్తుగా లేస్తున్నాయి.

ఊపిరి ఆడడంలేదు.

చీకట్లు తనచుట్టూ సమాధి కట్టడంలేదుకద ?

క్షణక్షణానికీ తను చీకట్లల్లో కూరుకుపోతున్నాడు.

ఎక్కడో కుక్క ఏడుస్తున్నది.

ఎందుకో దానికి ఆ బాధ ?

ఎక్కడో గోడ పడిపోయిన చప్పుడు.

తాము కట్టుకుంటున్న యిల్లు కూలిపోవడం లేదుకద ?

తిరిగి నిశ్శబ్దత.

ఆ కుక్కకిమల్లే తానూ గట్టిగా ఏడిస్తే ?

కాని ఎందుకూ ఏడ్వడం ?

తనకి ఏదీ ఆపత్తు రాలేదే ?

కుక్కకి ఏదో ఆపత్తు వచ్చి ఉంటుంది. అందుకోసమే అది మనసారా ఏడ్వగలుగుతున్నది.

తను ఏడ్వాలేడు, ఊరుకోనూలేడు. సందిగ్ధావస్థ.

ఈ కారుచీకట్ల మధ్య ఎందుకో భయమేస్తున్నది. పోనీ లైటు వేసుకుంటే ?

తన బ్రతుకు కుక్కబ్రతుకుకన్నా కనాకష్టమా ?

చీకటిపాములు తన మెడచుట్టూ పాకుతున్నాయి. ఇంక చీకట్లని భరించడం కష్టం.

వెంటనే మధు లేచాడు. గదిలో లైటువేశాడు.

ఎందుకో తిరిగి ఊపిరి ఆడింది.

వచ్చి పక్కమీద కూర్చున్నాడు. ఏమీ తోచదు.

లేచాడు. గదిలో పచార్లుచేయడం మొదలెట్టాడు.

ఎంతకీ కాళ్లు నొప్పులు పుట్టవు. నిద్రరాదు.

రాత్రి ఎంత అయిందో తెలియదు.

ఎంతసేపు పచార్లుచేశాడో కూడా తెలియదు.

ఇంతలోకే మెట్లపైన అడుగుల చప్పుడు. మధు చేతిగడియారం చూచాడు. మూడుగంటలైంది. రాత్రి మూడుగంటలకి పైకి ఎవ్వరు వస్తున్నారా అనే ఆలోచన కలిగింది అతనికి.

పనిమనిషివచ్చి "టెలిఫోన్ వచ్చింది" అన్నాడు.

"ఎక్కడినించి ?" అని వెంటనే అడిగాడు మధు పనిమనిషిని.

"ఆసుపత్రినించి, కనకాంగి మాట్లాడుతున్నది" అన్నాడు పని మనిషి జవాబుగా.

మధుకి అమాంతంగా గుండె జారిపోయింది. ఉత్తరక్షణంలో తేరుకొని, గబగబా టెలిఫోన్ గదిలోకి పరుగెత్తాడు.

"హల్లో"

"నేను కనకాంగిని. వెంటనే మీరు ఆసుపత్రికి వచ్చేసెయ్యండి" అంది కనకాంగి ఆసుపత్రినించి.

"నళినికి ఎల్లా ఉంది?" అని అడిగాడు మధు ఆతురతగా.

"రాత్రి ఆపరేషన్ జరిగింది. ఎగపోత తగ్గలేదు. మీవాళ్ళ నెవ్వరినైనా టెలిఫోన్ చేసి పిలిపించమన్నారు" అంది కనకాంగి ఆసుపత్రి కొసనించి.

"ఇప్పుడే బయల్దేరుతున్నా" నన్నాడు మధు రిసీవర్ టెలిఫోన్ పైన పెడుతో.

"వెంటనే డ్రైవర్ని లేపి, కార్ తియ్యమని చెప్పు" అని ఆదేశించాడు మధు తనని టెలిఫోన్ గదిలోకి అనుసరించి వచ్చిన పని మనిషితో.

గదిలోకి వెళ్ళి పర్సుతీసుకొని, బట్టలు మార్చకండా ధోతీ, లాల్చీల తోనే ఆ వెంటనే బయల్దేరాడు మధు.

క్రిందికి వెళ్ళేసరికీ కార్ బయటికి తీసివుంది "ఆసుపత్రికి పోనివ్వ" మని చెబుతో మధు కార్లో కూర్చున్నాడు కార్ శరవేగంగా బయల్దేరింది. రోడ్లు నిర్మానుష్యంగా ఉన్నాయి. దారి పొడుగునా మధుకి ఏదో భయం. ఏదో బెంగ. హృదయం మంచిని కోరుకుంటున్నది. మెదడు దానికి భిన్నంగా ఆలోచిస్తున్నది. మంచీ, చెడుల మధ్య ఘోర సంగ్రామం జరుగుతున్నది. మెదడు పరిపరివిధాల ఎందుకు ఆలోచిస్తుంది? ఒక్క మంచినిగూర్చే ఎందుకు ఆలోచించదు? చెడులో మంచినీ, మంచిలో చెడుని ఎందుకు పరిశీలిస్తుంది? జీవితమే ద్వంద్వాల మయం కనక మెదడుకూడా ద్వంద్వాల్లో ఆలోచించడం నేర్చు

కుంటుందా ? ఏమో ? క్షణంలో ఏదో విపత్తు వాటిల్లుతుందని భయం. ఉత్తరక్షణంలో అంతా సవ్యంగా జరుగుతుందని ధైర్యం. ఆశానిరాశల మధ్య నలుగుతూ మధు ఆసుపత్రికి చేరుకున్నాడు.

కార్ ఆగీ ఆగకముందే కార్‌లోంచి దూకి ఆసుపత్రిగేటు దగ్గరికి వెళ్ళాడు మధు. తను ఫలానా పేషెంటు తాలూకునని చెప్పాడు. వాచ్‌మన్ ఏ అడ్డంకీ చెప్పకుండా మధుని లోపలికి వదిలాడు.

నళిని గదిలో స్పృహతప్పి ఉంది. కాని ఒకటే ఏగపోత.

మధు కళ్ళల్లో నీళ్ళు నింపుకుంటూ "నళినీ, నళినీ" అని పిలిచాడు.

జవాబులేదు.

ముత్యాలగర్భం ఎంతపని చేసింది ?

మధు ఆ వార్డుకి సంబంధించిన లేడీడాక్టర్ గదిలోకి పరుగెత్తాడు. ఆమె అంతకుక్రితమే నళినికి ఆపరేషన్‌చేసి హీటర్‌పైన కాఫీ కాచుకుంటున్నది. ఆ దృశ్యం చూచేసరికీ మధుకి అమాంతంగా చేదు మింగినట్లయింది. కొందరికి అది ప్రాణాపాయ సమయం. మరికొందరికి అది కాఫీ టైం.

లేడీడాక్టర్ ప్రశాంతత చూచి మధుకి అసహ్యమేసింది.

"నా నళినిని బ్రతికించు నీకు ఎంత డబ్బు కావలిస్తే అంత డబ్బు యిస్తాను" అని మధు లేటీడాక్టర్‌ని చూచీచూడడంతోనే పిల్లవాడికి మల్లే గొల్లుమన్నాడు.

నీళ్ళలో కాఫీపౌడర్ వేస్తున్నదల్లా మధు బెంబేలు పడిపోవడం చూచి ఆగిపోయింది లేడీడాక్టర్.

"ఆపరేషన్ సక్సెస్ అయిందా ? నళిని బ్రతుకుతుందా ? చెప్పండి ఆలస్యం చెయ్యకండి" అని మతిచెడినవాడికి మల్లే మధు ప్రశ్నపైన ప్రశ్న వేస్తున్నాడు, లేడీడాక్టర్‌కి సమాధానం చెప్పడానికి అవకాశం యివ్వకుండా.

"పేషెంటుకు శరీరంలో బొత్తిగా రక్తంలేదు తొమ్మిది గంటల తరువాత శరీరంలోకి రక్తం ఎక్కించాలి. ప్రస్తుతానికి మీరు వెళ్ళి ఈ మందులూ, ఇన్‌జెక్షన్‌లూ కొనుక్కురండి" అని లేడీ డాక్టర్ సమాధానం చెప్పింది. మధు అడుగుతున్న ప్రశ్నల్ని లక్ష్యంచేయకండా.

"నళిని బ్రతుకుతుందా లేదా ? ఆ ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పండి. ఇంక నేను వెళ్ళిపోతాను" అన్నాడు మధు చివరిప్రయత్నంగా.

"ఏమీ చెప్పడానికి వీలులేదు. మీరు మాత్రం తొందరగా వెళ్ళి ఈ మందులూ, ఇన్‌జెక్షన్‌లూ ఆలస్యం చెయ్యకండా తీసుకురండి" అని చెప్పింది లేడీ డాక్టర్ ఇన్‌జెక్షన్‌లూ, మందులపట్టిక వ్రాస్తూ.

ఆ పట్టిక తీసుకొని మధు, నళిని రూమ్‌లోకి వెళ్ళాడు. నళినికి ఆక్సిజన్ ఇస్తున్నారు. ఇంకా ఆమెకు స్పృహ రాలేదు. వచ్చే సూచనలు కూడా కనపడలేదు. ఒకమాటు నళిని మొహాన్ని దీర్ఘంగా పరికించి మందులకోసం బయల్దేరాడు మధు.

ఎమర్జెన్సీ కేసులకోసం ఏదో ఒక మందులకొట్టు రాత్రంతా తెరిచివుంటుందని వినికిడి. మధు ఆ మందులకొట్టు కోసం ఆ రాత్రి కార్‌లో వేటాడడం మొదలుపెట్టాడు. మొదట చార్‌మినార్, పత్తర్‌గట్టీలకి వెళ్ళాడు. ఏ మందులకొట్టూ తెరిచిలేదు. తరువాత న్యూ బ్రిడ్జ్, ఆబిడ్స్, రెసిడెన్సీలు గాలించాడు. ఎక్కడా ఏ మందులకొట్టూ కనపడలేదు. ఆలస్యం అవుతున్నకొద్దీ మధుకి పై ప్రాణాలు పైననే లేచిపోతున్నాయి. ఏదోఒకటి చెయ్యాలి. ఆరాత్రి మందులు సంపాదించాలి. "ఏమి చేయడమా" అని ఆలోచించాడు. తనకు "మీనన్ అండ్ సన్సు" ప్రొప్రైటర్ తెలుసునన్న సంగతి జ్ఞాపకం వచ్చింది మధుకి. ఆతను ఎక్కడో పత్తర్‌గట్టీలో వుంటాడు. అతని యిల్లు కూడా ఒకమాటు ఏదో సందర్భంలో చూచాడు మధు. పోనీ అక్కడికి వెడితే ? అతన్ని లేపి, కొట్టుకు తీసుకువచ్చి, మందులు తీసుకుంటే ? బాగానే

వుంటుందనుకున్నాడు మధు. వెంటనే "కార్ ఫత్తర్‌గట్టీకి పోనివ్వ" మన్నాడు డ్రైవర్‌ని. అప్పటికి నాలుగున్నర అయింది. ఇంక తెల్లవారడానికి గంటన్నరకాలం వుంది. ఒక అరగంటలో మందులు తీసుకొని ఆసుపత్రికి చేరుకోవాలి. గౌలీగూడ, అఫ్జల్‌గంజ్, న్యూబ్రిడ్జి దాటింది కార్. ఫత్తర్‌గట్టీ సమీపిస్తున్నది.....ఫత్తర్‌గట్టీ.....మధు వెనకాల నించి లెఫ్టు, రైటు అని దారి చెబుతున్నాడు డ్రైవర్‌కి. కార్ సందుల గుండా వెళ్ళుతున్నది. "మీనన్ అండ్ సన్సు" యజమాని యిల్లు గుర్తించాడు మధు. కార్‌లోంచి దిగి తలుపు దబదబ బాదాడు. మీనన్ బాపు పాటి మనిషి. అతను నెమ్మదిగా లేచి, తలుపు తెరిచేసరికి కొంత ఆలస్యమైంది. మధు, తలుపు తెరవడంతోనే అతనికి సంగతి సందర్భాలు వివరించి చెప్పాడు. అతను కోటువేసుకొని, అదే కార్‌లో మధుతో మందులకొట్టుకి బయల్దేరాడు. తిరిగి కార్ ఇంతకుముందే వచ్చినదారి పట్టింది. దారిలో మధు మీనన్‌తో ఏమీ మాట్లాడలేదు. న్యూబ్రిడ్జ్ చేరుకుంది కార్. మీనన్ కొట్టు తెరిచాడు, మందులు ఇచ్చాడు. కాని ఒక ఇన్‌జెక్షన్ దొరకలేదు. ఆ ఇన్‌జెక్షన్‌కోసం మీనన్‌తో కలిసి రెసిడెన్సీకి వెళ్ళాల్సివచ్చింది మధుకి. అక్కడ మీనన్ ఇంకొక కొట్టువాడిని లేపి, అతని కొట్టు తీయించాడు. అతని ఇల్లూ, కొట్టూ ఒకచోటే వుండడం వల్ల ఇంకెక్కడికీ వెళ్ళవలసిన అవసరం కలగలేదు. ఇన్‌జక్షన్ తీసుకొని మీనన్‌తో బయల్దేరాడు మధు ఆసుపత్రికి. అప్పటికి అయిదుంపావు అయింది. తను ఆసుపత్రి దగ్గర దిగి, మీనన్‌కి కృతజ్ఞలు చెప్పి, అతన్ని యింటి దెగ్గర డ్రాప్‌చేసి రమ్మని డ్రైవర్‌కి ఆదేశించి, మధు ఆసుపత్రిలోపలికి వెళ్ళాడు. లేడీ డాక్టర్‌ని కలుసుకున్నాడు. నళినికి ఇన్‌జెక్షన్ యిప్పించాడు. ఇంకా నళిని స్పృహతప్పే వుంది. ఆక్సీజన్ ఇస్తున్నారు. కాసేపు నళిని మొహంలోకి చూస్తూ, మధు పడకమీద కూర్చున్నాడు. ఎందుకో అమాంతంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నర్సా

కనకొంగి చూడకుండా జేబురుమాలుతో తనకళ్ళని తానే తుడ్చుకున్నాడు. ఈ ప్రపంచంలో ఒక్క నళిని తప్ప తనను ఓదార్చేవాళ్ళు ఎవ్వరూ కనపడలేదు. నళిని తనని ఓదార్చే స్థితిలో లేదు. అందువల్ల తననితానే ఓదార్చుకోవాలి. తనకితానే ధైర్యం చెప్పుకోవాలి. ఎందుకో ఆసుపత్రిలో కూర్చుని, కంట నీరుపెట్టే సమయం అదికాదని తోచింది మధుకి. వెంటనే అక్కడినించిలేచి, ఫామిలీ డాక్టర్ దగ్గరికి కారులో బయల్దేరాడు. నిజమే ఆమెను తీసుకొస్తే ఏమైనా మేలు జరుగుతుందేమో? ఆమె ఏ పెద్ద డాక్టర్నైనా కన్సల్టుచేయవచ్చు. తొమ్మిదిగంటలకు గాని డాక్టర్లు ఎవ్వరూ రాదు. అయినా తమ ఫామిలీడాక్టర్, పెద్దడాక్టర్కి ఎవరికైనా టెలిఫోన్ చేసి పిలిపించవచ్చు. ప్రవాహంలో కొట్టుకుపోతున్నవాడికి ఏ పూచిక పుల్లయినా అడ్డంపడవచ్చు. ఈ తుది క్షణంలో ఏ ఆలోచనైనా తన కష్టాల్ని గట్టెక్కించవచ్చు. కారు వాయువేగంగా పరుగెడుతున్నది. అప్పుడే కాచిగూడా చౌరస్తా దాటింది. నారాయణగూడ, హిమాయత్ నగర్...అమ్మయ్య, హిమాయత్నగర్ వచ్చేసింది. ఆ సందు మలుపు దాటితే డాక్టర్ యిల్లు కనపడుతుంది. లేడీడాక్టర్ యింటి వాకిలితలుపు తీసే వుంది. మధు వెళ్ళి వెళ్ళడంతోనే డాక్టర్కోసం బెల్లునొక్కాడు. డాక్టర్ వెలుపలికి వచ్చింది. పరిస్థితి చెప్పాడు మధు. వెంటనే బయల్దేరమన్నాడు లేడీ డాక్టర్ని. ఇంతలోనే పనిమనిషి రెండు కప్పుల్లో కాఫీ తీసుకు వచ్చింది. ఒకకప్పు డాక్టర్ కిచ్చింది. ఇంకొక కప్పు తనకు అందించింది. మెకానికల్గా కాఫీచప్పరించాడు మధు. చేదు విషం. కాఫీ అంత చేదెందుకుంది? ప్రమాదమేమైనా జరగదుకద? ఆ భావం కలగడంతోనే కాఫీ ఇంకొకసారి చప్పరించి చూడకండానే నిండుకప్పు టేబుల్పైన పెట్టాడు మధు. మధు నిండుకప్పు టేబుల్పైన పెట్టడం లేడీడాక్టర్ చూచింది. కాని తాగమని మధుని బలవంతంచేయలేదు. ఆపత్సమయంలో ఎల్లా మెసులుకోవాలో ఈ డాక్టర్లకి తెలిసినంతగా ఎవ్వరికీ తెలియదు. బల

వంతం చేస్తే మధు ఘోరున ఏడ్చేసేవాడే. ఏమీ జరిగినట్లు నటించి, లేడీ డాక్టర్ కాఫీ తాగి మధు వెంట కారులో బయల్దేరింది. కారు ఆసుపత్రికి చేరుకోవడంతోనే యిద్దరూ నళిని గదిలోనికి వెళ్ళారు. లేడీ డాక్టర్ నళినిని దీర్ఘంగా పరీక్షించి, తెచ్చిన ఇన్‌జక్షన్లలోంచి ఒకటొకటి యివ్వమని ఆసుపత్రి డాక్టర్‌కి సలహా యిచ్చి, టెలిఫోన్ దగ్గరికి వెళ్ళింది. మధు అచేతనంగా ఆమెని అనుసరించాడు. అతని ఆశలన్నీ ప్రస్తుతానికి ఫామిలీ డాక్టర్‌పైన వున్నాయి. ఆమె టెలిఫోన్‌లో ఎవ్వరినో డాక్టర్ని వెంటనే రమ్మని చెబుతున్నది. ఆమె టెలిఫోన్ చెయ్యడం పూర్తికాగానే "నళినికి ఎల్లా వుం"దని అడిగాడు మధు. ఆమె ఏమీ సమాధానం చెప్పకండా తిరిగి నళిని గదిలోకి వెళ్ళిపోయింది. ఎందుకో ఆమెని అనుసరించడానికి బుద్ధి పుట్టలేదు మధుకి. పెద్దడాక్టర్ కోసం ఎదిరిచూస్తూ నళిని గదివెలుపల పచార్లుచేస్తూ వుండిపోయాడు. ఎంతసేపు పచార్లుచేసాడో అతనికే తెలియదు. సిగరేటుపైన సిగరేటు వెలిగిస్తున్నాడు. సిగరేటుపైన సిగరేటు తాగి, కాలిన మొనలు నలిపివేస్తున్నాడు. కొంతకాలానికి డాక్టర్ అప్పారావు వచ్చాడు. అతను ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌కి హెడ్. నళినిని దీర్ఘంగా పరీక్షించాడు. శరీరంలో రక్తం ఎక్కించడం చాలా అవసరమని చెప్పాడు. వెంటనే వెళ్ళి బ్లడ్‌బాంక్‌లో రక్తంతీసుకు రమ్మన్నాడు మధుని. "డాక్టర్ ప్రమాదంఏమీ లేదుగద?" అని అడిగాడు మధు, తన పంచప్రాణాలతో సమాధానంకోసం ఎదిరిచూస్తూ- "కేస్ సీరియస్‌గా వుంది. వెంటనే వెళ్ళి రక్తం తీసుకురండి" అని అన్నాడు డాక్టర్ అప్పారావు జవాబుగా- డ్యూటీ డాక్టర్ ఏదో చీటీవ్రాసి యిచ్చింది. "పేషంట్ రక్తంతో ఎవరి రక్తం కలుస్తుందో, యిద్దరు ముగ్గురు మనుషుల్ని తీసుకొని వెళ్ళండి" అని కూడా డ్యూటీ డాక్టర్ సలహాయిచ్చింది. మధు కార్‌లో వెంటనే ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌కి బయల్దేరాడు. అప్పటికి తొమ్మిదిగంటలైంది. అదృష్టవశాత్తు బ్లడ్ బ్యాంకుకి సంబం

ధించిన డాక్టర్ సెక్షన్‌లోనే వున్నాడు. వెంటనే అతను మధు రక్తం పరీక్షించాడు. "మీ రక్తం కలవదని" చెప్పాడు డ్రైవర్ రక్తం పరీక్షించాడు. అదికూడా నళిని రక్తపు గ్రూప్‌కి సంబంధించిందికాదు. మధు వెంటనే కనకాంగి కోసం పంపించాడు డ్రైవర్‌ని. ఈమధ్య డబ్బు యిస్తామని చెప్పి. ఆసుపత్రిలోని యిద్దరు ముగ్గురు పనిమనుషుల రక్తాన్ని కూడా పరీక్షించాడు బ్లడ్ బ్యాంకుకి సంబంధించిన డాక్టర్. ఎవ్వరి రక్తం కూడా నళిని గ్రూపుకి సంబంధించిందికాదు, తలా ఒక రూపాయి యిచ్చి, ఆ పనిమనుషుల్ని పంపించివేశాడు మధు ఇంతలోకే కనకాంగి వచ్చింది. డాక్టర్ ఆమె రక్తాన్ని పరీక్షించి, ఆ రక్తం పనికి వస్తుందని చెప్పాడు. కనకాంగి వెంటనే తన రక్తం యివ్వడానికి సంసిద్ధపడ్డది. రక్తదానంచేసి, కనకాంగి విశ్రాంతి తీసుకుంటుండగా, మధు రక్తం తీసుకొని బయల్దేరాడు. ఆ తొందరలో తిరిగి కార్ పంపిస్తానని చెప్పడం కూడా మరిచిపోయాడు మధు కనకాంగితో. జనానా ఆసుపత్రి ముందు కార్ ఆగడంతోనే, ఎక్కడ ఆలస్యమైపోతుందేమోనని కార్‌లోంచి చెంగున గంతువేశాడు. వెళ్ళి డ్యూటీ డాక్టర్‌కి రక్త సీసా అందించాడు. ఆమె వెంటనే నర్సు సహాయంతో, ఆ సీసాలో కార్కు ద్వారా ఒక గాజుగొట్టం దిగవేసి, దానికి రబ్బర్ ట్యూబు అమర్చి, ట్యూబు ఇంకొక చివరకి ఇన్‌జక్షన్ యిచ్చే పిచ్కారీ పెట్టి, ఆ సూది నళిని చేతికి గుచ్చింది. ప్రెషర్ సరిగ్గావుందని నమ్మకం కుదిరినతరువాత సీసా ఒక కొండిమీద బోర్లించింది. గాజుగొట్టంలో బుడగలుకనపడుతున్నాయి. డ్యూటీ డాక్టర్ బుడగల్ని పరీక్షించి, రక్తం శరీరంలోకి వెడుతున్నదని చెప్పింది. మధు దగ్గరగా ఒకకుర్చీ వేసుకొని, ఆ రక్తం బుడగల్ని చూస్తూ కూర్చున్నాడు. గాజుగొట్టంలో నెమ్మదిగా బుడగలు నళిని శరీరంవేపు కదిలివెడుతున్నాయి. బుడగలకదలిక ఆగిపోవడంతోనే, డ్యూటీడాక్టర్ రక్తం ఎక్కించేయంత్రాన్ని సరిచేస్తున్నది. ఆ బుడగల్ని చూస్తుంటే,

మానవజీవితం బుద్బుదప్రాయం అనే లోకోక్తి ఎందుకో జ్ఞాపకం వచ్చింది మధుకి. "ఆ లోకోక్తి ఎల్లా వాడుకలోకి వచ్చిందా?" అని ఆలోచించడం మొదలెట్టాడు అతను. మానవజీవితం క్షణికం. బుడగ కూడా క్షణంకన్నా ఎక్కువ ఆగదు. ఈ రెండింటికీ గల సామ్యాన్ని బట్టి, ప్రపంచంలో ఈ లోకోక్తి పుట్టిందా? అయితే కావచ్చు. ప్రాణం ఏ క్షణంలో ఎగిరిపోతుందో? బుడగకూడా ఏ క్షణంలో పగులుతుందో? బుడగలో గాలి వుంటుంది. బుడగ పగలడంలోనే దాన్లోంచి గాలి ఎగిరిపోతుంది. ప్రాణంకూడా ఒక వాయువేనా? బుడగలోంచి గాలి ఎగిరిపోయినట్లే, శరీరంలోంచి ప్రాణం ఎగిరిపోతుందా? ప్రాణం వాయువే కావచ్చు. అందుకోసమే కావచ్చు కళ్ళల్లోంచి ప్రాణం పోయిం దంటారు. వాయువు కాకపోతే కళ్ళల్లోంచి ప్రాణం ఎల్లాపోతుంది? ఇంతకీ "ప్రాణం పోవడం" అనే భావం తనకెందుకు కలిగినట్లు? నళిని శరీరంలోకి రక్తం పోతున్నది. ఇంక దానికి ప్రాణభయం లేదని తనకితాను నచ్చచెప్పుకున్నాడు మధు. శరీరంలో రక్తం లేకపోవడం వల్లనే నళిని జబ్బుపడ్డది. ప్రస్తుతం రక్తం ఎక్కిస్తున్నారు. అందువల్ల జబ్బు నయంకాక తప్పదనుకున్నాడు మధు. ఇంక ముత్యాలగర్భం భయంలేదు. ఆపరేషన్ చేసి కడుపులో పెరిగిన మర్మాంసాన్ని తొలగించివేశారు. ముత్యాలగర్భం తొలగిపోయింది. ఇక మిగిలిందల్లా శరీరంలో రక్తం లేకపోవడమే. ప్రస్తుతం ఆ రక్తక్షీణతకి కూడా చికిత్స జరుగుతున్నది. ఏవిధంగా ఆలోచించినా, గండం గడచిపోయినట్లే తోచింది మధుకి. ఒక రెండుగంటలకి ఎగపోతకూడా తగ్గిపోతుంది. తిరిగి నళిని మామూలుమనిషి అవుతుంది. ఇంకా రక్తం తక్కువవుతే ఇంకెవరినైనా ప్రాధేయపడి రక్తం యిప్పించవచ్చు. గుండెమీదనించి ఏదో పెద్దబరువు తీసివేసినట్లైంది మధుకి. మహా ఎక్కువవుతే, ఇంకొక ఎనిమిదిరోజులు పడకవేస్తుంది నళిని ఆ ఆసుపత్రిలో. ఆ తరువాత

యింటికి తిరిగి వస్తుంది తిరిగి యిల్లు కట్టించడంలో నిమగ్నమవుతుంది. ఆ తరువాత గృహప్రవేశం. ఎందుకో యిల్లు మార్చడం అవసరమని తోచింది మధుకి. పాత యింట్లో తమకి ఎన్నో కష్టాలువచ్చాయి. ఇంక కొత్త యింట్లో ఈ కష్టాలు వుండవు జీవితం శాంతంగా, సుఖంగా గడచిపోతుంది. ఆ క్షణంలో కన్నీటి కెరటాల్లో వెన్నెలలు కనపడ్డాయి మధుకి. నిట్టూర్పుగాడ్పులో నెత్తావిని పసికట్టింది మధు హృదయం.

నళిని శరీరంలో రక్తం ఎక్కించడం మొదలుపెట్టి అరగంటకి పైగా దాటింది. ఆ రక్తమంతా ఎక్కించడానికి మూడుగంటలకి పైగా పట్టవచ్చు నని చెప్పింది తమ ఫామిలీడాక్టర్. అంతవరకు నళినికి స్పృహకూడా రాకపోవచ్చునని కూడా అంది. ఆ మూడుగంటలు అక్కడ కూర్చొని ఏమి చెయ్యడం ? ఇంటికి వెళ్ళి స్నానంచేసి వస్తే ? వచ్చేటప్పుడు ఇద్దరు ముగ్గురు పనిమనుషుల్ని కూడా వెంటబెట్టుకొని రావచ్చు. అవసరమైతే నళినికి రక్తం యిప్పించడానికి. నిజమే, అక్కడ కూర్చొని ఏమీ ప్రయోజనం ఉండదని తోచింది మధుకి. ఒక గంటలో తిరిగివస్తానని కనకాంగితో చెప్పి కార్‌లో యింటికి బయల్దేరాడు మధు. స్నానంచేసి వస్తామనే ఉద్దేశంలో.

ఇంటికి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకొని, మొహం కడుక్కొని స్నానాల గదిలోకి వెళ్ళాడు మధు. ఒంటిపైన రెండు చెంబులు నీళ్ళు పోసుకున్నాడో, లేదో ఎవరో పనిమనిషి వచ్చి స్నానాల గదితలుపులు తట్టాడు. "ఏమిటి?" అని లోపల్నించి అడిగితే, "టెలిఫోన్ వచ్చిం" దన్నాడు. "టెలిఫోన్ ఎక్కడినించా?" అని మధుకి పరిపరివిధాల ఆలో చనలు పోయాయి. ఇంతకు ముందే తను ఆసుపత్రినించి వచ్చాడు. బహుశా అక్కడినించి కాకపోవచ్చు. నళినికి స్పృహ ఏమైనా వచ్చిందా? మూడు నాలుగు గంటలవరకూ డాక్టర్ రాదని చెప్పిందే. నళిని శరీర స్థితిని కనుక్కోవడానికి ఆమె స్నేహితు లెవరైనా టెలిఫోన్ చేసి

వుంటారా? ఏమో? ఎందుకైనా మంచిదని మధు స్నానం త్వరత్వరగా ముగించాడు. ధోతి కట్టుకొని బనియన్ వేసుకుని గబగబా టెలిఫోన్ దగ్గరికి వెళ్ళాడు.

"హలో, హలో"

"మీరు వెంటనే ఆసుపత్రికి వచ్చేయండి. వచ్చేటప్పుడు రామచంద్రయ్యని కూడా మీ వెంట తీసుకురండి" అని కనకాంగి ఆసుపత్రి నించి చెప్పింది.

"ఇప్పుడే బయల్దేరుతున్నా" నని రిసీవర్ పెట్టాడు మధు టెలిఫోన్ మీద.

చొక్కా వేసుకొని వెంటనే రామచంద్రయ్యతో సహా, కార్‌లో ఆసుపత్రికి బయల్దేరాడు ఎందుకో కార్ నెమ్మదిగా వెడుతున్నట్లు తోచింది మధుకి. "త్వరగా పోనివ్వ" మని దారిలో రెండుమూడుసార్లు హెచ్చరిక చేశాడు డ్రైవర్‌కి కార్ మనోవేగంగా వెడుతున్నది ఆసుపత్రికి.

కార్ దిగి త్వరగా వార్డులోకి వెళ్ళాడు మధు. తనని చూడడం తోనే కనకాంగి "ధొరసాని మనల్ని వదిలిపెట్టి వెళ్ళిం" దని గొల్లు మన్నది. ఒకక్షణం వరకూ మధుకి ఏమీ అర్థంకాలేదు. ముందుకు సాగుతున్నవాడల్లా నిశ్చేష్టుడై ఆగిపోయాడు. ఉత్తరక్షణంలో తేరుకొని విషయాన్ని గ్రహించి భోరున ఏడుస్తూ నళిని గదివేపు పరుగెత్తాడు. ఆ ఏడుపుకి హాస్పిటల్ స్టాఫ్, ముఖ్యంగా ఆ చుట్టుపక్కల వున్నవాళ్లు అక్కడ పోగైన సంగతి మధు గమనించలేదు. దారిలో తమ ఫామిలీ డాక్టర్ అడ్డగించి, మధుని గదిలోకి వెళ్ళనివ్వలేదు. "డాక్టర్ నా నళిని ఏదీ? నన్ను ఒక్కసారి చూడనివ్వండి డాక్టర్" అని మధు ఏడుస్తూ ఆమెని ప్రాధేయపడ్డాడు. ఆమె స్త్రీ అనే సంగతికూడ మరిచి, ఆమె రెండు బుజాలూ పట్టుకొని పక్కకి తొలగించడానికి ప్రయత్నించాడు.

"మధుసూదనరావుగారూ ఇది ఆసుపత్రి, ఆ ఏడ్పు ఏమి"టని ఆమె హెచ్చరికచేసింది. "నా నళిని పోయినతరువాత యిది ఏమవుతే నా కెందుకు డాక్టర్, నన్ను ఒక్కసారి నళినిని చూడనివ్వండి డాక్టర్" అని తిరిగి మధు డాక్టర్‌ని ప్రాధేయపడ్డాడు. "నేను శవాన్ని యింటికి తీసుకొస్తాను. కార్‌లో మీరు యింటికి వెళ్ళండి" అని నచ్చజెప్పుతున్నది ఆమె మధుకి. "నేను నళినిని నిండుప్రాణంతో ఆసుపత్రికి అప్పగించాను. మీరు నాకు నళినిశవాన్ని యిస్తారా డాక్టర్ ?" అని తిరిగి భోరున ఏడ్చాడు మధు "మధుసూదనరావుగారూ, మీరు ధైర్యంగా ఉండకపోతే ఇక్కడనే అంత్యక్రియలకి ఏర్పాటుచేస్తాను" అని బెదిరించింది డాక్టర్, మధుని అతని ఏడుపుకి సమాధానంగా. ఇంతలోకే కిశోర్ ఏడుస్తూ ఆసుపత్రికి వచ్చాడు. అతన్ని చూడడంతోనే, "ఇంక మీ వదిన లేదు నాన్నా" అని కిశోర్‌ని కౌగలించుకొని గట్టిగా ఏడ్చాడు మధు. "మధుసూదనరావుగారూ. మీరు ఆసుపత్రిలో పెద్ద సీను క్రియేట్ చేస్తున్నారు. ఇక్కడ ఎందరో రోగులు ఉంటారన్న సంగతి మరచిపోకండి" అని తిరిగి హెచ్చరిక చేస్తూ, మధుని బలవంతంగా లాక్కువచ్చి కార్‌లో కూర్చోబెట్టింది డాక్టర్. కిశోర్ కూడా కార్‌లో ఎక్కాడు. కార్ కదిలింది. దారిపొడుగునా ఎంతోమంది ఇటూ, అటూ వెడుతున్నారని కూడా తెలుసుకోకండా, మధు గట్టిగా ఏడుస్తూనే వున్నాడు. దారిపొడుగున అందరూ కార్‌వంక చూడడం కార్‌లో వున్నవాళ్ళెవ్వరూ గమనించ లేదు.

మధు ఏడుస్తో యింటిముందర కారుదిగాడు. ఆ ఏడుపుకి పని మనుషులందరూ యింటిముందర పోగైనారు. దాయి బాబుని ఎత్తుకు వచ్చింది. బాబుని చూడడంతోనే, మధుకి దుఃఖం పొంగి పొరలివచ్చింది. "బాబు మీ అమ్మ ఏదీ ?" అని బాబుని దాయిచేతుల్లోంచి తీసుకుంటూ ఏడ్చాడు మధు బాబు ఏడ్చాడు ఎందుకో. పిల్లవాడు దిగులుపడిపోతాడని చెప్పి, దాయి బాబుని తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

కొంతకాలానికి లారీలో నళిని శవాన్ని తీసుకువచ్చారు శవాన్ని ఇద్దరు, ముగ్గురు మనుషులు పట్టుకొచ్చి ముందుగదిలో పడుకోబెట్టారు. మధు శవంపైన పడి, ఒకటేపనిగా ఏడ్చాడు ఎంత ఏడ్చినా తనివి తీరలేదు.

ప్రేతయాత్రకోసం బయట సన్నాహాలు జరుగుతున్నాయి. పాడె కట్టారు. స్నానం చేయించడంకోసం మృతకళేబరాన్ని వెలుపలికి తీసుకు వెడుతున్నారు. ఎందుకో నళినిశరీరం చల్లగాలేదు. "డాక్టర్, డాక్టర్ నళిని చనిపోలేదు. ఒకమాటు చూడండి" అని ఆసుపత్రినించి శవాన్ని తీసుకు వచ్చిన ఫామిలీ డాక్టర్‌ని మధు అడిగాడు. శరీరం బిగ్రబిగిసిపోకుండా చనిపోవడంతోనే, గుండెకి ఇన్‌జక్షన్ ఇచ్చానని లేడీడాక్టర్ చెప్పింది. మధు ఆమెమాటలు నమ్మలేకపోయాడు. "డాక్టర్ మీరు నా చెల్లెలిలాంటి వారు ఎల్లాగన్నా నళినిని బ్రతికించండి. మీ రుణం నేను ఉంచుకోను" అని పిల్లవాడిలాగా మధు, డాక్టర్‌ని గమువపట్టుకొని బతిమలాడాడు. ఆ దృశ్యానికి డాక్టర్‌కి దుఃఖం ఆగలేదు. ఆమెకూడా అమాంతంగా గొల్లుమన్నది పనిమనుషు లందరూ గొల్లుమన్నారు.

పిడకల తంపిమీద పెట్టిన కుండ తెచ్చి, దానిలోని నీళ్ల శవం పైన పోశారు. దాసీలు కలిసి ఇంకొక నీరకట్టారు. పసుపు పూశారు. కుంకుమబొట్టు పెట్టాడు. నోట్లో తమలపాకు పెడితే నోట్లో యిమడ లేదు. పూలు పెట్టారు. శవాన్నిపాడెలో పెట్టి తాళ్ల బిగించారు.

"అదృష్టవంతురాలు - ముత్తైదగా వెళ్ళిపోతున్నది" అని ఎవరో దాసి అనడం మధుకి వినపడింది.

"నిజమే నళిని అదృష్టవంతురాలే - తానే దురదృష్టవంతుడు" అని అనుకున్నాడు మధు.

పాడె లేపుతుండగా గొల్లున ఎక్కడినించో నవ్వు వినపడింది మధుకి నిప్పుపట్టుకొని ముందర నిలుచున్నవాడల్లా వెనక్కి తిరిగి

చూచాడు మధు. కుసుమ వరండాలో నిలబడి నవ్వుతున్నది ఆ దృశ్యం చూచి మధు హృదయం తరుక్కుపోయింది.

ప్రేతయాత్ర సాగింది. శవాన్ని బొందలో పెట్టినతరువాత మొదట తనని మన్ను వేయమన్నారు అందరూ. మధు హృదయం ఒప్పుకో లేదు. ఏడుస్తూ నిలబడిపోయాడు. మన్ను చల్లలేదు. అందరూ తలా కాస్త మన్నువేశారు. ఆ తరువాత మనుషులు బొంద పూడ్చారు. అందరితోపాటు మధూ స్నానంచేశాడు. అంత్యక్రియలు జరిపి యింటికి వచ్చేసరికి సాయంత్రం ఆరుగంట లైంది.

ఉదయంనించీ డాక్టర్ యిచ్చిన గుక్కెడు కాఫీ తప్ప పచ్చిమంచి నీళ్ళయినా తాగలేదు మధు. తిన్నా, తినకపోయినా ఆ యింట్లో తనని ఇంక భోజనం చెయ్యమని బలవంతం చేసేవాళ్లు ఎవ్వరూ మిగలలేదు. కాగా ఆ రోజు ఎందుకో భోజనంచెయ్య బుద్ధిపుట్టలేదు మధుకి. అన్నం తినడం మానివేశాడు. ఉదయనించీ ఏడ్చీ ఏడ్చీ తల బద్దలవుతున్నది. ఎందుకో ఆ సాయంత్రం ఏడ్పుకూడా రావడంలేదు. ఏడ్చీ ఏడ్చీ కళ్ళల్లో నీళ్లకూడా మిగలలేదేమో? ఒకటే తలనొప్పి. ఏమిచేయడం? జీవితానికి మల్లే తలనొప్పి కూడా తనని వేధించుకుతింటున్నది. పోనీ, కాసేపు పడుకుంటే? తనకి సూతకం. తన గదిలోకి వెళ్ళడానికి బుద్ధిపుట్టలేదు. గదికూడా మార్చివేయడం మంచిదేమో? పూర్వస్మృతులు తనని వేధించకుండా వుంటాయి. ఒక మంచం తెప్పించి, కిశోర్ గదిపక్కన వున్న గదిలో పక్కవేయించుకున్నాడు. ఆ గదిలో ఒక పడకకుర్చీ కూడా వేయించుకున్నాడు. బాబుని ఒకమాటు చూచి పైకి వెడుదా మనుకుంటే బాబు పడుకున్నాడు. కాస్త టీ కాచమని చెప్పి మధు పైకి వెళ్ళాడు. వెళ్ళి మంచంమీద నడుము వాల్చాడు.

ఎందుకో తన ప్రపంచం కుదించుకుపోయినట్లు తోచింది మధుకి. సువిశాలత్వాన్ని కోల్పోయి సంకుచితమైంది. ఆ సంకుచిత ప్రపంచంలో

తనకు మిగిలిం దేమిటి? రెండేళ్ళు దాటిన పసిపాప, వినయబాబు. ఎదిగీ ఎదగని కిశోర్, పిచ్చి కుసుమ - కొన్ని కన్నీళ్లు, మరికొన్ని వేడి నిట్టూర్పులు - తన ఆశలు చిగురించకముందే వాడిపోయినాయి. మరి జీవితంలో తను కన్న కలలు ఏమైనట్లు? పండుటాకులు రాలినట్లు జీవితవృక్షంనించి రాలిపోయాయా? జీవితాన్ని శాశ్వతంగా మోసుచేసి పోయాయా?

తను జీవితాన్ని ఏమి చూసినట్లు? ఏమి అనుభవించినట్లు? ఇంతలోకే పిడుగుపడి తన జీవితాన్ని నుసిచేయడ మేమిటి?

జీవిత ప్రవాహం తనని ఏగట్టుకు చేర్చినట్లు? కన్నీటి గట్టుకా?

జీవితం తనపైన ఇంతగా పగతీర్చుకోవడం దేనికి? తను ఏపాపమూ చేసి ఎరగదే?

జ్ఞానం వచ్చేసరికి తల్లి దుశ్శీలం ఆకాశం ఎత్తున లేచి భయంకరంగా తనముందు నిలిచింది.

తనని అసమర్థుడినీ, అశక్తుడినీ చేసింది.

ఆర్థిక స్వాతంత్ర్యంవల్ల తను ప్రయోజకుడిని అవుతానేమోనని భ్రమసి, తను ఉమామహేశ్వరరావుగారి యింట్లో ట్యూషన్ కుదుర్చుకున్నాడు.

ఇంతలోకే కుసుమ ప్రేమోదంతం ప్రారంభమయింది.

అంతలోకే అది భగ్నం కావడం దేనికి?

తనతల్లి దుశ్శీలానికిగాని, కుసుమప్రేమ భంగం కావడానికిగాని తను ఏమాత్రం బాధ్యుడు కాడే?

హఠాత్తుగా తనకి నళిని సన్నిహితమైంది. వివాహం జరిగింది.

ఆ హఠాత్సంఘటనకి కూడా తను ఏమాత్రం బాధ్యుడు కాడు. ఆనాడు పరిస్థితుల ప్రోత్సాహానికి తను లొంగిపోయినాడు. నళిని కూడా లొంగిపోయింది.

నళినితో మూడు సంవత్సరాలు ఒకుదుకుకులుగా గడిచాయి

అంతలోకే పిడుగు పడింది. తనజీవితాన్ని శూన్యంతో నింపింది.

విధి తనజీవితంతో ఒక ఆట ఆడింది. తను నిమిత్తమాత్రుడుగా జీవితం విసిరినపాచికకి తల ఒగ్గాడు. దీనిలో తన ప్రయోజకత్వం ఏముంది ? అసమర్థుడిగా తను జీవితం ప్రారంభించాడు. అసమర్థుడుగా జీవితయాత్ర గడుపుతున్నాడు.

ఆనాడు నళిని జన్మదినోత్సవానికి సంబంధించిన పార్టీలో ఎందరో యువకులు ఎన్నో ప్రగల్భాలు పలికారు. వాళ్ళంతా సాధించిందేమిటి ?

తనజీవితం భగ్నమైంది.

నళిని చనిపోయింది.

కుసుమ పిచ్చిదైంది.

ఆయెషా, రెహానాలు బొంబేకి వెళ్ళి ఏ ఫిల్ములోకూడా పాల్గొన కండానే, భగ్నహృదయంతో తిరిగివచ్చినట్లు వినికిడి. జీవితంలో వాళ్లు మాత్రం ఏం సాధించగలిగారని ?

సలీం ఏమైనాడో తెలియదు.

నేటి పరిస్థితుల్లో ఏ యువహృదయం ఏమీ సాధించలేదా ? లేక తన కామిళ్ళకళ్ళకి ప్రపంచం అంతా పచ్చగా కనపడుతున్నదా ?

ఏది ఎట్లున్నా తననిమాత్రం జీవితం మోసం చేసింది.

ప్రారంభం కాకముందే ఒక మూడు సంవత్సరాల్లో తన జీవితం ముగిసింది.

జీవిత ప్రవాహంలో తను ఎటో కొట్టుకుపోతున్నాడు. ఏవేపు కొట్టుకుపోతున్నాడో తనకే తెలియదు. పూచికపుల్లకిమల్లే ఆ ప్రవాహానికి తనని తాను అర్పించుకున్నాడు. అంతే.

ఉమామహేశ్వరరావుగారి యింట్లో మొదటిసారిగా అడుగు పెట్టి నప్పుడు, మెట్లపైన వున్న ఇనుపకమ్మీలు తనని బంధించివేస్తున్నట్లు తోచింది.

నిజమే. ఆ ఇనుపకమ్ములు తనవి శాశ్వతంగా ఆ ఇంట్లో బంధించివేశాయి. ఆనాడు మెరుపుకుమల్లే తన మెదడులో రిలగా మెరిసిన భావం. నేడు నగ్నసత్యమై తన అసమర్థతని చూచి వేనోళ్ళ నవ్వుతున్నది.

ఎవ్వరో తన మొహానికి మసిపూసి వెళ్ళారు. ఆనాడు తెల్లవారు ఝామున తనకువచ్చిన కల నేడు నిజమైంది.

చీకటిపడింది. నలువేపుల్నించి చీకట్లు తరుముకువచ్చి మధుని ఆ నూతిలో బంధించివేశాయి.

పాపం మధుకి ఊపిరి ఆడలేదు.

కాని చీకట్లకి ఏమి దాక్షిణ్యం? అవి నిర్దాక్షిణ్యంగా మధుని చీకటి నూతిలో శాశ్వతంగా కూర్చివేశాయి.

★